# వాల్మీకి రామాయణము

## బాలకాండ



శ్రీ శ్రీనివాస శిరోమణి



శిరోమణి
147/4 బాలాజీ నగరు
రాయపేట : మద్రాసు.

# పీఠిక

శ్రీ సీతారాములు ఆంధ్రుల ఇష్టదేవతలు. వారి దివ్యత్వము మొట్టమొదట మన ఆంధ్రదేశములో గోదావరీతీరాన ఈలోకానికి ద్యోతకము అయింది. ఆ దంపతులు మన ఆంధ్రదేశములో పన్నెండు సంవత్సరాల పై చిల్లర కాలము కాపురము చేసినారు.

ఆనాటినుంచీ నేటివరకూ మన ఆంధ్రదేశములో రామమందిరము లేని ఊరు కానీ, రాముడికి సంబంధించిన ఏదో ఒక పేరు పెట్టుకోని ఇల్లు కానీ లేదు. అయితే ఆంధ్రదేశములో స్త్రీపురుషులు అందరూ అన్యసహాయము అపేక్షించకుండా స్వయముగా చదువుకొని ఆనందించే రామాయణకావ్యము మాత్రము మన ఆంధ్రభాషలో నేటివరకూ రాలేదు.

రామాయణకావ్యాన్ని ఆంధ్రరచయితలు తరతరాలవారున్నూ రచించినారు. కాని జనరంజకము అయిన రామాయణకావ్యము—అంటే నన్నయాదుల శ్రీమహాభారతము వలెనూ పోతనాదుల శ్రీమద్భాగవతము వలెనూ జనరంజకము అయిన గ్రంథము—రాలేదు. ఆధునికులలో—అంటే క్రిందటి శతాబ్దము మధ్యభాగము నుంచి నేటివరకూ రచయితలు—వాల్మీకి రామాయణమును భాషాంతరీకరించినవారిలో శ్రీ గోపీనాథము వెంకటపతిగారు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు ప్రసిద్ధులు. స్వతంత్రముగా రామాయణమహాకావ్యాలు వ్రాసిన వారిలో శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రులుగారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రసిద్ధులు. ఈ అయిదుగురు బ్రహ్మణ్యులూ ఆంధ్రములో చెప్పిన రామాయణ మహాకావ్యాలు ప్రాచీనార్వాచీనాంధ్రభాషలో అపారము అయిన పాండిత్యము సంపాదించి సంస్కృతభాషను కరతలామలకము చేసుకొన్నవారికే అర్థము అవుతవి. వాల్మీకి రామాయణము అంతంతమాత్రము సంస్కృతము చదువుకొన్నవారికి బోధపడుతుంది.

వాల్మీకి రామాయణముకన్నా గొప్పకావ్యము ఈ జగత్తులో ఏ దేశములోనూ ఏ భాషలోనూ పుట్టలేదు అనేది నిర్వివాదాంశము. సంస్కృతభాషలో

దానిని ఆదికావ్యముగానూ మహాకావ్యముగాన్నూ కవులూ పండితులూ శిరసా వహించడమే కాకుండా పుణ్యకావ్యముగా ముముక్షువులు అందరూ శిరసా వహించినారు. అందువల్ల వాల్మీకిరామాయణము షట్కాండలూ ముముక్షువులకు నిత్యపారాయణగ్రంథమూ మంత్రగ్రంథమూ అయింది. అందువల్ల దేవతార్చన పెట్టెలో పదిలముగా దాచుకొనే గ్రంథము అయింది.

వాల్మీకిరామాయణము పుణ్యకావ్యము పవిత్రగ్రంథము అని నమ్మే వాళ్లలో నేనూ ఒకణ్ణి. అంతేకాకుండా పవిత్రగ్రంథాలను మరిఒక భాషలోకి భాషాంతరీకరించ కూడదు అనీ భాషాంతరీకరిస్తే గ్రంథపవిత్రత అంతా పోతుంది అనీ ఒకవేళ గ్రంథములో విషయము తెలిసినా పవిత్రత మూలభాషకే కాని భాషాంతరీకరణము చేసిన భాషకు రాదు అనీ నమ్మేవారిలో నేను ముఖ్యుణ్ణి (అంటే రామాయణము పారాయణము చేయవలెను అనుకొంటే మూలగ్రంథమే పారాయణ చేయవలెను. విషయము తెలుసుకోడానికి భాషాంతరీకరణము చదువుకోవచ్చును అనే మతస్థులలో వాణ్ణి).

వాల్మీకిరామాయణము ఒక్క పుణ్యకావ్యము మాత్రమే కాదు. జగత్తు అంతా అంగీకరించిన మహాకావ్యము. మహాకావ్యాలను భాషాంతరీకరించుకోడము ఎంత అయినా అవసరము. పయిగా కథాప్రవచనము వల్లనే ధర్మప్రవచనమూ అవుతుంది అని పెద్దల అభిప్రాయము. అందుకోసము ఆంధ్రదేశములో స్త్రీ పురుషులు అందరూ అన్యసహాయము అపేక్షించకుండా చదువుకోడానికి వీలుఅయ్యేట్టుగా ఆనాటి శిష్టజన వ్యవహారిక భాషలో వాల్మీకిమహర్షి చెప్పిన రామాయణ మహాకావ్యాన్ని నా సంస్కారాన్ని పట్టి నాకు బోధపడ్డంతవరకూ ఈనాటి ఆంధ్రదేశ శిష్టజన వ్యవహార భాషలోకి భాషాంతరీకరించడానికి సంకల్పించుకొన్నాను.

ఏ భాషలోనయినా భాషాంతరీకరణాలు రెండు పద్ధతులుగా ఉంటవి. యథాతథముగా భాషాంతరీకరించడము ఒకపద్ధతి. అన్యూనాతిరిక్తముగా భాషాంతరీకరించడము రెండవ పద్ధతి. నేను ఈ రెండవపద్ధతినే అనుసరించినాను. వాల్మీకిరామాయణము మూలగ్రంథములో ప్రాంతీయభేదాలు ఎన్నో ఉన్నవి. వావిళ్లవారు తెలుగు అక్షరాలలో రెండువ్యాఖ్యలతో ప్రకటించిన కూర్పునే నేను శిరసావహించినాను. పంక్తుల అర్థకల్పనకు గోవిందరాజులు

చెప్పిన రామాయణభూషణము అనేవ్యాఖ్యనూ మహేశ్వరతీర్థులు చెప్పిన రామాయణ తత్వదీపిక వ్యాఖ్యనూ బొంబాయి గుజరాతీ ప్రెస్ వారు నాగరి అక్షరాలలో ప్రకటించిన రామాయణ తిలక వ్యాఖ్యనూ రామాయణ శిరోమణి వ్యాఖ్యనూ ఇంగ్లీషు పద్యములలో అర్. టి. హెచ్. గ్రిఫిత్ వ్రాసిన వాల్మీకి రామాయణాన్నీ ఇంగ్లీషు వచనములో మన్మథ నాథ శాస్త్రి వ్రాసిన వాల్మీకి రామాయణాన్నీ శ్రీ సి. ఆర్. శ్రీనివాసఅయ్యంగారు ఇంగ్లీషువచనములో వ్రాసిన వాల్మీకి రామాయణాన్నీ మన ఆంధ్రభాషలో గోపీనాధము వేంకటపతి వావిలికొలను సుబ్బారావు జనమంచి శేషాద్రిశర్మగార్లు వ్రాసిన పద్యరామాయణాలనూ బరూరు త్యాగరాయశాస్త్రులు దేవరాజసుధి అనె తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య సరస్వతుల సుబ్బరామశాస్త్రులవార్లు వ్రాసిన వచన రామాయణాలనూ ప్రతిఒక సర్గనూ చదివి చూచి నాబుద్ధికీ నాసంస్కారానికీ సమంజసము అని తోచింది ఈగ్రంథముగా కూర్చినాను.

నేను వ్రాసిన ఈరామాయణపు పంక్తులు చదవయోగ్యముగా ఉండడానికి నేను నోటితో చెప్పుతూ ఉంటే ఎంతో ఓపికతో శ్రీ చెరుకుపల్లి యల్లాప్రగడ సెప్రహా (బి. ఏ. ఆనర్సు-జియాలజీ) బాల అయోధ్యకాండలు వ్రాసిపెట్టినాడు. బాల అయోధ్యకాండలు పూర్తికాగా నే చదివి చూడవలసింది అని నామిత్రులు (అప్పుడు మద్రాసు హైకోర్టు అడ్వకేటు: ఇప్పుడు గుంటూరు ఆంధ్ర హైకోర్టు అడ్వకేటు) శ్రీ గోళ్లమూడి సూర్యనారాయణగారికి ఇచ్చినాను. వారు వ్రాత ప్రతి చదివి చూచి మెచ్చుకొన్నారు. మెచ్చుకోవడమే కాకుండా పుస్తకరూపములో తీసుకొని రావడము కన్నా ముందుగా పత్రికలోనైనా ప్రకటించవలసింది అని సలహా చెప్పినారు. సలహా చెప్పడమే కాకుండా నన్ను ప్రోత్సహించి నేను బద్ధకించకుండా నావెంట వచ్చి వ్రాత ప్రతిని శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారి కరకమలాలలో పెట్టించినారు.

శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు వ్రాతప్రతి చదివి చూచి వారి ఆంధ్ర దినపత్రికలో ప్రతివారమూ ప్రకటించడానికి నిశ్చయించినారు.

వీరికి ముగ్గురికిన్నీ ఎన్ని వందనాలు చెప్పవలెనో ఎట్లా చెప్పవలెనో తెలియడములేదు. వీరి ఆయురారోగ్యైశ్వర్యాదుల కోసము శ్రియఃపతిని ప్రార్థిస్తున్నాను. అడుగగానే శ్రీ గురుపాదులు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

ప్రీతి రూపమైన భావము (భక్తి) విర్పడినది కదా; దాని వలననే కదా వారం దరు కూడ చతుర్విధ పురుషార్థములను పొందగల్గిరి!

అట్టి ప్రీతి యుదయింప వలయుచో గుణములం దనురాగ మేర్పడవలెను. అనురాగగోచరములు కానటువంటి గుణములు నుండినను, వాని గొప్పదియు నధికముగాను నుండ నేరదు. కావుననే సకల సద్గుణములకును పరమావధియైన భగవానునం దనురాగ ముదయింపఁ జేసికొనుటకై-అనగా, అనంత కల్యాణ గుణగణ మహోదధియైన పరమాత్మయం దనురాగమున దాము తరింపగోరి మహానుభావులు మునిపుంగవు లెందరును భగవద్గుణానుభవమునకై ప్రయత్నించుచుండుట సహజముగా నున్నది. సకల సద్గుణములకును పరమావధి పరాత్పరుడు, పురుషోత్తముడునైన భగవానుడు పరమాత్మయే కదా!

"యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః."

అను గీతావాక్యము గుణములకు నెలవులగు క్షరాక్షరముల నతిక్రమించిన పురుషోత్తముడు సకల సద్గుణములకును చిట్టచివరి లక్ష్యమని స్పష్టపరచును. ఇట్టి దివ్యమంగళవిగ్రహుని దివ్యములగు కల్యాణగుణములం దనురాగ మేరికి గలుగదు? వానిని భావింప నెవ్వ రుత్సహింపరు?

"కళ్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచుఁ దృప్తుఁడౌ
కల్యుం డెవ్వఁడు."

అని భక్తవరేణ్యుడగు పోతరాజు తన భాగవతములో తెల్పుచున్నాడు.

మహానుభావులగు శౌనకాది మహర్షులు కూడ భగవానుని గుణానుభవ మొనర్పదలంచియే భారత భాగవతాది గ్రంథములను సూతునిద్వారమున విని యానందించిరి. అట్లే ప్రకృతములో దపస్వియగు వాల్మీకియు "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్" అని ప్రశ్నించెను. జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల ప్రేమ సమావేశస్థలమైన పరమాత్ముని యవతారమున గాక మరెచట నీయనంతకల్యాణ గుణగణములు సమావేశము నొందగలవు? అట్టి భగవద్గుణానుభవమునకే వాల్మీకి గూడ నిట్లు ప్రశ్నించెను. లోకములో ఆయవతారములు సామాన్యముగా మనకు గుణానుభవమున కుపయోగింప వలయునన్నచో మన లోకములోనివిగా నుండుట యవసరము లేనియెడల మన యనుభవమునకు సన్నిహితములు కాజాలవు. అట్టి యవతారములందు మత్స్యాదులందు మన యనుభవముకూడ నంతంతే కదా! కనుకనే వాల్మీకి ప్రశ్నములో "కోన్వస్మిన్ సాంప్రతం లోకే" అనునది సాంప్రతమగును. ఇట సాంప్రత శబ్ద ముభయార్థకమై సమంజసమగును.

అసలీప్రశ్న వాల్మీకి కేల కల్గినది? స్వాధ్యాయము-వేదాధ్యయనమును సనియమముగా నొనరించి తపస్సును ప్రవచనము నొనరించుచు భారద్వాజాది శిష్యులకు వేదార్థాదులను యథావిధిగా నుపదేశించుచుండునపుడు ఆ యాచో

టుల నర్థావలోకనము సంభవింపక తీరదుకదా! "తస్మిన్స్యవంతః తదుపాసితక్షణం" (ఆ పరబ్రహ్మమును చూచినవారు దానిని సుపాసింపవలెను.) అనికదా భగవన్నామానుసంధాన మువదేశింపబడియున్నది. అటువంటి నామానుభవము సమ మాపికాని మహానుభావులు ప్రయత్నించి పెద్దలవలన దెలిసికొని ఆయా దివ్యావతారములందు నామానుభవమును సముపార్జించిరి. కొందరు శ్రీరామావతారమునను, మరికొందరు శ్రీకృష్ణావతారమునను ఇంకకొందరు అవతారాంతరములందును నామానుభవమును పొందుదురు. వారు వెంకురకములుగా నున్నారు. కొందరు ఉపాసనలవలన ఏది-ఆవగా నివృత్తి లోనరించిన భగవద్గుణానుభవైశ్వర్యమును ఏదీ నామగానముల నామానుభవమును సంపాదింతురు. మరి కొందరు స్వయముగా భగవంతుని వినయము వాగ్వైభవ మొనరించి స్వపగోత్రాదికులు కొల్పుదురు "స వాగ్విసర్గో జనతాఘవిప్లవో యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి" అనికదా శ్రీభాగవత శ్రీసూక్తి.

శ్రీ కృష్ణద్వైపాయనుడీ రకపువాడే. ప్రకృతములో శ్రీ మద్రామాయణమును ఇట్టి గద్యరూపముగా కీర్తించు శ్రీ శ్రీనివాసశిరోమణియు నీ మార్గమునే-పెద్దలందరు తొక్కిన త్రోవనే తనను పరులను గూడ, భగవద్గుణానుభవముద్వారా పాపములనుండి విముక్తి గావింప దొరకొన్నాడు. ఇట్టి వారిలో ఆద్యశిరోమణి మన ప్రాచేతసుడు—వాల్మీకి.

ఈతనికీ తలంపెట్లు కలిగినది?.

ఈమహానుభావుడు నియమకముగా దాను సకలవేదములను అధ్యయన మొనర్చినాడు. భరద్వాజాదిశిష్యులకు ప్రవచనమును గూడ నొనర్చినాడు. ౧ స్వాధ్యాయ ప్రవచనములను వచస్సీతమును నొనర్చెను. కాని, యీతడు వానియందు బూర్ణనిష్ణాతుడు కాలేదు. కాని తచ్ఛీలుడుగా నున్నాడని ౨ "తపస్వీ"యను శబ్దమే తెల్పును. వేదములందు ౩ "భద్రో భద్రయా" అనియు ౪ "పితా పుత్రేణ పితృమాన్ బభూవ"యనియు, ౫ "గ్రావాణః ప్లవన్తే"యనియు శ్రీరామావతారము ప్రశంసింపబడియున్నది. ఈమాటల యర్థమును సరిగా తెలుసుకొనుట కవసరమైన వ్యాఖ్యానము వాల్మీకికి దొరుకలేదు. పరబ్రహ్మ యొక్క విచిత్రలీల యటు ప్రశంసింపబడియున్నది. దీనిని సరిగా నవగత

---

౧ "స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః. తద్ధి తప స్తద్ధి తపః" తై. శిక్ష.

౨ తాచ్ఛీల్యే ణినిః.

౩ భద్రః - శ్రీరామభద్రుడు "భద్రయా" - మంగళశీలయైన సీతామహాదేవితో,

౪ పితా-సకలజనకుడైన పరబ్రహ్మ "పుత్రేణ"- తన సంతానమైన దశరథునిచేత "పితృమాన్"-తండ్రి కలవాడుగా "బభూవ" అయ్యెను.

౫ "గ్రావాణః"-రాళ్లు. "ప్లవన్తే"-తేలుచున్నవి."

మొనరించుకొనవలెనన్నచో నా పరబ్రహ్మ గుణసంపత్తిని బోధపరచుకొనవలెను.

అందు కవసరమైన యుపబృంహణము లేనిదే వాల్మీకికి లభింపలేదు. "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అనికదా పెద్దలందురు. ప్రకృతగ్రంథము శ్రీమద్రామాయణము వేదోపబృంహణమునకై రచింపబడినదని "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" అని చెప్పబడినది. వాల్మీకికి వేదవాక్యముల యర్థము-భగవద్గుణానుసంధానము నెట్లొనర్పవలెనని ఆలోచన బయలుదేరినది. నిరంతరము బ్రహ్మ-వేదమునర్థము మనసులో నవలోడిత మగుచున్నది. దీనిని విడమర్చి సరిగా బోధపరచుటకు వేదార్థాదులు, లోకవృత్తాదులు, బ్రహ్మస్వరూపగుణవిభూత్యాదులు చక్కగా మననమొనర్చిన మహానుభావుడు కావలెను అవి బాగుగా భావితములైనపుడే పైవాక్యముల యర్థము విస్పష్టముగా బోధపడి మనసున కానంద మీయగల్గును.

అట్టికొందరు ఋషు లున్నను వారు బాగుగాను, సమగ్రముగాను మనన మొనర్చి ఆ మననములో నారితేరలేదు ౧. మరి కొంతమంది ఆరితేరినను చక్కగా నావిషయమును మాటలందు కూర్చియితరులకు సంక్రమింపజేయుటకు-బోధపరచుటకు గావలసిన నైపుణ్యము కలవారు కారు. ఈ రెండును కలవారుకదా ఆచార్యపదవి నధిష్ఠింపగల్గుదురు!

కాళిదాసీవిషయములో నిట్లన్నాడు:-

"శ్లిష్టా క్రియా కస్యచి దాత్మసంస్థా సంక్రాన్తి, రన్యస్య విశేషయుక్తా,
యస్యోభయం సాధు స శిక్షకాణాం ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ"
—మాళవికాగ్నిమిత్రము

అందులోను మననమునకు ప్రవచన మత్యంత మవసరము. మన కొక విషయము తెలిసినను దాని నితరులకు దెలుపబూను (ప్రవచనము) నపుడే సరిగా భావించి బోధపరచుకొందుము. శిష్యులకు సరిగా ప్రవచన మొనరింపబోవు నపుడే సరిగా భావింతుము. అపుడే ఆ విషయము గురువులకు నిజముగా సరిగా మనన మొనర్పబడి అవగతము కాగల్గును. అందుకనియే కదా పురస్సన్నద్ధత (Preparation) ఆవశ్యకమందురు. నా యనుభవముకూడ నిట్టిదే. ఈ శ్రీనివాస శిరోమణిగారికి తెల్గుభాగవతము జెప్పబోవునపుడే నాకు శ్రీ పోతనామాత్యుని భాగవతము బాగుగా మనన మొనర్పబడి అవగతమైనది. అంతేకాక ప్రకృతములోకూడ నారదమహర్షి వాల్మీకిప్రశ్నమునకు జవాబు తెలుపబూనునపుడు "మునే వక్ష్యా మ్యహం బుద్ధ్వా" యనుచున్నాడు. ఇందువలన పరులకు దెల్పబూనునపుడు తెల్పువానికి సరిగా బోధపడియుండుట యత్యంతావశ్యకమని తేలుచున్నది. కనుకనే ఆ ప్రవచనము "తపః" శబ్దముచే

---

౧ మననాన్మునిః, మునిపుంగవం, ఈమాటలయర్థమును విచారించుడు.

మొట్టమొదట తెల్పబడియున్నది. ౧ స్వాధ్యాయ ప్రవచనములు రెండును “తపశ్శబ్దవాచ్యములైనను “స్వాధ్యాయ” పదము వేరుగా నుండుటవలన గోబలీ-వర్దన్యాయమున ప్రవచనము మాత్రమే యిట “తపః” శబ్దమున కర్థముగా గ్రహింపవలెను. మరియు నీయర్థమును ప్రవచింపవలసియే కదా తపస్వియైన వాల్మీకి నారదుని ప్రశ్నించినది? నారదునకు ప్రవచనవిశేషమువలన స్వాధ్యాయము బాగుగా నవగతమైనది. కనుకనే “తపస్స్వాధ్యాయనిరతం” అనబడినాడు. దాని ఫలముగా నతడు “వాగ్విదాంవరుడు”. “నారదుడు” (నారం-విజ్ఞానం దదాతి నారదః)-జ్ఞానోపదేశకుడు నైనాడు. ఇట్లు మునిపుంగవుడుగా నున్న ఆమహర్షిని, తపస్వి - సామాన్యముగా స్వాధ్యాయ ప్రవచనశీలుడైన వాల్మీకి (నారద వాల్మీకుల విశేషణములలోని తారతమ్యమును గ్రహింపుడు) వేదములందు ప్రసాదితములగు భగవద్గుణముల అనుభవమును సమకూర్చుకొనుటకై, అనగా వేదవాక్యముల యర్థమును విస్పష్టముగా నుపబృంహణ మొనర్చుకొనుటకై - విశదీకరించుకొనుటకొరకై నారదమహర్షిని జ్ఞానదాతయగు మహానుభావుని సమగ్రముగా నడిగెను. (పరి-ప్రపచ్ఛ) అనగా అవాంతర విశేషములతో గూడ దెలుపుమని యడిగెను. ఆప్రశ్నమే మొదట “కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్” - ప్రకృతకాలములో యీలోకమున నెవడు బాగా మంచిగుణములు కలవాడు (“ప్రాశస్త్యే మతుప్” అను విషయము గ్రహించుడు.) అని సామాన్యముగా గుణప్రశ్నమై తరువాత ఆగుణముల విశేషము (Detalis) ల లోనికి “కశ్చ వీర్యవాన్, ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః” ఇత్యాది రూపేణ పరిణమించినది.

ఈ నిరూపణమున కంతకును బర్యవసాన మేమనగా- ఈ శ్రీమద్రామాయణము నందు ప్రశ్నముగాని, సమాధానముగాని రెండునుగూడ విశదలలితమైన విస్తరోపపాదనలతో నే సంఘటింపవలసినదని. ఇట్టిచోటులందు జటిల కఠినేతర పదసంభేదము “పుష్పరాశావివాగ్నయే”.

ఇట్లు తపస్వి- స్వాధ్యాయ ప్రవచనముల సామాన్యముగా నొనర్చు నొక ఋషి వాల్మీకి అడుగగా, తపస్స్వాధ్యాయ నిరతుడు- నిరంతరమును స్వాధ్యాయ ప్రవచనముల నత్యంత మాసక్తితో నొనరించువాడు, వాగ్విదాంవరుడు- చక్కగా మాట నేర్పు కలవాడు, నారదుడు- జ్ఞానదాతయైన మహర్షి మై వేదవాక్యముల కర్థము శ్రీరామచరిత్రమని సముపదేశించెను. ఏమనగా- గుణములు చరిత్రమునందు గాని, ప్రస్ఫుటములు కాబోవు. శ్రీరాముని చరిత్రమునందు వీర్య ధర్మజ్ఞత్వ కృతజ్ఞత్వాది సకలోత్తమ గుణములును ప్రస్ఫుటములగుట సర్వులకును సుప్రసిద్ధమే.

అతడుకూడ నెంటనే తెలుపలేదు. ఏమన్నాడు.

---

౧ “పక్ష్మోత్క్షేపాదుపరి విలసత్కృష్ణశారప్రభాణాం” (మేఘదూతం) “కృష్ణరక్తసితః శారః” అనుటవలన శారపదము వర్ణత్రయవాచకమైనను కృష్ణపక్ష్మముండుటవలన దదతిరిక్తవర్ణమునే తెల్పునని మల్లినాథుడు.

"బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః,
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరః.

"నీవు ప్రశంసించిన గుణములు చాలా ఉన్నవి. అంతేకాక అవి చాలా వరకు దొరకనివి కూడాను. దేవర్షిసత్తముడవైన నీవీ గుణములకొరకు కేల యడిగితివో నే నెఱుగుదును. ఆ విషయమును నేను బాగుగా అవగత మొనర్చుకొని నీవు తెల్పిన గుణము లన్నింటితోను గూడిన నరుని నీ కెఱుఁగజేయుదును. నీవు అతనిని శ్రవణమొనర్పుము.

(ఇచట "శ్రూయతాం" అనుటలో బ్రహ్మవిద్యా ప్రారంభమైన 'శ్రవణము' జ్ఞాపక మొనర్పబడినది. నారదునినుండి వాల్మీకి యొనర్చిన యీ శ్రవణము ఆత్మావగతిసాధనమని సూచింపబడినది. అందుచేత ఈ ప్రకృతుడైన శ్రీరామచంద్రుడే ఆత్మ- పరమాత్మ యనియు, ఆ పరమాత్మావగతికి సాధనము నీ శ్రీమద్రామాయణ[illegible]బ్రహ్మవిద్య- ఉపనిషత్తు వేదమని ధ్వనింపబడినది. "నరః" అనునది వాచ్యవృత్తిలో మనుజుని బోధించును. "నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అను శ్రుత్యర్థము పరమాత్మ వ్యంజనావృత్తితో బోధింపబడును. రిఙ్ + క్షయే అని ధాతువు. న = రః = నశింపనివాఁడు.) అందువలన సకలగుణ సంపన్నుఁడగు అనగా— "య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సో ఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః" అను ప్రజాపతి వాక్యానుసారము గుణాష్టక మేకాక తైత్తిరీయక వాక్యము (సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ- ఆనందో బ్రహ్మ) ననుసరించి సత్యజ్ఞానానందామలత్వాద్యనంత కల్యాణగుణగణ సంపన్నుఁడగు పరమాత్మ శ్రీరామచంద్రుఁడని తెలియఁగల్గుదువు. దానిని జక్కగా మననాదుల నొనర్చుటవలన భగవదనుభవరూపమైన నిదిధ్యాసనము దర్శన సమానాకారమైనది కల్గి తరింతువు," అని చెప్పినట్లాయెను.

ఇట్టి పరమాత్మను నుపనిషద్వేదము కాక మరేది బోధింపగలదు? "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అని కదా ప్రమాణము. ఇట్లు వైదికమైన యర్థమును విచారించి వ్యాఖ్యాన మొనర్చునది వేదమేనని శ్రీ కుమారిల భట్టపాదులు తెల్పియున్నారు.

"మీమాంసా సంజ్ఞక స్తర్క స్సర్వో వేదసముద్భవః
సోఽతో వేదోపమాప్రాప్తకోష్ఠాది లవణాదివత్."

కనుక శ్రీరామచంద్ర పరమాత్మను సకల విధముల వివరించి అతనిని వ్యాఖ్యానించి అస్మదాదులకు భగవానునిగుణముల యనుభవము నొదవించి పరమానందమును గలిగించు శ్రీమద్రామాయణము వేదమనుట కేమియు సందియము లేదుకదా!

అయితే ఆకాలమున బ్రహ్మప్రతిపాదనమునకును, అవగతికిని జపధ్యానాదులకునుగూడ గాయత్రీమంత్రము ద్విజుల కందరకును నిరంతర మభ్యాసములో

సుందేను. ఇప్పటికిని పరబ్రహ్మ ప్రమహోత్తముని పేరుంచువారికి అదియే ప్రధాన మగు మంత్రము. "న గాయత్ర్యాః పరో మంత్రః" అని కదా ప్రమాణము. కనుక నట్టి గాయత్రీ ప్రతిపాద్యమగు సవితృ - పరమాత్మకు రూపాంతరమైన శ్రీరామ చంద్రుని ప్రతిపాదింపుటకుగా నిర్మింపబడిన, వేదమునకు రూపాంతరమైన శ్రీమద్రామాయణమునకును గాయత్రీరూపాంతరమైన సావిత్రీ మంత్రమునకు ఋషియైన విశ్వామిత్రుండు పరబ్రహ్మరూపాంతరమైన శ్రీరామచంద్రునకు ప్రవర్తకునిగా ప్రవర్తింపజేసినాడు. గాయత్రి ప్రథమవ్యాహృతి "భూః" అనునది. "భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి" యను తైత్తిరీయకవాక్యమునుబట్టి పుత్రకామేష్టిలో నగ్నిదేవుని వలననే ఓంకారవాచ్యుడగు పరమాత్మ శ్రీ రామచంద్రుడుగా దశరథునకు పుత్రుడగునని ప్రతిష్ఠిత మయ్యెను కదా! "భువః" అనునది రెండవ వ్యాహృతి. "భువ ఇతి వాయౌ" అనుటవలన వాయవ్యాస్త్ర ప్రతిష్ఠితుడగు శ్రీరామచంద్ర పరమాత్మవలన మారీచుడు పారద్రోలబడెను. అది శ్రీరామచం ద్రునకు ప్రతిష్ఠాహేతువే కదా! "సువః" అనునది మూడవ వ్యాహృతి. "సువరి త్యాదిత్యే" యని తైత్తిరీయకము. శ్రీరామచంద్రుడు-పరమాత్మ సూర్యవంశమున ప్రతిష్ఠాహేతువుగా జన్మించి ఆదిత్యహృదయమున ప్రతిష్ఠితుడై దశకంఠుని సంహరించి ప్రతిష్ఠ నొందెను కదా! "మహః" అని నాల్గవ వ్యాహృతి దీనిని గూర్చి "మహ ఇతి బ్రహ్మణి" అని తైత్తిరీయ శ్రుతి తెల్పును. బ్రహ్మ జాతివాడగు పరశురాముని తేజస్సు నతిక్రమించిన తేజస్సుతో పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుడుగా ప్రతిష్ఠ నొందినాడు. "అక్షయం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరం" అని కదా పరశురాముని సూక్తి. ఇట్లెన్నియైన గాయత్రీమంత్రప్రసక్తముల విశదీకరణ మిందు కనుబడవచ్చును. ఇంతేకాక "చతుర్వింశత్యక్షరా గాయత్రీ" అను ప్రమాణమున నీ గ్రంథము శ్రీమద్రా యణము ఇరువదినాల్గువేల లెక్కతో నుండును.

మరియు గాయత్రికి ప్రథమ ప్రతిపాద్యుడు సహస్రకిరణుడగు సవిత కావున ప్రతి వేయి శ్లోకములకు మొదటను గాయత్రిలోని యక్షరములు క్రమ ముగా నొక్కొక్కటి యుండును. "త్రిపదా" యని అయోధ్యయు, దండ కయు, లంకయు నిరూపింపబడినవి. (చివరిచరణముగా లంకను నిరూపించు టతో సీత యను జీవోద్ధారకత్వాది విశేషములు చాలయున్నవి కాని విస్తర భీతిచే నిట వానిని ప్రస్తావింపము.) "షట్కుక్షిః" అని శ్రీ సీతా రామచంద్ర లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమంతులు ప్రధానులు శ్రీమద్రామాయణకుక్షిలో నిమిడియున్నారు. ఇట్లు సకల గాయత్రీసారమగు నుపాసకుని బుద్ధిప్రేరణము- పరమాత్మకృత్యముకూడ-శ్రీరామచంద్రుని ప్రేరణారూపమున నీ గ్రంథము నందుటను విస్పష్టము. సవితృవంశ్యుడై మహాతేజస్సంపన్నుడగు శ్రీరామచంద్ర పరమాత్మను అనేక మార్గముల - పుత్ర, భ్రాతృ, పతి, మిత్ర, ప్రభు, శరణాది మార్గములతో నిం నుపాసించుట యుపనిబద్ధమగును. దశరథాదులందరును పుత్రాది రీతుల నేకదా శ్రీరామచంద్రుని ప్రీతిపూర్వకముగా నుపాసించి యతని శరణు జొచ్చిరి! అందువలననే శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయములో నీ శ్రీమద్రామా యణమును దీర్ఘశరణాగతి యందురు. ఇట్లు గాయత్రీ మంత్ర సారమైన ఈ

గ్రంథమున శ్రీ సీతాచరిత్ర ముపబృంహితమై (సీతాయాశ్చరితం మహత్) తద్ద్వారమున శ్రీ రామచంద్రుని విశేషగుణానుభవము సమకూడుచున్నది. అనగా వేదమాతయైన గాయత్రీ మూలమున పరమాత్మ దివ్యతేజోనుభవముగల్గించుటలో లోకమాత యగు శ్రీ సీతామహాదేవిమూలమున శ్రీరామచంద్రపరమాత్మ విశిష్ట గుణానుభవము ముముక్షువులకేర్పడుటకు "సీతాయాశ్చరితం మహత్" అని కదా ప్రమాణము. "రామాయణం" అనుపేరుకూడ (రామాయా అయనం) ఈ సొగసు స్ఫురింపక పోదు. మంత్రాధిదేవత సావిత్రి. ఆమె హృదయమున పరమాత్మ వెలసియున్నాడను సంకేత మిట్టి సీతాచరిత్రమున ప్రదర్శించి ఆమె హృదయాధిదైవతముగా శ్రీరామచంద్రుని ఈ గ్రంథమున విస్తరించి ప్రతిపాదింపబడినాడు.

ఈ తీరున విశిష్టమగు నీ చరిత్రమును వాల్మీకి నారదునుండి విని దానిని మనసుతో ౧ మనన మొనరించుకొనుచు తమసానది కడకు స్నానమున కేగెను. అట మనసులో మెదలుచున్న నారద కథిత మగు కథను ఏకాగ్రమగు 'మనసుతో (నియతేంద్రియః) పర్యాలోచించుకొనుచు వెంటనే స్నాన మొనర్పక కొంత తమసాతీరవనమున దిరుగ మొదలిడెను. ఆ పర్యాలోచనమువలన నతని మనసునందు వేదవాక్యములకును నారద కథిత వృత్తాంతమునకును సమన్వయ మేర్పడి జగదుత్పత్తి వినాశములకును భూతముల గత్యాగతులకును, విద్యావిద్యలకును విజ్ఞాతయు, మూలకందమును నగు భగవానుని దివ్యచరిత్రము బూర్ణముగా నవబోధమయ్యెను. అప్పుడామహర్షికి ఆ భగవానుని గుణచరిత్రాదుల మననములవలన తాదాత్మ్యావేశము కల్గెను. కనుకనే యిట "దదర్శ భగవాంస్తత్ర" యని వాల్మీకి భగవంతునిగా నుడువబడినాడు ౨. అట క్రౌంచజంట తన మధురమగు కూజనముచే నీతని వెనుకటి భావనావేశమును చెదరగొట్టెను. కాని, వెనుకటి భావనాసంస్కృతమగు బుద్ధిలో నీక్రౌంచజంట మందోదరీ రావణుల జంటగా గోచరమయ్యెను. అట "ఋషేః" యని వాల్మీకిని చెప్పుటవలననే ఈవిషయమును గమనింపవచ్చును. అనగా "నానృషిః కురుతే కావ్యం" అను ప్రమాణమునుబట్టి కవితారచన కవసరమైన రసమయమగు భావనావేశము ఇతనికి గలిగెననుట. ఈ భావన ప్రక్రాంతమగు లోపలనే బోయ యొకడు పాపపు తలంపుతో మగపిట్టను గొట్టినాడు. అపర్యవసితమైన భావనతో నున్న యీతనితలంపులో

---

౧ "స ముహూర్తం గతే తస్మిన్ దేవలోకం మునిస్తదా" "స తు తీరం సమాసాద్య తమసాయా మహామునిః" "ప్రాయచ్ఛత మునే స్తస్య వల్కలం" ఈ శ్లోకములం దంతటను గూడ నుపయోగింపబడిన "ముని" శబ్దముల గమనించి "మననా న్మునిః" యనుదాని ననుసంధింపవలెను.

౨. ప్రహ్లాదునకుగూడ పరమాత్మానుసంధానమువలన నిట్టి తాదాత్మ్యావేశమే కల్గి "సర్వగత్వా దనంతస్య స ఏవాహ మవస్థితః మత్తః సర్వ మహం సర్వం మయి సర్వం సనాతనే" అను పలుకులు వెలువడెను.

నాక్రౌంచహత్యయు, క్రౌంచీకరుణారావమును ద్విజునకు సహజమగు భూత దయాదాక్షిణ్యము సుప్రతిష్ఠించి యుద్దీపింపజేసినవి. ౧. అప్పుడు పరదుఃఖ దుఃఖిత్వ దశాపన్నుడై కర్తవ్యము నెరింపగా, ఇంతకు శోక నిమగ్నునకు బూర్వపుదశను మనసులో మెదలుచున్న భావన ఆవేశించినయాసత్త్వమును శ్లోకముగా రూపొందించినవి. వైదికమగు గాయత్రి తన ఛందస్సు "అనుష్టుప్" లో లౌకికమగు నాదికావ్యమును "మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీః సమాః, యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితం" అను శ్లోకముగా నవతార మొందెను.

పై చెప్పిన రెండురకముల భావనలవలననే యీ సత్త్వపరిణామము నీ శ్లోకమునందు రెండు రకముల యర్థములు స్ఫురింపగల్గినవి. "కామమోహితం" అను టలో రావణుని స్వభావము వ్యంగ్యమైనది. ఇట్లు క్రౌంచపిట్టల జంటను మండోదరీ రావణుల ('క్రౌంచి' యను రావణుని తల్లి కైకసి. దాని కొడుకు క్రౌంచుడు. రావణుడు) జంటను గట్టిన వియోగము లిందు స్ఫురించి యొక దాని కర్తృప్రతిష్ఠయు మరొకదాని కర్మప్రతిష్ఠయు నవశ్యముగా స్ఫురిత ములైనవి. (ఈ సన్నివేశమువలన కవికి భావనాబలముతో బాటు ఆవేశమును (Inspiration) కూడ అవసరమని వ్యంగ్యమైనది.)

ఈ యుద్గారము కల్గి వెనుకటి యావేశభావనలు తొలగినవి. అపుడు ఋషికి స్వాత్మావలోకన మేర్పడెను. తనను గూర్చియు తా నిదివరలో నొన ర్చిన పనిని గూర్చియు పర్యాలోచన మేర్పడెను. "క్రౌంచమును గూర్చిన జాలితో నె నేమంటిని? నా కేల యీ యావేశము కల్గినది? దీనివలన నేమి రానున్నది? నా నోట వెడలిన మాట శ్లోకముగా కన్పడుచున్నదే. శోకములో భావనాలయము (శోక + ల = శ్లోక ఇది వైదికమగు పద్ధతి. "తజ్జలా నితి శాన్త ఉపాసీత" యను చోట "తజ్జం, తల్లం, తదన్" అను విభాగమును జ్ఞప్తికి దెచ్చుకొనుడు.) సంభవించి నదే? వైదికుల నిరంతర చింతనలో గోచరమగు గాయత్రి ఛందస్సు అనుష్టుప్పు

---

౧. "ఋషేర్ధర్మాత్మనస్తస్య కారుణ్యం సమపద్యత" "తతః కరుణ వేదిత్వా దధర్మోయ మితి ద్విజః" ఈ శ్లోకములలో ప్రతిపదమును అనుసం ధించుడు. ఒక విషయము మాత్రము ప్రస్తావింతుము. "ద్విజ" పదము పిట్టను బ్రాహ్మణుని గూడ బోధించును. అందువలన నా పిట్టల కథలలో మాధుర్య కారుణ్యముల గుర్తింపగల్గుటయు, బ్రాహ్మణునకు కారుణ్యోద్బోధనము సహ జమగుటయు వ్యంగ్యము. "ఘాతుర్న ఘాతుకో విప్రః" అని కదా ప్రమాణము.

౨. దశానన వధోద్దీప్తమగు శ్రీరామచంద్ర పరమాత్మయొక్క దివ్యమగు తేజస్సును గుర్తించి అందువలన ప్రేరితబుద్ధియై వాల్మీకి అతనిని "మానిషాదః" శ్రీమన్నారాయణా! అని గుర్తించినాడు, ఇదియేకదా గాయత్రి మంత్రార్థము.

గా నిది పరిణమించినదే" అని యాంత్రికముగా ౧ పద్యాగోచరము. తిరిగి క్రౌంచము రసమయముగ ఆవేశింపగా—"ఈమాటకు నాల్గు పాదములు గాని కక్షరములు ఒక సమముగా నుండి వీణమీద పాడుటకనువుగా నున్నవి. కారుణ్యము నన్నావేశింపగా వెనుకటి ప్రవృత్తితో సిద్ధి యేర్పడి ((ప్రవృత్తిః - ఆవిఃర్మణి కృతః) శ్లోకమేర్పడినది. (అనగా వెనుకటి భావన ప్రవృత్తి శ్లోకములో లయ మొందినది. కనుక శ్లోకము) మరొకటి కాదు. ఏమి భరద్వాజా! అనెను ఋషి. శిష్యుడు దానికి సరే అంతేనని తోడు పల్కెను.

సరి, అంతటితో స్నానాదిక్రియల నిర్వర్తించుకొని యాశ్రమమునకు మరలివచ్చినను మునికి ఆ ధ్యానము వదలలేదు (తమేవ చింతయన్నర్థము పావర్తత నైమునిః। ధర్మవిత్ ......ధ్యాన మాస్థితః) ఇపుడు క్రమముగా నారద కథితమగు వృత్తాంతము స్మృతి-ధ్యాన గోచరము కాగ- దానికి బ్రహ్మ వేద

---

౧ "తస్యైవం బ్రువతః చింతా బభూవ హృది వీక్షతః। శోకార్తేనాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా. చింతయన్ స మహాప్రాజ్ఞః చకార మతిమాన్ మతిం, శిష్యం చైవాబ్రవీ ద్వాక్య మిదం స మునిపుంగవః। పాదబద్ధోక్షర సమ స్తంత్రీలయసమన్వితః, శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా". "శిష్యస్తు తస్య బ్రువతో మునే ర్వాక్య మనుత్తమం ప్రతిజగ్రాహ సంహృష్ట స్తస్య తుష్టోభవ ద్గురుః"

౨ ఇట సమాక్షరత యనగా ఎనిమిది యక్షరములు ప్రతిపాదమునకును సరిగా నుండుటయని అర్థ మొనర్తురు, కాని అది యుక్తముగా తోపదు. ఏమనగా-"పాదబద్ధః" (పాదములుగా కూర్పబడినది) అనుటలోనే సమసంఖ్యాకాక్షరత స్పష్టమగును. ఇక నక్షరసమః అనుటలో విశేషమేమి? అదియుగాక సామాన్యముగా "నుష్టుప్పు"లో పాదమున కెన్మి దక్షరములుండినను కొన్ని యెడల తొమ్మిదికూడ నుండును. అట వెనుకటి యర్థముప్రకారము శ్లోకము కాకపోవలసివచ్చును. కనుక ఆయర్థము సుసంగతముగా దోచదు. "తంత్రీలయ సమన్వితః" అను ముందుమాటను బట్టి "లయ"తో సమన్వితమైన అక్షరము లుండవలెను. అది సమాక్షరత. ఇట "మానిషాద" యని "మా" కారముతో ప్రారంభించినది. పాదము దాని కిలయ రెండవపాదము మొదట "మగమః" అని సరిగా కుదురును. ఇట్లే మూడవపాదము మొదట "యత్క్రౌంచ" అని "య" కారారంభము. నాల్గవపాదము మొదట లయ "అవధీః" అ కారముతో సరిగా నడుచును. (ఇట అఖండయతి గ్రహింపనగును) ఈ తోవ సంస్కృతములోను తెనుగులోను గూడ గేయపాఠ్యములం దంతటను విస్తరించి యున్నది. కనుకనే "గేయే పాఠ్యేచ మధురం" అని ముందు చెప్పబడినది. అంతేకాక "సర్వశ్రుతిమనోహరం" అనియు ముందు నుడువబడినది.

ఈయుపోద్ఘాతమే "బ్రహ్మ వచ్చినట్లు రామాయణరచనాదికమున వాల్మీకిని ప్రోత్సహించినటులు" గా రూపకప్రస్తావ మొనర్పబడినది...అదియు వైదిక మర్యాదయే. (వేదములో ఉపసున్ద వృత్తాంతము, అగస్త్యాగ్ని వృత్తాంతము- ఊర్వశీ పురూరవ వృత్తాంతము, అహల్యా గౌతమ వృత్తాంతము నిట్టి రూపకము లనబడు సుప్రసిద్ధము. ఆ పద్ధతియే వేదవిస్తారమగు నీ గ్రంథమున గూడ నవలంబింపబడినది.)

ఈ విశిష్టపద పదార్థానుసంధానము, భావనాబలము, వేదార్థ సమన్వయము వివిధీకరణము మొదలగు గుణములతో వాల్మీకిచే రచింపబడిన ఈ దశశిరస్సుని వధను దశరథసుతునికథను సకలలోకములవారును, (సుపసర్గ సమాస సంధి యోగం సమమధురోపనతార్థ వాక్యబద్ధం. రఘువర చరితం మునిప్రణీతం దశశిర సశ్చ వధం నిశామయధ్వం.) ధర్మార్థకామమోక్షము లను నాల్గు పురుషార్థము లకై పఠింతురు, విన్పింతురు, విని యానందింతురు.

ఈ కావ్యములో కథావైచిత్ర్యమున్న నుక్తివైచిత్ర్యము, భావముల వైచిత్ర్యము మెండు. ఎన్నెన్నో రకముల చిత్ర విచిత్రములగు అతిసున్నితము లైన భావములు ఇందు హృదయములోని యంతరాంతరములలోనికి జొంబడి విహరింపగలవు. అందును శ్రీరాముని కరుణారసము "పుటపాక ప్రతీకాశో రామస్య కరుణో రసః" యనినట్లు వర్ణింపబడినది.

దీని నిట్టి భావమయమగు నాస్వాదముతో సనాతనానురాగసమునకై ఆంధ్ర దేశమువారు శ్రద్ధతో బఠింతురు. ఈ తెలుగువారికి తెలియుటకై భాస్కరరామాయణము, మొల్లరామాయణము, పట్టాభిరామాయణము, గోపీనాథ రామాయణము వాసుదాస రామాయణము, శేషాద్రిశర్మ రామాయణము, రఘునాథ రామాయణము, విశ్వనాథరామాయణ (కల్పవృక్ష)ము మొదలగున వెన్నియో రచింపబడి యున్నవి. కాలానుగుణముగా ప్రజలభాషను కలుగు మారుపుల కనుగుణముగా గ్రంథములను దిద్ది తీర్పు చుండుట పూర్వమునుండియు నలవాటుగా నున్నపనే. అట్టి తీర్పులేకదా సంస్కృతములోని దువ్యాసరామాయణము, ఆనందరామాయణము మొదలగునవి. అందును తెలుగులకు ఈ శ్రీమద్రామాయణమునిన నత్యంతము ప్రీతి వీరును శ్రీ రామచంద్రునివలె నిక్ష్వాకువంశము వారగుటయే యిందుకు గారణము కావచ్చును, లక్ష్మణుడు మాగధుల మేనల్లుడు. ఇక్ష్వాకువుడు. మన మేనల్లుడు మనవాడేకదా !

అందును ప్రకృతము రామాయణయుగ మనదగును. ఈ కాలమున నెన్నో రకముల రామాయణము లుదయించుట అందరికిని దెలిసినదే. గోపీనాథం వెంకట కవి, వా. సు. దాసు. జనమంచి శేషాద్రిశర్మ. విశ్వనాథ సత్యనారాయణ కల్లూరి చంద్రమౌళి, అత్మకూరి గోవిందాచార్యులు, ప్రకృతము కరణం శ్రీని వాస శిరోమణి. వీరందరు రామాయణ రచయితలే. ఇంతమంది యొకే గ్రంథము నే పట్టుకొని వేలాడుటలో నేమి స్వారస్యమనియు శంకింపరాదు. ఈ విషయ మున మురారిమహాకవి అనర్ఘ రాఘవ నాటకమున నిట్లు సమాధానము తెల్పినాడు.

చరిత్రము ఎట్లు తెనిగించెనో. ౧ తపోనిరతుడైన నారదుడు వాఙ్మయవేత్తలలో ముఖ్యుడు. మహాత్ములలో శ్రేష్ఠుడు, ఎప్పుడూ వేదాధ్యయనము చేసుకొంటూను, తపస్సు చేసుకొంటూను ఉండేవాడు. అటువంటి నారదుని వాల్మీకి మిక్కిలి వినయముగా ప్రశ్న చేసినాడు."

దీనికి మూల శ్లోకము "తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరం నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్" అని. దీని కింకొకరి వ్రాతలు వారైతే "తపస్సునందును స్వాధ్యాయమునందును నిరతుడు వాగ్విదులలో వరుడు, మునిపుంగవుడు నైన నారదుని తపస్వి వాల్మీకి యడిగెను." అని తెనుగు రాశేవాడు.

పిల్లలు, ముసల్లి, అందంగా కూడ చదువుకోటానికి, చదువుతున్నప్పుడు వినటానికి మనసుపడే ఈ రామాయణగాథను సరళముగాను సులభశైలిగాను వ్రాయక తన పాండిత్యబలం చూపి, కొయ్యబొమ్మలు చెక్కినట్లుగా మాటలు చెక్కి అవకతవకగా కథలు మొదలైనవి మార్చి వ్రాయటం, చదువుకొనే వాళ్ళను శ్రమ పెట్టడంతప్ప వేరేకాదు మొల్ల "మూగ చెవిటివారి ముచ్చట" అన్నది ఇట్టి రామాయణానువాదాన్నియే అయియుండును. అసలు గ్రంథకర్త మనకిక్కడ ప్రత్యక్షమై తెల్పినా తెలియవు కొన్ని. మూలం చదువుకొంటేనే తెలిసేవి కొన్ని, మూలం చదువుకొన్నా తెలియవు కొన్ని. అసలు చదవడానికే

---

౧ వాగ్విదాం వరం. అనునది "వాఙ్మయవేత్తలలో ముఖ్యుడు" అని అనువదింపబడినది. ఇందు వలన చక్కగా మాటలాడుటయే కాక అప్పటి వాఙ్మయము-వైదికవాఙ్మయమంతయు నారదునకు వశోవిధేయమనుటలో ముందు తెల్పబోవు శ్రీరామచరితమునందు వైదికార్థ సమన్విత వాగ్వ్యవహారము వ్యంగ్యమైనది. విశేషణములు వాక్యములుగా తెనిగించుటలో అర్థము సువ్యక్తమగును. భాష మృదులము, విశదము, అగ్రామ్యము ననుట ప్రత్యక్షమే. మెసరి గ్రాంథికము గాకుండుటయు ప్రముఖవేద్యమే. "నిరతం" అను విశేషణమును "ఎప్పుడు వేదాధ్యయనము......ఉండేవాడు" అను వాక్యముగా తెనిగించెను. ఈ పద్ధతియే సరియైనది హితమైనది. బాలకాండముకన్న కూడా అయోధ్యాకాండ మింకను మెరుగు దేరింది.

౨ సన్తి సిద్ధరసప్రాయాః యేచ రామాయణాదయః కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ (ధ్వన్యాలోకము) సిద్ధరసప్రాయములని ప్రసిద్ధి నొందియున్న రామాయణాదులన్నియెడల రస విరోధము నాపాదించునట్టుగా కథాశ్రయమునందు స్వేచ్ఛ యోజ్యము కాదు" (ఆంధ్ర ధ్వన్యాలోకము) అని ఆనందవర్ధనాచార్యులు-సహృదయచక్రవర్తి కథల మార్పును రామాయణములలో నిషేధించుచున్నాడు.

శాంతిపర్వ కొన్ని. అవిమాంగ్రసు ఉన్నట్లుగా ఆదికావ్యం అనిపించేవి కొన్ని. ఇట్లా నానాకాలాలగానున్న రామాయణాలను చూచిచూచి విసిగియున్న వారికి ఈ శ్రీనివాస శిరోమణిగారి రామాయణగానం వినసింపుగాను, చదువ సొంపుగాను ఉన్నది. దానిని ఆకుకాస్తి వినోదముగాను, భక్తిగాను, తృప్తి గాను చదివి దనువ్రమన్న నైనమూ నాయింటివద్దనుండియే నేనిప్పు డెరుగు దును. ఇట్టి యనువాదములు ఇప్పటి కాలపు శిష్టులు వ్యవహరించు మాటతీరులో నుండి చాల కోయి గలెంచును. ఈ యనువాదమునంటి యనువాదముల నింకను రచించి శ్రీ శ్రీనివాస శిరోమణి తెలుగునాటలో భక్తిప్రేమల నభివృద్ధించుచు ఆరోగ్యపరిపూర్ణముగా నాయంపనము సముపాన్పుగాక యని యాశింతును.

న్యాయ శిరోమణి

**వేదాల తిరువేంగళాచార్యులు,**

౮ 1/70 పట్టాభిపురము గుంటూరు. 25.10.54.



# వాల్మీకి రామాయణం

## బాలకాండ

౧

తపోధనుడు అయిన నారదుడు వాఙ్మయవేత్తలలో ముఖ్యుడు. మహర్షులలో శ్రేష్ఠుడు. ఎప్పుడూ వేదాధ్యయనము చేసుకుంటూనూ, తపస్సు చేసుకుంటూనూ ఉండేవాడు. అయన్ను వాల్మీకి మహర్షిచూచి, ఈ విధముగా ప్రశ్న చేసినాడు:

"ఓమహర్షీ, సకల సద్గుణ సంపన్నుడూ పరమపరాక్రమవంతుడూ, ధర్మజ్ఞుడూ, సత్యవ్రతుడూ, అచల సంకల్పుడూ, పరంపరాగత సదాచార సంపన్నుడూ, సర్వభూతహితుడూ, సర్వశాస్త్రజ్ఞుడూ, సర్వకార్య ధురంధరుడూ, ఏకరూప ప్రియదర్శనుడూ, ధైర్యవంతుడూ, కాంతిమంతుడూ, కోపమురానివాడూ, అసూయలేనివాడూ యుద్ధములో దేవతలనైనా జయించ కలవాడూ, ఎవడు అయినా ఒక్కడు ఇప్పుడు ఈ లోకములో ఉన్నాడా? అటువంటివాడు ఎవడు అయినా ఉన్నట్లయితే తాము తప్పకుండా వాణ్ణి ఎరిగి ఉంటారు. చెప్ప వలెను. తెలుసుకోవలెను అని నాకు చాలా కుతూహలముగా ఉంది."

ముల్లోకాలూ సంచారముచేసే నారదుడు ఈ ప్రశ్నకు నవ్వి "నాయనా చెప్పతాను విను. నీవు చెప్పిన అన్ని గుణాలు కలవాడు ఈ భూలోకములో ఉండడు. అయి నప్పటికిన్నీ ఇప్పుడు ఒకడు ఉన్నాడు. అతడు ఇక్ష్వాకు వంశములో పుట్టినవాడు. రాముడు అని ప్రసిద్ధి కెక్కినాడు" అంటూ రామ కథను అంతా సంగ్రహముగా చెప్పివేసినాడు.

౨

నారదమహర్షి చెప్పిన రామకథను అంతా వాల్మీకి మహర్షి విన్నాడు. విస్మితుడు అయిపోయినాడు. అంతట ఆధర్మాత్ముడూ, ఆయన శిష్యులూ

నారదమహర్షిని స్తోత్రము చేసినారు. యథావిధిగా పూజచేసినారు. అంతట నారదమహర్షి వాల్మీకి మహర్షిని కౌగిలించుకొని "పోయివస్తాను" అని వీడ్కోలు చెప్పి ఆకాశ మార్గాన దేవలోకము వెళ్ళిపోయినాడు.

అప్పుడు వాల్మీకి మహర్షి మధ్యాహ్నస్నానానికి బయలుదేరినాడు. జాహ్నవీ నదికి సమీపములో ఉన్న తమసా నదీతీరము దగ్గరకు పోయినాడు. బురదలేకుండా ఉన్న రేవును అక్కడ చూచినాడు. వెంట ఉన్న శిష్యుడితో "భరద్వాజా, చూడు—సత్పురుషుడి మనస్సుకు మల్లే ఈనదీజలాలు నిర్మలముగా ఉన్నవి. ఈ రేవున్నూ చక్కగా ఉంది. నాయనా, కలశము కిందపెట్టు. నాకు వల్కలము ఇవ్వు. మనోహరముఅయిన ఈ తమసానదిలోనే నేను స్నానము చేస్తాను," అన్నాడు.

భరద్వాజుడు అందించిన వల్కలాన్ని తీసుకొని వాల్మీకి మహర్షి ఆ వనరామణీయకాన్ని చూస్తూ అడుగులు వేయసాగినాడు. ఎప్పుడూ ఎడబాయకుండా తిరిగే క్రౌంచపక్షుల జంట ఒకటి కనిపించింది. ఆ రెండు పిట్టలూ మహామధురముగా పాడుతూ ఉన్నవి. ఎర్రటి గొద్దిజుట్టుతో ఉన్న పోతు పిట్ట పాడుతూ పాడుతూ రతిపారవశ్యముతో పెంటిపిట్టను తన సొగసు అయిన రెక్కలతో కప్పివేసింది.

నిష్కారణముగా పిట్టలను కొట్టే పాపాత్ముడు ఒక బోయవాడు అక్కడ వాల్మీకి మహర్షి ఉన్నాడు అని అయినా లెక్కచేయకుండా ఆ జంటలో పోతుపిట్టను కొట్టినాడు. అది నేల కూలింది. దాని ఒళ్లు అంతా నెత్తురుమయము అయింది. నేలమీద నెత్తురులో పొరలాడసాగింది. ఆ పోతు పిట్టను చూస్తూ పెంటిపిట్ట జాలి పుట్టేట్టు ఏడువసాగింది.

నేల కూలిన క్రౌంచపక్షిని వాల్మీకిమహర్షి చూచినాడు. ఆ ధర్మాత్ముడికి జాలివేసింది. ఏడుస్తూ ఉన్న పెంటి క్రౌంచమువంక చూచినాడు. ఆ మహాత్ముడి హృదయము ద్రవించింది. ఆ సమయములో-రతిపారవశ్యముతో మైమరిచిపోయిఉన్న సమయములో - ఆ పోతుపిట్టను బోయవాడు కొట్టిచంపివేయడము అధర్మము అని వాల్మీకి మహర్షికి తోచింది. బోయవాణ్ణి చూస్తూ ("మా నిషాద, ప్రతిష్ఠాంత్వగమశ్శాశ్వతీస్సమాః యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్) ఓ కిరాతుడా, మన్మథ పరవశులు అయిఉన్న క్రౌంచ పిట్టల జంటలో ఒకదాన్ని నీవు చంపివేసినావు. ఇక నీవు ఆట్టేకాలము బ్రతుకకూడదు" అన్నాడు.

ఈ వాక్యము అప్రయత్నముగా ఛందోబద్ధముగా వాల్మీకి మహర్షి నోటివెంట వెలువడింది. అందుకు ఆయన ఆశ్చర్యపడిపోయినాడు. "క్రౌంచపిట్టను

చూచి శోకార్తుణ్ణిఅయి 'నేను ఏ విధముగా మాటలు అన్నాను" అని ఆలోచించడము మొదలు పెట్టినాడు.

వాల్మీకిమహర్షి మతిమంతుడు. మహాప్రాజ్ఞుడు. వాక్యవిశారదుడు. మనసా నిశ్చయించుకున్నాడు. శిష్యుణ్ణిచూచి "నేను శోకార్తుణ్ణిఅయి అన్న వాక్యము సమాక్షర పాదబద్ధముఅయిన పద్యముగానూ తంత్రులుమీద ఆలాపించి లయతో పాడటానికి అనువుఅయిన గీతముగానూ నా నోటివెంట వచ్చింది. ఇటువంటి ఛందస్సు ఇదివరకులేదు. దీనిని శ్లోకము అంటాను" అన్నాడు.

భరద్వాజుడు వినయసంపన్నుడు మాత్రమే కాడు. సమస్తశాస్త్రాలూ అభ్యసించినాడు. వాల్మీకిమహర్షి నోటివెంటవచ్చిన వాక్యము తననోటితో అని చూచినాడు. వాల్మీకి మహర్షి చెవులారా విన్నాడు. సంతోషించినాడు.

వాల్మీకి మహర్షి అంతట ఆ తమసానదిలో యథావిధిగా స్నానము చేసినాడు. అప్రయత్నముగా తన నోటివెంట వచ్చిన శ్లోకాన్ని గురించీ శ్లోకార్థాన్ని గురించీ ఆలోచించుకొంటూ ఆశ్రమపదానికి తిరుగుముఖముఅయినాడు. భరద్వాజుడున్నూ కలశమునిండా నీళ్లుతీసుకొని ఆయనవెనుక నడువసాగినాడు. ఇద్దరూ ఆశ్రమపదము చేరినారు.

వాల్మీకి మహర్షి పర్ణశాలలో కూర్చుని మాధ్యాహ్నికకృత్యాలను నెరవేరుస్తూఉన్నప్పటికిన్నీ బోయవాడు క్రౌంచపక్షిని చంపడమూ తన నోటివెంట అప్రయత్నముగా ఛందోబద్ధము అయినవాక్యము దొర్లడమూ మొదలు అయిన విషయాలమీదికే మనస్సు పోయింది.

ఆ సమయాన బ్రహ్మదేవుడు అక్కడ ప్రత్యక్షుడుఅయినాడు. వాల్మీకి మహర్షి ఆశ్చర్యచకితుడు అయినాడు. చటుక్కున లేచినిలుచున్నాడు. నోట మాట పెగలలేదు. పరిశుద్ధ హృదయముతో నమస్కారము చేసినాడు. బ్రహ్మదేవుణ్ణి ఎగాదిగా చూడసాగినాడు. క్షణలేశములో తెప్పరిల్లినాడు. అంతట బ్రహ్మదేవుడికి అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చినాడు. కూర్చుండటానికి ఉత్తమాసనము చూపించినాడు. బ్రహ్మదేవుడు కూర్చున్నతరువాత ఆయన్ను స్తోత్రము చేసినాడు. ప్రదక్షిణముచేసి సాష్టాంగపడినాడు. బ్రహ్మదేవుడు వాల్మీకి మహర్షిని కుశలము అడిగి కూర్చుండుమన్నాడు.

వాల్మీకి మహర్షి బ్రహ్మదేవుడి ఎట్టఎదట కూర్చున్నాడే కాని ఆయన మనస్సు మళ్ళీ క్రౌంచపిట్టలమీదికే పోయింది. "ఆసమయములో - రతిపారవశ్యములో - మైమరచిపోయి మనోహరముగా క్రౌంచపిట్ట పాడుతూఉన్న సమయములో ఆపాపాత్ముడుబోయవాడు దాన్ని కొట్టి చంపివేసినాడు. ఎంతఘోరము

జరిగింది" అనుకుంటూ శోకపరాయణుడు అయిపోయినాడు. తాను అన్న శ్లోకము మళ్ళీ మనస్సులో అనుకోడము మొదలు పెట్టినాడు.

బ్రహ్మదేవుడు వాల్మీకి మహర్షిని చూచి నవ్వుతూ "ఓ మహర్షీ, నీవు చెప్పింది శ్లోకమే. ఆలోచించనవసరములేదు. ఆ సరస్వతి నావల్లనే నీనోటి వెంట వెలువడింది. నీవు రామకథనుఅంతా అటువంటి శ్లోకాలలో చెప్పవలెను. రాముడు అంతటివాడు ఈభూలోకములో ఎక్కడనూలేడు. ఆ రామచరితము నీవు విన్నది విన్నట్టుగా విస్తరించి చెప్పవలెను. ఇంతవరకూ నిగూఢముగా ఉన్న అనేక విషయాలు నీకు ఒక్కడికే గోచరిస్తవి. నీవు చెప్పే కావ్యములో ఒకటిన్నీ అనృతము ఉండదు. నీవు చెప్పేది ఆదికావ్యము అవుతుంది. మహా కావ్యము అవుతుంది. పుణ్యకావ్యమున్నూ అవుతుంది."

"ఓ మహర్షీ, ఈ ప్రపంచములో మహానదులూ మహాపర్వతాలూ ఉండే టంతవరకూ నీవు చెప్పే రామాయణకావ్యము ప్రచారములో ఉంటుంది. అటు ఊర్ధ్వలోకములోనూ ఇటు భూలోకములోనూ నీ కావ్యముతోపాటు నీవున్నూ శాశ్వతముగా జీవించి ఉంటావు" అని చెప్పి బ్రహ్మదేవుడు అంతర్ధానము అయిపోయినాడు.

వాల్మీకి మహర్షీ ఆయన శిష్యులూ పరమానందభరితులు అయినారు. శిష్యులు "మానిషాద" శ్లోకము వల్లన వేయసాగినారు. పదేపదే వల్లించడమువల్ల సమాక్షర పాదబద్ధము అయిన ఆ శ్లోకము నిజముగా శ్లోకము అయింది

అంతట రామాయణ కావ్యము చెప్పవలెను అని వాల్మీకి మహర్షికి బుద్ధి పుట్టింది.

గంభీరముఅయిన అర్థాలతోనూ మనోహరము అయిన శబ్దాలతోనూ సుసంగతము అయిన వాక్యాలతోనూ ఉత్తమోత్తమముఅయిన శ్లోకాలతోనూ రామాయణ మహాకావ్యము వాల్మీకి మహర్షి చెప్ప సంకల్పించుకొన్నాడు.

## 3

నారద మహర్షి చెప్పిపోయిన కథనే కాకుండా రామకథను గురించిన మిగతా వివరాలను అన్నిటినీ వాల్మీకిమహర్షి ఆలోచించినాడు. కాళ్లూ చేతులూ కడుగుకొని ఆచమించి ప్రాచీనాగ్ర దర్భాసనముమీద కూర్చున్నాడు. చేతులు జోడించి ధ్యానము చేయసాగినాడు. దశరథ మహారాజూ ఆయన భార్యలూ సీతారాములూ వారివారి మాటలూ వారివారి నవ్వులూ వారివారి ప్రవర్తనలూ సీతారామలక్ష్మణుల అరణ్యవాసమూ పౌలస్త్యవధమూ మొదలుఅయినవి అన్నీ

బ్రహ్మానుగ్రహమువల్ల ఆయన కన్నులఎదుట పొడగట్టినవి. ఆయా వ్యక్తులను గురించిన నిగూఢవిషయాలు అన్నీ ఆయనకు కరతలామలకము అయినవి.

వాల్మీకిమహర్షి అంతట చెవులకు ఇంపుగా మనస్సుకు ఉల్లాసముగా ఉండేట్లు ధర్మార్థకామాలను వివరిస్తూ నారదమహర్షి సంగ్రహముగా చెప్పిపోయిన క్రమాన రామకథను విస్తరించి అమూల్యముఅయిన రత్నాలుదొరికే మహాసముద్రము మాదిరిగా రామాయణ మహాకావ్యము చెప్పినాడు.

౪

రాముడు తిరిగి కోసలదేశము వచ్చి రాజ్యపాలనము చేస్తూఉండగా వాల్మీకి మహర్షి రామాయణమహాకావ్యము చెప్పినాడు. భవిష్యత్కథను ఉత్తరకాండగా ఆ తరువాత చెప్పినాడు. వేదార్థప్రతిపాదకముగా ఇరవైనాలుగువేల శ్లోకాలలో అయిదువందల సర్గలలో ఆరుకాండలుగా నవరసభరితము అయిన మహాకావ్యముగా రామకథను ఆ చరితవ్రతుడు చేసినాడు. అది పైకి చదివినా మనస్సులో చదువుకొన్నా మనోహరముగా ఉంటుంది.

ద్రుతమధ్య విలంబితాలు అనే మూడు ప్రమాణాలతోనూ సప్తస్వరాలతోనూ వీణావేణుతాళమృదంగాదులమీద ఆలాపించి అభినయిస్తూ గానము చేసినా మనోహరముగా ఉంటుంది.

ఆ మహాకావ్యము ఎవరిచేత ఈ ప్రపంచములో ప్రచారము చేయించడమా అని వాల్మీకి మహర్షి ఆలోచించినాడు. పరమాత్మను ధ్యానము చేయసాగినాడు. అప్పుడు ఆయన పాదాలమీద ఎవరో వాలినట్టుతోచింది. కన్నులు తెరచి చూచినాడు.

వారు కుశలవులు. ఆయన ఆశ్రమములో మునిబాలురుగా పెరుగుతూఉన్న అన్నతమ్ములు. రాముడి బింబానికి ప్రతిబింబాలవంటివారు. గురుశుశ్రూష చేసి సాంగముగా వేదాధ్యయనము చేసినారు. అనేక విద్యలు అభ్యసించినారు. వారు మహామేధావులు. గానశాస్త్ర రహస్యాలను అన్నిటినీ తెలుసుకొన్నారు. మూర్ఛనాస్థానకోవిదులు. ఆటలో పాటలో గంధర్వుల వంటివారు. మధుర భాషణులు.

వారు–ఆ కుశలవులు రామాయణ మహాకావ్యాన్ని ప్రచారము చేస్తాము అని వాల్మీకి మహర్షికి చెప్పుకొన్నారు. ఆయన సంతోషించినాడు. అంతట ఆయన వారిచేత చదివించినాడు. వారు ఆ మహాకావ్యాన్ని అంతా ముఖస్థము చేసుకొన్నారు. వాల్మీకి మహర్షికి చదివి వినిపించినారు. పాడుతూ ఆడి చూపించినారు. ఆ తరువాత ఆ మహానుభావుడి దగ్గరకు వచ్చిన ఋషులూ మహర్షులూ మొదలయిన

వారికి అందరికీ ఎదుట వినిపించినారు. పాడుతూ ఆడి చూపించినారు. అందరూ మెచ్చుకొన్నారు.

ఎందరు ఎందరో మహర్షులూ, బ్రాహ్మణోత్తములూ ఇంకా ఇతర సాధు శంసవ్రతులూ సభ తీర్చుండగా కుశలవులు పోయి రామాయణ మహాకావ్య గానము చేయసాగినారు. ఆపాటకు ఆ సదస్యులు అందరూ విస్మితులు అయిపోయినారు. "భళే: భళే" "బాగుంది: బాగుంది" అంటూ కేకలు వేసినారు. అందరి కన్నులనిండుగా ఆనందబాష్పాలు రాలినవి.

"పాట మనోహరముగా ఉంది. శ్లోకాలు అంతకన్నా మనోహరముగా ఉన్నవి. ఎప్పుడో జరిగింది ఇప్పుడు కన్నుల ఎదుట జరుగుతూఉన్నట్టు తోచింది" అంటూ వారు కుశలవులను పొగడినారు.

అంతట వారు గొంతులు ఎత్తి ఏకకంఠులు అయి రాగయుక్తముగా స్వర సంపన్నముగా కవి హృదయాన్ని భావాన్ని ఏమాత్రమూ చెడపోనీయకుండా మరింత మధురముగా పాడసాగినారు. అప్పుడు ఆ ధర్మవత్సలులలో ఒకాయన లేచి సంతోషాతిశయముతో ఒక జలకలశాన్ని కుశలవులకు బహుమానముగా ఇచ్చినాడు. ఒకాయన వల్కలము ఇచ్చినాడు. ఒకాయన కృష్ణాజినము ఇచ్చినాడు. ఒకాయన మౌంజిని ఇచ్చినాడు. ఒకాయన కమండలువు ఇచ్చి నాడు. ఒకాయన జందెము ఇచ్చినాడు. ఒకాయన అత్తిచెక్కతో చేసిన పీటను ఇచ్చినాడు. అందరూ "దీర్ఘాయురస్తు" అంటూ ఆ అన్నదమ్ములను దీవించినారు.

" ఓ కుశలవులారా, రామకథ ఆశ్చర్యము అయినది. భావికవులు అందరికీ మూలాధారముగానూ పరమాధారముగానూ ఉండే మహావాక్యముగా వాల్మీకి మహర్షి చెప్పినాడు. మీరో సమస్తగానపద్ధతులూ తెలిసినవారు. ఆ మహా కావ్యాన్ని అపాత మధురముగా మీరు గానముచేసినారు. సర్వశ్రుతి మనో హరముగా ఉంది. ఇది పుష్టిని ఇస్తుంది. తుష్టిని ఇస్తుంది. ఆయువునూ ఇస్తుంది" అని ఆ మహర్షులు మొదలు అయినవారు అందరూ ప్రశంసించినారు.

ఇది అంతా రామునికి తెలిసింది. దేశాటనముచేస్తూ కుశలవులు అయోధ్యా నగరమునకు వచ్చినారు అనీ రథ్యలలోనూ రాజమార్గాలలోనూ వారు రామాయణ కావ్యగానము చేస్తూఉన్నారు అనీ తెలిసింది. ఆ ముని బాలురను తన కొలువు కూటానికి పిలిపించినాడు. వారిని చక్కగా సత్కరించినాడు.

రాముడు తమ్ములతోనూ మంత్రిపుంగవులతోనూ మహాజనులతోనూ కొలువుతీరి కూర్చుని కుశలవులను కావ్యగానము చేయమని కోరినాడు. అంతట

ఆ దేవవర్చస్కులు వీణావేణు తాళమృదంగాదులు మ్రోగుతూ ఉండగా ఆలాపించి రామాయణ మహాకావ్యాన్ని దేశపద్ధతిన పాడుతూ అభినయించ సాగినారు. ఆ గానానికి సదస్యులు అంతయూ ఉప్పొంగిపోయినారు. తన్మయులు అయినారు.

అప్పుడు రాముడు ఆ కుశలవులను చూచి "మార్గ"పద్ధతిన ఆ మహాకావ్యము గానము చేయమని చెప్పి సభాసదులను ఉద్దేశించి "మహాజనులారా, ఈ కుశలవులు మునివేషాలలో ఉన్నప్పటికిన్నీ రాజలక్షణలక్షితాంగులుగా కనబడుతున్నారు. గాయకులుగా ఉన్నప్పటికీ తాపసోత్తములుగా గోచరిస్తూ ఉన్నారు. నాకు మేలుచేయటానికి మహాప్రభావము అయిన సీత చరిత్రను ఇక చెప్పబోతున్నారు. వినవలసింది" అన్నాడు.

అంతట కుశలవులు మరింత ఉత్సాహముతో పాటను అందుకొన్నారు. గొంతులు ఎత్తినారు. ఏకకంఠులు అయి స్పష్టముగా కన్నులకు పొడకట్టేట్టు పాడసాగినారు. అప్పుడు రాముడు సింహాసనముమీద కూర్చుండలేక పోయినాడు; దడీచప్పుడూ కాకుండా లేచివచ్చి సభాసదులలో కూర్చున్నాడు.



ఈ భూమిని జయించి రాజ్యము ఏలిన రాజులు అందరిలోనూ ఇక్ష్వాకు వంశీయులు చాలా గొప్పవారు. మనుప్రజాపతి మొదలుకొని ఆ వంశీయులు అందరూ అపూర్వముగా రాజ్యపాలనము చేసినారు. అరవై వేలమంది పుత్రులను ఈ భూమిమీదికి దండయాత్రకు పంపించి ఈ నేలను అంతా త్రవ్వించిన సగరచక్రవర్తి ఆ వంశీయుడే. ఆయన తవ్వించడముచేతనే సముద్రానికి సాగరము అనే పేరువచ్చింది. అటువంటి మహాత్ముల వంశములో రాముడు అనేవాడు పుట్టినాడు. ఆయన్ను గురించిన కథే రామాయణము. అది ధర్మార్థకామాలను తెలియచెప్పే మహాకావ్యము. ఆ మహాకావ్యము వాల్మీకి మహర్షి చెప్పబోతున్నాడు. శ్రద్ధతో వినవలసింది.

సరయూనదీతీరాన సకల ధనధాన్య సమృద్ధము అయిన కోసలదేశము ఉంది. జగత్ప్రసిద్ధమయిన అయోధ్యానగరము ఆదేశానికి రాజధాని. ఆనగరాన్ని పూర్వము వైవస్వత మనువు కట్టించినాడు. దానిపొడుగు పన్నెండుయోజనాలు. వెడల్పు రెండుయోజనాలు. అది మిట్టపల్లాలు లేని సమప్రదేశములో జూదము పీటమాదిరిగా అష్టాపదాకారముగా ఉంది. ఆ పట్టణము నట్టనడుమ రాజభవనమూ ఆ రాజభవనానికి నాల్గుదిక్కులా నాల్గువీధులూ అయి

మూలలుగా సాలువీథులూ ఉన్నవి. ఏభాగానికి ఆ భాగము చక్కగా విడమర్చేటందుకు ఆ వీథులను అట్లా వేసినారు. అవి అన్నీ చాలా విశాలము అయినవి. ప్రతిరోజూ నీళ్లు చల్లి ఘుమఘుమలాడే పుష్పాలలో ఆ వీథులను అన్నిటినీ అలంకరిస్తూ ఉంటారు.

ఆ పురలక్ష్మికి మొలనూలుమాదిరిగా ఒక ఎత్తుఅయిన ప్రాకారము ఉంది. దానికి బంగారుబద్దలుఅయిన తలుపులూ ద్వారబంధాలూ ఉన్నవి. ఆ ప్రాకారము వెలుపల అగాధము అయిన అగడ్త ఉంది. ఆ అగడ్తను దాటి పోవడము అశక్యము. కోటబురుజులు చాలా ఎత్తుఅయినవి. వాటిమీద జయపతాకలు ఎగురుతూ ఉంటవి. ఆ బురుజులమీద ఫిరంగులున్నూ ఉన్నవి.

ఆ అయోధ్యానగరములో రకరకాల ఆయుధాలూ ఇంకా ఎన్నోరకాల యంత్రాలూ ఉంటూ ఉన్నవి. ఆయా పనిపాటులు చేసే శిల్పులున్నూ రథాలు తోలే సూతులున్నూ రాజప్రబోధకులు అయిన మాగధులున్నూ అక్కడనే కాపురము ఉన్నారు.

అంగళ్లవీథులు అన్నీ వేటికి అవిగా ఉన్నవి. ప్రపంచములో సామాన్యముగా దొరకనివస్తువులూ రత్నాలూ మొదలు అయినవి ఆ పట్టణములో విరివిగా దొరుకుతవి. దేశదేశాలనుంచీ వ్యాపారార్థము వచ్చినవర్తకులూ కప్పాలు కట్టే సామంతరాజులూ అక్కడనే నివసిస్తూ ఉండేవారు.

ఆ నగరములో ఎటుచూచినా రత్నఖచితాలు అయిన ప్రాసాదాలూ విమానగృహాలూ కూటాగారాలూ క్రీడాపర్వతాలూ ఎక్కడికి అక్కడ ఉద్యానవనాలూ మామిడితోపులూ స్త్రీలు ఆడే నాటకశాలలూ ఉన్నవి. ఏ భాగములో చూచినా ఇండ్లువత్తుగా ఉంటవి. ఏ ఇంటచూచినా వరిబియ్యము సమృద్ధముగా ఉంటవి. నూతులలో నీరు చెరుకుపానకము మాదిరిగా ఉంటుంది.

ఆ పట్టణము అంతటా ప్రతినిత్యమూ దుందుభులూ మృదంగాలూ వీణలూ పణవాలూ మ్రోగుతూ ఉంటవి. అంతా నిత్యకళ్యాణముగా ఉంటుంది.

ఆ నగరనిర్మాణములో ఇక్కడ ఈ దోషము ఉన్నది అని చెప్పడానికి వీలులేదు. అది దేవేంద్రుడి అమరావతి పట్టణమువంటిది. ఆ అయోధ్యానగరాన్నీ ఆ కోసలరాజ్యాన్నీ మహోచ్ఛదశలోకి తీసుకొనివచ్చినవాడు దశరథమహారాజు. అమరావతీ పట్టణములో దేవేంద్రుడిమాదిరిగా ఆయన ఆ అయోధ్యానగరములో ఉంటూ ఉండేవాడు.

౬

దశరథ మహారాజు మహాపరాక్రమవంతుడు. అమితబలవంతుడు. చతురంగసేనాసమేతుడు. అతిరథుడు. శత్రువులను అందరినీ అణచివేసినాడు. ప్రపంచములో బలవంతులను అందరినీ స్నేహము చేసుకొన్నాడు. శూరులనూ వీరులనూ విద్వాంసులనూ రావించి ఉచితరీతిన సత్కరించి వారు అందరూ తన రాజధానీ నగరములో ఉండిపోయేట్టు చేసినాడు.

బావులూ చెరువులూ తవ్వించి ఇంకా అనేక ధర్మకార్యాలు చేసిన్నీ అటు జానపదులనూ ఇటు పట్టణవాసులనూ ఒక్కమాదిరిగా మెప్పించినాడు. ప్రజలను అందరినీ తనవశము చేసుకొన్నాడు.

ఆయన వేదవిదుడు. యజ్వ. దీర్ఘదర్శి. హిరణ్యరత్నాంబరాభరణాదులతో దేవేంద్రుడి మాదిరిగానూ నిధినిక్షేపాదులతో కుబేరుడిమాదిరిగానూ ఉంటూఉండేవాడు. ఆయన జితేంద్రియుడు. ధర్మహాని లేకుండా అర్థకామాలను అనుభవిస్తూ ఉండేవాడు. రాజరూపఋషి. మహర్షితుల్యుడు. ముల్లోకాలలోనూ పేరుప్రతిష్ఠలు సంపాదించినాడు.

ఆయన రాజ్యపాలనములో అయోధ్యానగరము చుట్టుపక్కల రెండు యోజనాలవరకు ఎవరికీ ఎదిరించశక్యము కాకుండా సార్థకనామము అయిన పట్టణముగా ఉంటూవచ్చింది.

ఆ పట్టణములో ప్రజలు అందరూ అత్యంత సంతోషముతో నివసిస్తూ ఉండేవారు. వారు అందరూ పరమధార్మికులు. బహుశ్రుతులు. సత్యవాదులు. లోభరహితులు. తమకు ఉన్నదానితో తృప్తిపడేవారు. అయితే అందరూ కలవారే. లేనివాడు ఆ పట్టణములో లేనేలేడు. అందరూ ధర్మార్థకామాలను అనుభవిస్తూ ఉండేవారు.

ఏ యింట చూచినా పదిమంది ఉన్న కుటుంబము కనిపించేది. ధనమూ ధాన్యమూ పాడిఆవులూ లేని ఇల్లు ఆ పట్టణములో ఒకటిన్నీ కనిపించేదికాదు. గుఱ్ఱాలు లేనిగృహస్థున్నూ కనిపించేవాడుకాడు. తాను తినక ఇతరులకు పెట్టనివాడుకానీ, ఆలుబిడ్డలనూ అన్నతమ్ములనూ పీడించేవాడుకానీ, కాముకుడుకానీ క్రూరుడుకానీ, వంచకుడుకానీ, నాస్తికుడుకానీ, చదువుకోనివాడుకానీ ఆ అయోధ్యాపట్టణములో కనిపించేవాడుకాడు.

అక్కడి స్త్రీపురుషులు అందరూ ధర్మపరాయణులు. సహజసుస్వభావులు. సదాచారసంపన్నులు. మహర్షులమాదిరిగా నిర్మలమనస్కులు.

ఆ అయోధ్యానగరవాసులు అందరూ ప్రతినిత్యమూ అభ్యంగనస్నానము చేసేవారు. చందనమూ కుంకుమగంధమూ కస్తూరీ మొదలు అయిన పరిమళ ద్రవ్యాలు పూసుకొనేవారు. ఘుమఘుమలాడే పూలదండలు వేసుకొనేవారు. శిరోభూషణాలూ కర్ణాభరణాలూ బాహుపురులూ వక్షఃస్థలాన బంగారు పతకాలూ హస్తాభరణాలూ ధరించేవారు. అందరూ భోగాలు అనుభవించేవారే. అదేవిధముగా అందరూ ఇతరులకు పెట్టేవారే.

ఆ పట్టణములో నీచులూ చోరులూ వర్ణసంకరులూ ఉండేవారు కారు.

అక్కడి బ్రాహ్మణులు అందరూ స్వకర్మనిరతులు. జితేంద్రియులు. దానాధ్యయన పరాయణులు. పరమార్థపరాయణులు. శిక్షావ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిషకల్పాలు అనే షడంగాలనూ అభ్యసించనివారు కానీ చాంద్రాయణాది వ్రతాలు పట్టనివారు కానీ ఒక్కరున్నూ ఉండేవారు కారు. అందరూ ఆహితాగ్నులు. కేవల రూపులు. మహర్షికల్పులు, మహాత్ములుగా ఉండేవారు.

అక్కడి క్షత్రియులు అందరూ మహారథులు. వారు అత్యంత సమర్థులు. సమస్తశస్త్రాస్త్ర విద్యలలో ఆరితేరినారు. ఓడిపోయి పలాయనము అయ్యేవాడిమీదకానీ ఒంటరివాడిమీదకానీ బాణాలు వదిలేవారు కారు. శబ్దవేధి విద్యను అభ్యసించినప్పటికిన్నీ మాటుపెట్టుకొని చప్పుడునుపట్టి బాణాలు వేసేవారు కారు. మహారణ్యాలలో మదించి గర్జిస్తూ సంచరించే క్రూరమృగాలను బాహుబలముతో కానీ నిశితాస్త్రాలు వేసి కానీ చంపివేసేవారు. వారు అందరూ నిష్కళంకవంటివారు. అందరు సుశిక్షితులు. గుహలలో సింహాలమాదిరిగా ఎదిరించడానికి అలవికాకుండా ఆ అయోధ్యాపట్టణములో నివసిస్తూ ఉండేవారు.

ఆ అయోధ్యా నగరములో ఉన్న అన్నికులాలవారూ అతిథిని ఆదరించకుండా ఏనాడూ భోజనము చేసేవారు కారు. మేలు మరచిపోయేవారు కారు. అడిగినవాడికి లేదు అనేవారు కారు. ఆ మహానగరములో దీనజనులూ వ్యాకులచిత్తులూ వ్యాధిపీడితులూ ఉండేవారు కారు. స్త్రీ పురుషులు అందరూ కాంతిమంతులు. రూపవంతులు. కురూపులు అక్కడ ఎక్కడనూ కనిపించేవారు కారు.

బ్రాహ్మణులను అనుసరించి క్షత్రియులూ క్షత్రియులను అనుసరించి వైశ్యులూ ఆ మూడుకులాలవారికీ అనుకూలముగా శూద్రులూ ప్రవర్తించేవారు.

ఆ అయోధ్యానగరములో కాంభోజ బాహ్లీక వనాయు సింధుదేశాలలో పుట్టిన గుర్రాలు అనేకము ఉండేవి. ఏ గుర్రాన్ని చూచినా ఉచ్చైశ్రవము మాదిరిగా కనిపించేది.

వింధ్యపర్వతాలలో పుట్టిన మదపుటేనుగులూ హిమవత్పర్వతప్రాంతాలలో పుట్టి మదించి పెద్దపెద్ద కొండలమాదిరిగా కనిపించే ఏనుగులూ ఇంకా ఐరావత మహాపద్మ అంజన వామనజాతుల ఏనుగులూ ఆ పట్టణములో తండోపతండాలుగా తిరుగుతూ ఉండేవి. ఏనుగులు భద్రములు అనీ మృగములు అనీ మంద్రములు అని మూడు జాతులు. వాటికి ఇంకా అనేక సంకీర్ణ జాతుల ఏనుగులకున్నూ అయోధ్యానగరము పుట్టినిల్లు.

గుర్రాలూ ఏనుగులేకాకుండా పెద్దశరీరకము ఎద్దులూ ఒంటెలూ కంచరగాడిదలూ మందలుమందలుగా ఆ పట్టణములో తిరుగుతూఉండేవి.

అటువంటి ఆ మహాపట్టణములో చుక్కలలో చంద్రుడు మాదిరిగా దశరథమహారాజు ఉంటూ ఉండేవాడు.

౨

దశరథమహారాజుకు వసిష్ఠవామదేవులు అనే ఇద్దరు మహర్షులూ ముఖ్య పురోహితులు.

ధృష్టి - జయంతుడు - విజయుడు - అర్థసాధకుడు - అశోకుడు - మంత్రపాలుడు- సుమంత్రుడు అనే ఎనిమిదిమంది ఆయనకు మంత్రులు. వారిలో సుమంత్రుడు దశరథ మహారాజుకు అంతరంగికుడు. అతనికి అంతఃపుర ప్రవేశాధికారమున్నూ ఉండేది.

ఆ మంత్రులు అందరూ విద్యావినయ సంపన్నులు. నీతికుశలురు. నియతేంద్రియులు. శ్రీమంతులు. బుద్ధిమంతులు. శాస్త్రజ్ఞులు. అప్రతిహత పరాక్రమవంతులు. మంత్రనైపుణ్యములో పేరుప్రతిష్ఠలు సంపాదించినారు. అకార్యాచరణకు వెరచేవారు. ఎప్పుడూ హెచ్చరికతో ఉండేవారు. ఓర్పుకూ ప్రతాపానికీ ప్రఖ్యాతి కెక్కినారు. కారకారలాడకుండా ఎవరితోనైనా ఎప్పుడూ చిరునవ్వుతో మురిపెముగా మాట్లాడేవారు. కోపమువచ్చినా కామార్థకారణాలవల్లనయినా అనృతము ఆడేవారుకారు.

వారు స్వరాష్ట్రములోనూ పరరాష్ట్రాలలోనూ పుట్టుపూర్వోత్తరాలు ఎప్పటికి అప్పుడు వేగులవాండ్లవల్ల తెలుసుకొంటూ ఉండేవారు. వారు సర్వ వ్యవహార సమర్థులు. వారికి మిత్రామిత్ర భేదము ఉండేదికాదు. అపరాధము చేస్తే కన్నకొడుకునుఅయినా శిక్షించేవారు. శత్రువును అయినా అపరాధము చేయకపోతే హింసించేవారుకారు.

వారు బొక్కసాన్ని పెంచడములోనూ సైనికులను సమకూర్చుకొనడము లోనూ జాగరూకులుగా ఉండేవారు. బ్రాహ్మణ క్షత్రియులను అయినా

అపరాధముచేస్తే శిక్షిస్తూ ఎప్పుడూ సజ్జనులను కాపాడుతూ ఉండేవారు. అపరాధము చేసినవారి తారతమ్యాలనుపట్టి ధనదండము విధించేవారు. వారు అందరూ ఏకాభిప్రాయముతో రాజ్యతంత్రాన్ని నడిపేవారు.

ఆ మంత్రి పుంగవుల నీతిజ్ఞతవల్ల అయోధ్యానగరములోనూ ఆ కోసల రాజ్యము అంతటానూ అబద్ధాలు ఆడేవారూ మోసగాండ్లు పరదారరతులూ లేకుండాపోయినారు. ఆ మంత్రిసత్తములు దేశాంతరాలలో సయితము పేరు ప్రఖ్యాతులు సంపాదించినారు. ఎన్నడూ ఏమరుపాటులేకుండా నిశ్చయజ్ఞానముతో ప్రవర్తించేవారు. నీతిమార్గాన రాజ్యాన్ని కాపాడుతూ ఉండేవారు.

తేజోమయాలు అయిన కిరణాలతో ఉదయభాస్కరుడు మాదిరిగా ఆ మంత్రులతో దశరథ మహారాజు అయోధ్యా నగరములో తేజరిల్లుతూ ఉండేవాడు.

## ౨

దశరథ మహారాజు అంతటి ప్రభావముతో ఉంటూఉన్నా ఆయనకు ఎంతకాలానికీ సంతానము కలగలేదు. వంశాభివృద్ధి చేయడానికి ఒక్కకొడుకు అయినా పుట్టలేదే అని దిగులుపడ్డాడు. అశ్వమేధముచేస్తే పుత్రులు పుట్టుతారేమో ననుకొన్నాడు. ఆలోచించినాడు. మంత్రులతో సంప్రదించినాడు. సుమంత్రుణ్ణి చూచి "గురువులనూ పురోహితులనూ ఇంకా ఇతర బ్రాహ్మణోత్తములనూ నీవు శీఘ్రముగా పిలుచుకొనిరావలెను" అని చెప్పినాడు.

సుమంత్రుడుపోయి అప్పటికి అప్పుడు గురువరేణ్యుడు అయిన వసిష్ఠ మహర్షినీ వేదపారంగతులు అయిన సుయజ్ఞుణ్ణీ వామదేవుణ్ణీ జాబాలినీ కాశ్యపుణ్ణీ ఇంకా తక్కిన బ్రాహ్మణోత్తములనూ వెంటపెట్టుకొనివచ్చినాడు.

వారిని అందరినీ దశరథ మహారాజు ఉచితరీతిని సత్కరించి "ఓ బ్రాహ్మణోత్తములారా, సంతానములేదే అనే తాపత్రయమువల్ల నాకు సుఖము లేకుండాపోయింది. అందుకు అశ్వమేధము చేయవలెను అని నాకు బుద్ధి పుట్టింది. ఆ యజ్ఞము సశాస్త్రీయముగానూ నిర్విఘ్నముగానూ నేను నెరవేర్చేటందుకు అవసరము అయిన సదుపాయాలు అన్నీ మీరు చేసిపెట్టవలెను" అన్నాడు.

వసిష్ఠమహర్షీ తక్కిన బ్రాహ్మణోత్తములూ దశరథ మహారాజును మెచ్చుకొని "ఓరాజా, తమకు పరమధార్మికము అయిన బుద్ధి పుట్టింది. తప్పకుండా తమకు పుత్రులు పుట్టుతారు. ముందుగా యజ్ఞోపకరణాలను అన్నిటినీ సమకూర్చవలెను. ఆ తరువాత యాగాన్ని వదలవచ్చును" అని చెప్పినారు.

దశరథ మహారాజు మహర్షుల మాటలకు ఎంతో సంతోషపడ్డాడు. ఆయన కన్నుల వెంట ఆనందబాష్పాలు రాలినవి. అంతట ఆయన మంత్రులను ఉద్దేశించి "ఓ, మంత్రిపుంగవులారా, మీరు ఈ గురూద్వహులు చెప్పే సమస్త సంభారాలనూ వెంటనే సమకూర్చవలెను. ఋత్విజులతోనూ సమర్థులు అయిన సైనికులతోనూ గుర్రాన్ని దేశముమీద విడిచిపెట్టవలెను.

సరయూనదీ ఉత్తరతీరాన యజ్ఞశాలను ఏర్పాటుచేయవలెను. శాస్త్రీయముగా శాంతులను అన్నిటినీ చేయించవలెను. ఈ అశ్వమేధ యాగము ఏ రాజుపడితే ఆ రాజు చేసేదికాదు. ఈ యజ్ఞాన్ని నిర్విఘ్నముగా సమాప్తము చేయడము చాలా కష్టసాధ్యము అయినపని. ఏమాత్రము అపచారము జరిగినా యజ్ఞకర్త అప్పటికి అప్పుడు నాశనము అయిపోతాడు. సర్వమూ నాశము అయిపోతుంది. ఈ యజ్ఞములో ఎప్పుడు ఏ కొంచెము లోపము వస్తుందా అని బ్రహ్మరాక్షసులు కనిపెట్టుకొనిఉంటారు. ఏ కొంచెము లోపము జరిగినా వాళ్లు యజ్ఞాన్ని ధ్వంసము చేసివేస్తారు. మీరు సమస్తమూ తెలిసినవారు. ఈ క్రతువును నాచేత మీరు యథావిధిగా చేయించవలెను. ఈ భారము అంతా మీమీద ఉంచుతున్నాను." అన్నాడు.

"రాజా, తాము ఆజ్ఞాపించినట్లుగా సమస్తమూ చక్కబెట్టుతాము" అని మంత్రులు అన్నారు.

"రాజా, మీచేత శాస్త్రీయముగానూ నిర్విఘ్నముగానూ మేము అశ్వమేధము చేయిస్తాము" అని బ్రాహ్మణోత్తములు అందరూ అన్నారు. వారు అందరూ దశరథ మహారాజును ఆశీర్వదించినారు.

మహర్షులూ బ్రాహ్మణులూ వెళ్లిపోయిన తరువాత దశరథ మహారాజు మంత్రులతో "ఓ మంత్రిసత్తములారా, మీరు ఋత్విక్కులు చెప్పే యజ్ఞోపకరణాలను అన్నిటినీ శీఘ్రముగా సమకూర్చవలెను." అని చెప్పి వారిని పంపించివేసినాడు.

దశరథ మహారాజు అంతట అభ్యంతర గృహములోకి పోయినాడు. హృదయప్రియలు అయిన కులకాంతలను చూచి "మీరు పిల్లలు కనేటందుకు నేను ఇప్పుడు ఒక యజ్ఞము చేయబోతున్నాను. మీరు ఇక యజ్ఞదీక్ష వహించవలెను" అన్నాడు.

ఆ మనోహర వాక్యాలకు ఆ వర్చస్విసుల ముఖకమలాలు హేమంతకాలానంతర పద్మాలవలె వికసించినవి.

## ౯

సుమంత్రుడు దశరథమహారాజును ఏకాంతముగా కలుసుకొని "రాజా, తమకు పుత్రులు ఎట్లా పుట్టేదిన్నీ పూర్వము మునిసభామధ్యములో భూత భవిష్యద్వర్తమానాలు చెప్పే సనత్కుమార మహర్షి చెప్పుతూ ఉండగా నేను విన్నాను. ఆ మహర్షి అప్పుడు చెప్పింది అంతా తమకు నేను ఇప్పుడు మనవి చేస్తాను. తాము వినవలెను" అంటూ ఈ విధముగా చెప్పసాగినాడు.

కాశ్యప మహర్షికి విభండకుడు అనే పుత్రుడు పుట్టుతాడు. ఆ విభండకుడికి ఋశ్యశృంగుడు అనేవాడు పుట్టుతాడు. వాడు అడవిలో పుట్టి ఆ అడవిలోనే తండ్రి దగ్గర పెరుగుతాడు. అందువల్ల వయస్సు వచ్చినప్పటికిన్నీ ఈ ప్రపంచములో అడవి తప్ప వాడు ఏ ఇతరమున్నూ ఎరగకుండా ఉంటాడు. వాడు రెండు రకాల బ్రహ్మచర్యాన్ని అనుష్ఠిస్తాడు. అందుకు అతనిని ఈ లోకములో బ్రాహ్మణులు అందరూ మెచ్చుకుంటారు.

ఆ ఋశ్యశృంగుడు తండ్రికి సేవచేస్తూ ఎప్పుడూ అగ్నిహోత్రాన్ని సేవిస్తూ బ్రహ్మచారిగా కాలము గడుపుతూ ఉండే రోజులలో అంగదేశములో రోమపాద మహారాజు రాజ్యము ఏలుతూ ఉంటాడు.

రోమపాదుడు అమిత బలవంతుడుగానూ మహాపరాక్రమ వంతుడుగానూ రాజ్యపాలనము చేస్తూ ధర్మాన్ని వ్యతిక్రమిస్తాడు. అప్పుడు అంగదేశము అంతటా బహుకాలము వానలు కురవకుండా పోతవి. మహాక్షామము వస్తుంది. సర్వ భూత భయావహము అయిన స్థితి ఏర్పడుతుంది. అప్పుడు రోమపాదమహారాజు చింతాక్రాంతుడు అయిపోయి వేదశాస్త్ర పారంగతులు అయిన బ్రాహ్మణోత్తములను అందరినీ ఆహ్వానించి "ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా, తాము సమస్త ధర్మాలూ లోకాచారాలూ తెలిసినవారు. ఈ అనావృష్టి దోషము తొలగి పోవడానికి ఏవిధము అయిన పాపపరిహారము నేను చేయవలెనో తాము సెలవు ఈయవలెను" అని అడుగుతాడు.

"ఓ రాజా, ఏ విధముగానైనా ఏ ఉపాయము వల్లనయినా విభండక మహర్షిపుత్రుడు ఋశ్యశృంగుణ్ణి తాము ఇక్కడికి రావించి ఆయనను తాము చక్కగా సత్కరించి తమ కూతురు శాంతాదేవిని ఆయనకు ఇచ్చి వివాహము చేసేట్లయితే అనావృష్టి దోషము అంతరించి పోతుంది. ఈ దేశము అంతా సుభిక్షము అవుతుంది" అని బ్రాహ్మణ వృద్ధులు చెప్పుతారు.

ఋశ్యశృంగుణ్ణి అంగరాజ్యము రప్పించడము ఎట్లాగా అని అప్పుడు రోమపాదుడు ఆలోచిస్తాడు. ఆయనకు ఏ ఉపాయమూ తోచదు. అంతట మంత్రు

లను పురోహితులను రావించి వారిని చక్కగా సత్కరించి, "మీరే ఋశ్యశృంగుణ్ణి తీసుకొనిరావలెను" అని రోమపాదమహారాజు ఆజ్ఞాపిస్తాడు. అందుకు మంత్రిపుంగవులూ పురోహితులూ ఖిన్నులుఅయిపోయి ముఖాలు వేళ్ళాడవేసుకొని "మహారాజా, విభండక మహర్షి అంటే మాకు అమిత భయము. అందువల్ల మేము అక్కడికిపోలేము. కాని ఋశ్యశృంగుణ్ణి ఇక్కడికి రప్పించే ఉపాయము అయితే మేము చెప్పగలము. మేముచెప్పే ఉపాయమువల్ల ఏ ఇబ్బందీ రాదు" అని చెప్పతారు.

అంతట రోమపాదుడు ఆ మంత్రిపుంగవులు మొదలు అయినవారు చెప్పిన ఉపాయముచొప్పున ఋశ్యశృంగుడి దగ్గరకు వేశ్యాంగనలను పంపిస్తాడు. వారు ఆయనను అంగదేశము తీసుకొనివస్తారు. అప్పుడు అంగదేశములో వానలు కురుస్తవి. రోమపాదుడు తన కూతురు శాంతాదేవిని ఆయనకు యిచ్చి పెండ్లి చేస్తాడు.

ఆ ఋశ్యశృంగుడు దశరథ మహారాజుచేత ఒకయజ్ఞము చేయిస్తాడు. అప్పుడు ఆయనకు పుత్రులు పుట్టుతారు" అంటూ సనత్కుమార మహర్షి చెప్పినాడు. నేనువిన్నాను.

ఈ విధముగా సుమంత్రుడు చెప్పిందిఅంతా దశరథమహారాజు విన్నాడు. ఎంతో సంతోషపడ్డాడు. "సుమంత్రుడా అంగరాజు ఆ ఋశ్యశృంగుణ్ణి రోమపాద పట్టణానికి రావించిన విధము అంతా నాకు వివరముగా చెప్పవలెను" అన్నాడు దశరథమహారాజు.

౧౦

సుమంత్రుడు అంతట దశరథ మహారాజుతో మళ్ళీ యీ విధముగా చెప్పసాగినాడు.

మంత్రులూ పురోహితులూ సంప్రదించినారు. పురోహితుడు రోమపాద మహారాజుతో "ఓ రాజా, ఋశ్యశృంగుణ్ణి ఇక్కడికి రప్పించడానికి అపాయము లేని ఉపాయము మేము ఒకటి ఆలోచించినాము. ఆ బ్రహ్మచారి అడవిలో పుట్టినాడు. అడవిలోనే పెరిగినాడు. ఎప్పుడూ తపస్సు చేసుకొంటూనూ వేదాధ్యయనము చేసుకొంటూనూ ఉంటాడు. అందువల్ల ఆయన స్త్రీలనూ విషయసుఖాలనూ ఏమాత్రమూ ఎరగడు. శబ్దస్పర్శ రూపరసగంధాదులు ఎటువంటివాడి చిత్తాన్ని అయినా ఇట్టే క్షోభపెట్టుతవి. అవి దేహేంద్రియాలకు సమస్త సుఖాలను ఇస్తవి. అటువంటి దేహేంద్రియ సుఖము కోసము ఋశ్యశృంగుడు ఈ పట్టణము వచ్చేట్టుగా మనము చేయవచ్చును. రూప

వతులుఅయిన వేశ్యలు చక్కగా అలంకరించుకొని ఆయన దగ్గిరకు పోవలెను. అతడు అమాయికుడు అయినందువల్ల వారిని అందరినీ చక్కగా సత్కరిస్తాడు. వారు ఆ వేశ్యలు వివిధోపాయాలతో ఆయనను వంచనముచేసి ఇక్కడికి తీసుకొనివస్తారు. ఇందుకు మీరు అంగీకరించవలెను" అన్నాడు.

రోమపాదుడు అందుకు ఒప్పుకొన్నాడు. అంతట మంత్రులున్నూ పురోహితులున్నూ ఋశ్యశృంగుణ్ణి రప్పించే ప్రయత్నానికి పూనుకొన్నారు.

వేశ్యాంగనలు మహారణ్యానికి బయలుదేరినారు. ఋశ్యశృంగుడి ఆశ్రమ ప్రాంతానికి పోయినారు. లోపలికి పోవడానికి వారికి భయము వేసింది. బయటనే ఉండి ఆయనను చూడటానికి ప్రయత్నము చేయసాగినారు.

ఆ ఋశ్యశృంగుడు ఆ ఆశ్రమపదములో అగ్నిహోత్రాన్ని సేవిస్తూనూ తండ్రికి శుశ్రూష చేస్తూనూ ఉండటముతప్ప మరి ఒకటి ఎరగడు. ఆయనకు మరి ఏ ఇతర ధ్యాసాలేదు. తండ్రివెంట తప్ప ఆయన ఒంటరిగా ఆ ఆశ్రమ పదములోనుంచి ఎన్నడూ బయటికిపోఎయిరగడు. అతడు పుట్టింది మొదలూ అంతవరకూ ఒక స్త్రీనికానీ తండ్రినితప్ప మరిఒక పురుషుణ్ణికానీ చూచి ఎరగడు. ఒక గ్రామముకానీ ఒక పట్టణముకానీ ఆయన ఎన్నడూ పోయి ఎరగడు. అటువంటివాడు ఆనాడు తండ్రి లేనప్పుడు దైవవశమువల్ల ఒంటరిగా ఆ ఆశ్రమ పదములోనుంచి బయటికి వచ్చినాడు. అప్పుడు రోమపాదపురమునుంచి వచ్చిన చక్కని చుక్కలు ఎట్టఎదుట కనిపించినారు. వారిని చూచినాడు.

చిత్రవిచిత్ర వేషాలతో వచ్చిన భోగము పడుచులున్నూ ఋశ్యశృంగుణ్ణి చూచినారు. మనోహరముగా పాటలు పాడుతూ వారు ఆయనను సమీపించి "ఓ బ్రాహ్మణుడా, నీవు ఎవరవు- నీ నివాసము ఎక్కడ- జనసంచారము లేని ఈ ఘోరారణ్యములో నీవు ఒంటరిగా ఎందుకు తిరుగుతూ ఉన్నావు. చెప్పవలెను" అని ప్రశ్నించినారు.

ఆ గణికలు అందరూ కామ్యమాన రూపలు. అటువంటి రూపవతులను అదివరకు ఎన్నడూ ఆయన ఆ అడవిలో చూచి ఉండలేదు. వారిమీద ఆయనకు అకారణము అయిన రాగము కలిగింది. వారితో మాట్లాడవలెను అని ఆయనకు బుద్ధిపుట్టింది. వారిని అందరినీ చూస్తూ "మా తండ్రి విభండక మహార్షి. నేను ఆయన ఔరసపుత్రుణ్ణి. నన్ను ఋశ్యశృంగుడు అంటారు. ఈ ప్రపంచములో శమస్తవిధ కర్మలనూ నేను అవగతము చేసుకొన్నాను. ఓ చుక్కలారా, ఇక్కడికి దగ్గిరలోనే మా ఆశ్రమపదము ఉంది. మిమ్ములను అందరినీ అక్కడను అయితే నేను శాస్త్రీయముగా సత్కరిస్తాను. మీరు అందరూ మా ఆశ్రమ పదానికి రావలెను." అన్నాడు ఋశ్యశృంగుడు.

అకన్నెలకు ఋశ్యశృంగుడి ఆశ్రమము పోయి చూడవలెను అని బుద్ధి పుట్టింది. ఆయనవెంట వారు అందరూ బయలుదేరినారు. ఆశ్రమములోకి పోయి నారు.

"ఇదిగో అర్ఘ్యము-ఇదిగో పాద్యము-ఇవిగో కందమూలాలూ పండ్లూ" అంటూ ఇచ్చి ఆపడుచులను అందరినీ ఋశ్యశృంగుడు చక్కగా సత్కరించి నాడు. అకన్నెలు అందరూ అమితోత్సాహముతో ఆ య న సత్కారాలను అందుకొన్నారు. కాని విభండకమహర్షి ఏక్షణములో వస్తాడోనని భయపడి పోతూ త్వరగా అక్కడినుంచి తరలిపోవలెను అనుకొన్నారు.

"ఓ బ్రాహ్మణుడా, ఇవిగో మేము తెచ్చిన ఫలాలు. వీటిని నీవు తీసుకో వలెను. నీకు శుభముఅవుతుంది. తిను. ఆలస్యము చేయవద్దు" అంటూ అకన్నెలు ఆయనను గట్టిగా కౌగిలించుకొన్నారు. ఆయన ఆనందపరవశుడు అయిపోయి నాడు. వారు పండ్లుఅంటూ ఇచ్చిన తియ్యని పిండివంటలనూ రకరకాల భక్ష్యా లనూ ఆ తేజోవంతుడు అప్పటికి అప్పుడు తిన్నాడు. ఆశ్చర్యపడిపోయినాడు. ఏమంటే అటువంటి పండ్లను ఆ అడవిలో ఆయన అదివరకు ఎన్నడూ రుచి చూడలేదు.

ఆయన తండ్రి ఎక్కడ వస్తాడో ననే భయముతో అకన్నెలు "మేము మా వ్రతానుష్ఠానానికి వెంటనే వెళ్లిపోవలెను" అంటూ ఆయనకు సాకు చెప్పి వెళ్లిపోయినారు.

ఆ భోగము పడుచులు అందరూ వెళ్లిపోగానే ఆ బ్రహ్మచారికి హృదయ స్వాస్థ్యము తప్పిపోయింది. వారు మళ్ళీ కనపడతారో కనపడరో ననే దిగులు పుట్టింది. అంతట ఆయన అటూ ఇటూ తిరగడము మొదలుపెట్టినాడు.

ఆయన నియత బ్రహ్మచారి అయినప్పటికిన్నీ ఆ మనోహరాంగనలు కనిపించినచోటికి మర్నాడు మళ్ళీ వెళ్లినాడు.

ఋశ్యశృంగుడు రావడము ఆ భోగముకన్నెలు చూచినారు. మహా దానందముతో ఎదురుగుండా పోయినారు. ఎదురుకోలు చెప్పినారు. "ఓ బుద్ధి మంతుడా, ఈనాడు నిన్ను మాఆశ్రమపదానికి తీసుకొని పోవడానికి మేము వచ్చినాము. నీవు తప్పకుండా మావెంట రావలెను. మేము నిన్ను నిన్నటి కన్నా అక్కడ ఎక్కువగా సమ్మానిస్తాము" అన్నారు. వారి మనోహర వాక్కులకు ఋశ్యశృంగుడు ముగ్ధుడు అయిపోయినాడు. వారి వెంట బయలు దేరడానికి ఇష్టపడ్డాడు.

ఆ వారాంగనలు ఆ ఋశ్యశృంగుణ్ణి వెంటబెట్టుకొని అంగదేశానికి ప్రయాణను అయినారు.

అంగదేశములో ఋశ్యశృంగుడు అడుగుపెట్టినాడు. దేశము అంతటా మబ్బులు పట్టినవి. ముసురుపట్టింది. వానలు జోరుగా కురవడము మొదలుపెట్టినవి. ప్రజలుఅందరూ ఆనందపరవశులు అయినారు. వానలు వెంటపెట్టుకొని వస్తూవున్న ఋశ్యశృంగుడికి రోమపాదమహారాజుఎదురుగుండాపోయి సాష్టాంగ నమస్కారము చేసినాడు. శాస్త్రీయముగా అర్ఘ్యపాద్యాదులు ఇచ్చినాడు.

ఆయనను అట్లా తనదేశము రావించినందుకు క్షమించవలసింది అనీ ఆయనే కాకుండా ఆయన తండ్రి విభండకమహర్షికూడా తనను మన్నించేట్టు చేయవలసింది అనీ రోమపాదుడు నిర్మలాంతఃకరణముతో ప్రార్థించినాడు.

ఋశ్యశృంగుడు ఎప్పటికీ తన అంతఃపురము వదిలిపెట్టి పోకుండా ఉండడానికి ఆతరువాత రోమపాద మహారాజు తన కూతురు శాంతాదేవిని ఆయనకు ఇచ్చి యథావిధిగా వివాహము చేసి ప్రశాంతచిత్తుడు అయినాడు.

రాజా, ఇప్పుడు ఋశ్యశృంగుడు శాంతాదేవితో సమస్త సుఖాలూ అనుభవిస్తూ రోమపాదుడి అంతఃపురములో ఉంటూ ఉన్నాడు.

## ౧౧

"రాజా, ఆసనత్కుమార మహర్షి ఇంకా కొంత చెప్పినాడు. అదిన్నీ చెప్పతాను. తాము వినవలెను. తమకు మేలు అవుతుంది" అంటూ సుమంత్రుడు ఇంకా ఈవిధంగా చెప్పడము మొదలు పెట్టినాడు.

"ఇక్ష్వాకువంశములో శ్రీమంతుడూ సత్యసంధుడూ పరమధార్మికుడూ అయిన ఒక రాజు పుట్టుతాడు. ఆయనను అందరూ దశరథమహారాజు అని పిలుస్తారు. అదేకాలములో అంగదేశములో రోమపాదుడు అనే మహారాజు పుట్టుతాడు. వారికి ఇద్దరికీ చాలా స్నేహము అవుతుంది. దశరథమహారాజుకు ఎంతకాలానికీ పిల్లలు పుట్టరు. ఆయన రోమపాదమహారాజు దగ్గరకుపోయి "రాజా, సంతానముకోసమున్నూ వంశాభివృద్ధికోసమున్నూ నేను ఒక మహాయజ్ఞము చేయ తలచినాను. ఆయజ్ఞము నా చేత చేయించే సామర్థ్యము నీఅల్లుడు ఋశ్యశృంగుడికి ఒక్కడికే ఉంది. నీవు చెప్పేటట్లయితే నీ అల్లుడు వచ్చి నా చేత ఆయజ్ఞముచేయిస్తాడు. నాకు పిల్లలు పుట్టుతారు. కాబట్టి నీవు చెప్పి నీ అల్లుణ్ణి నీ కూతురినీ నాతో పంపించవలెను." అని అడుగుతాడు.

ఆ రోమపాదమహారాజు మహాబుద్ధిమంతుడు. మనసా ఆలోచిస్తాడు. ఎంతోమంది బిడ్డలను కన్న తన కూతురినీ అల్లుణ్ణి ఋశ్యశృంగుణ్ణీ దశరథమహారాజు వెంట పంపిస్తాడు. అంతటితో దశరథమహారాజుకు సంతానములేదే అనే మనస్తాపము వదిలిపోతుంది. మహాసంతోషముతో యజ్ఞము తలపెట్టుతాడు. ఆయజ్ఞము నిర్విఘ్నముగా కొనసాగించిన ఋశ్యశృంగుడికి దశరథమహారాజు నమస్కారము చేస్తాడు. ఆయనను పూజిస్తాడు. అప్పుడు ఆబ్రాహ్మణోత్తముడు దశరథమహారాజుచేత పుత్రుల కోసము మరి ఒక కామ్యయజ్ఞము చేయిస్తాడు. దశరథమహారాజుకు నలుగురు పుత్రులు పుటతారు. వారు అమితపరాక్రమవంతులూ వంశప్రతిష్ఠానకరులూ సకలలోకప్రసిద్ధులూ అవుతారు." అని పూర్వము కృతయుగములో మహాత్ముడు సనత్కుమారుడు చెప్పుతూ ఉండగా నేను విన్నాను. రాజా మీరు పుత్రార్థులు. కాబట్టి మీరు ఇప్పుడు చతురంగబలాలతో బయలుదేరి రోమపాదపురముపోయి ఋశ్యశృంగుణ్ణి సత్కరించి ఆయనను ఇక్కడికి తీసుకొనివచ్చి యజ్ఞము ఆరంభించడమునుంచిది." అని సుమంత్రుడు చెప్పినాడు.

దశరథమహారాజు ఈ విషయము వసిష్ఠమహర్షితో సంప్రదించినాడు. "ఋశ్యశృంగుణ్ణి తీసుకొనిరావలసిందేను" అని వసిష్ఠమహర్షిన్ని ప్రోత్సాహము చేసినాడు.

అంతట దశరథమహారాజు మంత్రిసత్తములతోనూ పరివారముతోనూ రోమపాదపురానికి ప్రయాణము అయినాడు. అడవులనూ మహానదులనూ ఒక్కటొక్కటే మెల్లమెల్లగా దాటుకొంటూ అంగదేశము చేరినాడు.

స్నేహితుడు తన ఇంటికి వచ్చినందుకు రోమపాదుడు చాలా సంతోషపడ్డాడు. యథావిధిగా సమ్మానించినాడు. హోమకుండములో జ్వలించే అగ్నిహోత్రుడిమాదిరిగా ఆ అంతఃపురములో దివ్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న ఋశ్యశృంగుణ్ణి దశరథ మహారాజుకు పరిచయము చేసినాడు. తనకూ దశరథ మహారాజుకూ ఉన్న సఖ్యాన్ని గురించీ సంబంధాన్ని గురించీ రోమపాదుడు ఋశ్యశృంగుడికి తెలియచెప్పినాడు. ఆ బుద్ధిశాలి ఋశ్యశృంగుడు దశరథమహారాజును స్వయముగా గౌరవించి సత్కరించినాడు.

దశరథమహారాజు రోమపాదుడి సపర్యలను అనుభవిస్తూ అక్కడ ఏడు ఎనిమిది దినాలు గడిపినాడు. అంతట రోమపాదుడితో "రాజా, నేను సంతానము కోసము ఒక మహాక్రతువు తలపెట్టినాను. అది నాచేత చేయించగలవాడు నీ అల్లుడు ఋశ్యశృంగుడు ఒక్కడేను. కాబట్టి నీ అల్లుణ్ణీ నీ కూతురినీ నా వెంట పంపించవలెను" అన్నాడు దశరథ మహారాజు. అంతట రోమపాదుడు

ఆ విషయము ఋశ్యశృంగుడితో ప్రస్తావించినాడు. అందుకు ఆయన "సరేను" అన్నాడు.

రోమపాదుడున్నూ దశరథమహారాజున్నూ ఆనందపరవశులు అయి అన్యోన్యమూ రొమ్ములు అంట గట్టిగా కౌగలించుకొన్నారు. అంతట రోమపాదుడికి వీడ్కోలు చెప్పి శాంతా ఋశ్యశృంగులను వెంటపెట్టుకొని దశరథమహారాజు అయోధ్యానగరానికి ప్రయాణము అయినాడు. ఆయన ముందుగా దూతలను అయోధ్యానగరానికి పంపించినాడు. వారు తమ ఏలిక ఋశ్యశృంగుణ్ణి వెంటపెట్టుకొని వస్తూఉన్నట్టు అయోధ్యానగరవాసులకు తెలియచెప్పినారు. నగరములో ఎక్కడనూ దుమ్ము రేగకుండా అన్నివీధులలోనూ నీళ్లు చల్లినారు. ఘుమఘుమలాడే ధూపాలు వేసినారు. జండాలు ఎత్తినారు. పట్టణము అంతా శోభాయమానముగా అలంకరించినారు.

శంఖదుందుభుల మ్రోతలతో దశరథమహారాజు అయోధ్యానగరము ప్రవేశించినాడు. పౌరులు అందరూ తమ మహారాజును సత్కరించి వెంటపెట్టుకొని వస్తూ ఉన్న ఋశ్యశృంగుణ్ణీ శాంతా దేవినీ సందర్శించినారు. సంతోషపడ్డారు.

దశరథమహారాజు ఆ దంపతులను తన అంతఃపురములోకి తీసుకొనిపోయి శాస్త్రపద్ధతిన సమ్మానించినాడు. అంతఃపుర స్త్రీలు అందరూ ఆ పెద్ద పెద్ద కన్నుల శాంతా దేవిని చూచి ఆనందభరితలు అయినారు. ఆమెనూ ఆమె పెనిమిటినీ వారు ఎంతో ఆదరించినారు. గౌరవించినారు. పూజించినారు.

అందరికన్నా ఎక్కువగా ఆ దంపతులను దశరథమహారాజు సత్కరించినాడు. వారు వచ్చినందువల్ల తాను కృతకృత్యుడు అయినట్టే భావించుకొన్నాడు.

అంతఃపురమువారి సపర్యలను అనుభవిస్తూ శాంతా ఋశ్యశృంగులు కాలము గడపసాగినారు.

౧౨

మనోహరము అయిన వసంతకాలము వచ్చింది. యజ్ఞకర్మను ఇకను ఆరంభించవలెను అని దశరథమహారాజుకు బుద్ధిపుట్టింది.

ఋశ్యశృంగుడికి నమస్కారము చేసి "మహాత్మా, రఘువంశము పుత్రపౌత్ర పారంపర్యము వర్ధిల్లేటందుకు నా చేత యజ్ఞకర్మను ఆరంభము చేయించవలెను. తాము ఋత్విజులుగా ఉండి సాంగ్రహాణేష్టిని ఉపక్రమించవలెను" అని ప్రార్థించినాడు.

ఋశ్యశృంగుడు "అట్లాగేను. మీరు యజ్ఞోపకరణాలను అన్నిటినీ సమకూర్చుకొని ఉన్నట్లయితే గుర్రాన్ని వదలవచ్చును." అన్నాడు.

అంతట దశరథమహారాజు "పురోహితుడు వసిష్ఠమహర్షినీ వేదపారంగతులు అయిన వామదేవుణ్ణీ సుయజ్ఞుణ్ణీ జాబాలినీ కాశ్యపుణ్ణీ ఇంకా ఇతర బ్రాహ్మణోత్తములను అందరినీ ఆహ్వానించి తీసుకొనిరావలసింది." అని సుమంత్రుడితో చెప్పినాడు.

సుమంత్రుడు అప్పటికిఅప్పుడు పోయి ఆయాబ్రాహ్మణులను అందరినీ తీసుకొని వచ్చినాడు.

దశరథమహారాజు వారిని అందరినీ సత్కరించి "ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా, సంతానము కోసము అశ్వమేధయాగము చేయవలెను అనే బుద్ధిపుట్టింది అని మీకు నేను ఇదివరకే విన్నవించుకొన్నాను. మీరు అందరూ అందుకు నన్ను మెచ్చుకొన్నారు. ఇప్పుడు ఇక్కడికి ఋశ్యశృంగదంపతులున్నూ వచ్చి ఉన్నారు. మీ అందరి ప్రభావమువల్ల నా కోరికలు అన్నీ ఈడేరుతవి అనుకొంటున్నాను. ఇప్పుడు మీరు అందరూ యజ్ఞకార్యనిర్వహణానికి పూనుకోవలెను." అని చెప్పినాడు.

"బాగుంది—బాగుంది. సంతోషము"అని వసిష్ఠమహర్షీ తక్కినబ్రాహ్మణోత్తములూ అన్నారు. వారు అందరూ ఋశ్యశృంగుడితో ఆలోచించి దశరథమహారాజుతో "ఓరాజా, సంతానముకోసము తమకు ఇటువంటి ధార్మికము అయిన బుద్ధి పుట్టింది. తమకు తప్పకుండా నలుగురు పుత్రులు పుట్టుతారు" అన్నారు. వారి మాటలకు దశరథమహారాజు ఉప్పొంగిపోయినాడు.

"ఓ మంత్రిసత్తములారా, ఈ ఋత్విక్కులూ ఈ బ్రాహ్మణోత్తములూ చెప్పే యజ్ఞసంభారాలను అన్నిటినీ సమకూర్చవలెను. ఋత్విజులతోనూ సమర్థులు అయిన సైనికులతోనూ గుఱ్ఱాన్ని వదలవలెను." అన్నాడు దశరథమహారాజు.

రాజాజ్ఞను అనుసరించి ఆ మంత్రిపుంగవులు ఆయాపనులు నెరవేర్చుటకు మొదలు పెట్టినారు. బ్రాహ్మణులు అందరూ వారివారి పనులను చక్కబెట్టసాగినారు.

చైత్రపౌర్ణమినాడు సాంగ్రహణేష్టికర్మను ఆరంభించినారు. మరునాడు బ్రహ్మోదనమూ ఉత్తమాశ్వబంధప్రోక్షణ విమోచనమూ చేయించినారు.

ప్రతిరోజూ సావిత్రాది కర్మలు చేయ నారంభించినారు.

## ౧౩

ఒక సంవత్సరము అయిపోయింది. మళ్లీ వసంతకాలమువచ్చింది. దశరథమహారాజు యజ్ఞవాటానికి బయలు దేరినాడు.

యజ్ఞానుష్ఠానానికి పూర్వము దశరథమహారాజు వసిష్ఠమహర్షికి నమస్కారము చేసి "ఓ మహర్షీ, తాము పూజ్యులు. నా కులగురువులు. అంతే కాదు. తాము నాకు పరమాప్తులు. ఈయజ్ఞము యథాశాస్త్రముగానూ నిర్విఘ్నముగానూ కొనసాగించేటందుకు తాము ప్రత్యేకముగా పూనుకొనవలెను. ఈ కార్యనిర్వహణభారము అంతా తామే వహించవలెను." అని ప్రార్థించినాడు.

"రాజా, నీవు కోరినట్టు సర్వమూ నిర్వహిస్తాను." అని వసిష్ఠమహర్షి దశరథమహారాజుతో చెప్పి యజ్ఞకార్యనిర్వాహకులు అయిన బ్రాహ్మణవృద్ధులనూ వృద్ధులూ పరమధార్మికులూ అయిన యజ్ఞద్రవ్యసమీకరణాధికారులనూ అయాకర్మకారులనూ ఇటుకలు మొదలు అయినవి చేసే శిల్పకారులనూ యూపస్తంభాది యజ్ఞసాధనాలు చేసే వడ్రంగులనూ బావులూ నూతులూ మొదలు అయినవి తీసే తవ్వకము పనివాండ్లనూ శాస్త్రవిదులూ బహుశ్రుతులూ అయిన రాజపురుషులనూ చిత్రకారులనూ నృత్యముచేసే వారినీ నాటకాలు ఆడేవారినీ లెక్కలు వ్రాసేవారినీ సమావేశపరచి "ఓ కార్మికులారా, దశరథమహారాజు ఆజ్ఞాపించినాడు. యజ్ఞములో మీరు అందరూ మీ మీ పనులను చక్కగా వేరవేర్చవలెను. ముమ్మందుగా లక్షలకొద్దీ ఇటుకలను తీసుకొనివచ్చి ఆయా దేశాధీశులు యజ్ఞసమయములో నివసించడానికి మేడలవంటి అనువు అయిన సౌధాలను నిర్మించవలెను. వాతివర్షాదులకు చెక్కు చెదరకుండా ఉండే బ్రాహ్మణవిడుదులను వందలకొద్దీ వేయవలెను. ఆయావిడుదులలో వివిధ భక్ష్యాన్నపానాదివసతులను అమర్చవలెను. నాగరులు నివసించడానికి విశాలము అయిన విడుదులను వేసి వాటిలో వివిధ భక్ష్యాలనూ ఇంకా అవసరము అయిన అన్నిరకాల తినుబండారాలనూ ఉంచవలెను. అదేవిధముగా జానపదులకున్నూ నివాసాలను ఏర్పాటు చేయవలెను. అందరికీ అత్యంత ఆదరముతో అతిరుచ్యము అయిన అన్నము పెట్టవలెను. అత్యంతశ్రేష్ఠము అయిన బియ్యమే ఉపయోగించవలెను. ఎవరినీ అనాదరముతో చూడకూడదు. అన్ని కులాలవారినీ చక్కగా సత్కరించవలెను. వారివారి యోగ్యతలను పట్టి అందరినీ గౌరవించవలెను. కోపమువచ్చికానీ కామాసక్తివల్లకానీ స్వలాభము కోసముకానీ ఎవరినీ చుల్కన చేయకూడదు."

"ఈ యజ్ఞకార్యనిర్వాహకులు అయిన మీకు అందరికీ మృష్టాన్నభోజనము ఏర్పాటు చేయడము అయింది. ఇంకా మీకు ధనమున్నూ ఇవ్వడము అవుతుంది. మీమీ యోగ్యతలనుపట్టి మీకు రాజసమ్మానమున్నూ జరుగుతుంది.

కాబట్టి మీరు యావన్మందీ ఏ ఒక్క చిన్న పనినీ వదిలి పెట్టకుండా సమస్తమూ శ్రేమార్ద్ర హృదయాలతో చేయవలెను." అని ఉపదేశించినాడు.

ఆయా కర్మకారులు అందరూ వారివారి పనులను శ్రద్ధాసక్తులతో చేయడము మొదలు పెట్టినారు.

అంతట వసిష్ఠమహర్షి సుమంత్రుణ్ణి పిలిచి "మంత్రిసత్తమా, నీవు సమస్త దేశాధీశులనూ ఆయా దేశాల బ్రాహ్మణులనూ క్షత్రియులనూ వైశ్యులనూ శూద్రులనూ ఇంకా ఇతరులను అందరినీ ఈ యజ్ఞానికి ఆహ్వానించవలెను. అశేషజనమూ ఈ యజ్ఞము చూడడానికి వచ్చేట్లు నీవు ప్రోత్సహించవలెను.

"ఓ సుమంత్రుడా, మిథిలాధిపతి జనకమహారాజు మహాశూరుడు. సత్యసంధుడు. సర్వశాస్త్రవిదుడు. వేదాధ్యయన పరాయణుడు. ఆయన మన మహారాజుకు చిరకాలమిత్రుడు. ఆయనను నీవు స్వయముగా ఆహ్వానించవలెను. అదేవిధముగా కాశీరాజును నీవు స్వయముగా పిలువవలెను. ఆయన మంచి మాటకారి. మన మహారాజుకు ముఖ్యస్నేహితుడు. కేకయమహారాజు మన మహారాజుకు పిల్లను ఇచ్చిన మామగారు. పరమధార్మికుడు. వృద్ధు. ఆయననూ ఆయన కుమారుణ్ణీ నీవు స్వయముగా ఆహ్వానించవలెను. మన మహారాజుకు అంగదేశాధీశుడు రోమపాదుడు మరి ఒక ముఖ్యమిత్రుడు. పయిగా ఆయన ఋశ్యశృంగుడి మామగారు. నీవు ఆయనను చక్కగా సత్కరించి ఆహ్వానించి వెంటపెట్టుకొని రావలెను."

"ఈ చెప్పినవారినే కాకుండా తూర్పుతీరపు రాజులనూ సింధుసౌవీరసౌరాష్ట్రాధిపతులనూ దాక్షిణాత్య ప్రభువులనూ ఇంకా మిగతా రాజులనూ వారివారి పరివారబంధుమిత్ర పుత్రకళత్రయుతముగా ఆహ్వానించి వారు అందరూ ఈ యజ్ఞానికి వచ్చేట్లు నీవు చేయవలెను" అని చెప్పినాడు.

అంతట సుమంత్రుడు వసిష్ఠమహర్షి అనుజ్ఞతో ఆయా రాజులను అందరినీ ఆహ్వానించడానికి సుగుణ సంపన్నులను పంపించి స్వయముగా ఆహ్వానించవలసినవారికోసము తాను ప్రయాణము అయి పోయినాడు.

అచిరకాలములో ఆయా కర్మకారులు వారివారి పనులను చక్కగా నెరవేర్చినారు. వారు అందరూ వసిష్ఠమహర్షిదగ్గరకు పోయి "ఓమహర్షీ, తాము చెప్పినపనులను అన్నిటినీ ఏ ఒక్క చిన్నలోపమూ లేకుండా పూర్తిచేసినాము. తాము వచ్చి పరిశీలించవలెను" అని విన్నవించినారు.

ఆయా కర్మకారులు నిర్మించిన యజ్ఞవాటికను వసిష్ఠ మహర్షి పరిశీలించినాడు. వారి కౌశలాన్ని మెచ్చుకొన్నాడు. రాజపురుషులనుచూచి "మీరు

ఇక్కడికివచ్చేవారిని అందరినీ చక్కగా సత్కరించవలెను. ఎవరు ఏది అడిగినా అత్యంతాదరముతోనూ శ్రద్ధతోనూ అందచేయవలెను. అనాదరముతోనూ అశ్రద్ధతోనూ చేసే దానము దాతకు అపకారముచేస్తుంది. కాబట్టి మీరు మీమీ పనులను శ్రద్ధాసక్తులతో చక్క పెట్టవలెను" అని చెప్పినాడు.

కొన్ని అహోరాత్రములు గడిచిపోయినవి. ఆయా దేశాధీపులు అందరూ దశరథ మహారాజుకు రత్నాలు మొదలు అయిన కానుకలు తీసుకొని అయోధ్యానగరానికి వచ్చినారు.

వసిష్ఠమహర్షి దశరథమహారాజును చూచి పరమానందముతో "రాజా! వివిధదేశాధిపులూ యజ్ఞము చూడవచ్చినారు. ఆయా రాజుల అర్హతలనుపట్టి వారివారిని అందరినీ నేను సత్కరించినాను. యజ్ఞనిర్వాహకులు అయిన రాజపురుషులు మహోత్సాహముతో వారివారి పనులను నిర్వర్తించినారు. యజ్ఞశాల మనోవేగముతో నిర్మాణము అయిపోయింది. అది దర్శనీయముగానూ సర్వసమృద్ధముగానూ ఉంది. నీవు ఇక యజ్ఞశాలకు బయలుదేరవలెను" అన్నాడు.

ఋశ్యశృంగుడూ వసిష్ఠమహర్షీ నిర్ణయించిన శుభదినాన శుభనక్షత్రాన దశరథ మహారాజు యజ్ఞశాల ప్రవేశించినాడు.

వసిష్ఠమహర్షి మొదలుఅయిన బ్రాహ్మణులు ఋశ్యశృంగుడి అధ్వర్యాన యథాశాస్త్రముగా యథాక్రమముగా యజ్ఞకర్మను ఆరంభించినారు.

## ౧౪

ఒక సంవత్సరము అయిపోతూ ఉండగా దేశము మీద విడిచిపెట్టిన గుర్రము తిరిగి వచ్చింది.

వేదవిదులుఅయిన బ్రాహ్మణులు ఋశ్యశృంగుణ్ణి పెద్దగాచేసి సరయూనదీ ఉత్తరతీరాన. దశరథమహారాజు యజ్ఞవాటికలో అశ్వమేధానికి సంబంధించిన ఆయా కర్మలు అన్నిటినీ చేయించ నారంభించినారు. వేదాలలో చెప్పినట్టుగానూ శాస్త్రీయముగానూ కల్పసూత్ర విహితముగానూ మీమాంసాన్యాయాన్ని వ్యతిక్రమించకుండానూ సమస్తకర్మలూ చేయసాగినారు. ప్రవర్గ్యమూ ఉపసదియూ మొదలుఅయిన కర్మలు అన్నీ ఏ లోపమూ లేకుండా చేసి వేసినారు. అంతట బ్రాహ్మణోత్తములు అందరూ సంతోషముతో ఆయాకర్మాధిదేవతలను ఆరాధించి ప్రాతస్సవనమూ మొదలుఅయిన కర్మలను అన్నిటినీ యథావిధిగా పూర్తిచేసినారు. ఇంద్రదేవతాకము అయిన హవిర్భాగాన్నీ యథాశాస్త్రముగా ఇచ్చివేసినారు. పూజ్యముఅయిన సోమలతను స్తోత్రము చేసినారు. యథాక్రమ

ముగా మాధ్యందినసవనము జరిగిపోయింది. అదేవిధముగా శాస్త్రీయముగా తృతీయసవనమున్నూ సాగిపోయింది. హోమము చేయడములో చెయ్యిజారి తప్పిపోయిందికానీ చేయవలసింది లోపించిపోయిందీకానీ ఏదీలేదు. సమస్తమూ సమంత్రకముగా సమాప్తము అయింది. అంతా సంతోషముగా సుఖముగా జరిగిపోయింది.

అపండితుడు అయిన బ్రాహ్మణుడు ఒక్కడున్నూ ఆ యజ్ఞశాలలో ఎక్కడనూ కనిపించలేదు. అందరూ వేదాధ్యయనము చేసినవారే. శిక్షా వ్యాకరణచ్ఛందోనిరుక్తజ్యోతిషకల్పాలు అనే వేదాంగాలను ఆరింటినీ అందరూ కరతలామలకము చేసుకొన్నవారే. అందరూ బ్రహ్మచర్యాది వ్రతానుష్ఠానపరులే. అందరూ వాదకుశలురే. వారు అందరూ ఆయా కర్మకలాపాల మధ్య విరామ సమయాలలో పరస్పర విజిగీషతో అనేక విషయాలను గురించి హేతువాదాలు చేస్తూ ఉండేవారు.

ఇటువంటి బ్రాహ్మణులేకాకుండా కనీసము ఒక వందమంది పరివారము అయినా లేని రాజున్నూ ఆయజ్ఞశాలలో కనిపించలేదు.

ఆయజ్ఞము జరిగిన అన్నిరోజులలోనూ ఆకలిగొన్నవాడుకానీ దప్పిక గొన్నవాడుకానీ ఒక్కడున్నూ కనిపించలేదు. ఆయజ్ఞవాటికలో ప్రతిరోజూ బ్రాహ్మణులూ క్షత్రియులూ వైశ్యులూ శూద్రులూ తాపసులూ శ్రమణులూ (దిగంబర సన్యాసులూ) భోజనము చేసినారు. అన్నికులాల స్త్రీలకూ పిల్లలకూ వృద్ధులకూ ప్రత్యేకముగా భోజనము పెట్టినారు. అదేవిధముగా జబ్బుపడిపోయినవారికి పథ్యపానాదులు ఏర్పాటు చేసినారు.

పాకశాస్త్రనిపుణులు శాస్త్రీయముగా వంటచేసేవారు. ప్రతిరోజూ ఎప్పటికి అప్పుడు అక్కడ కొండలుఅంతలేసి అన్నపురాసులూ భక్ష్యపురాసులూ సిద్ధము అవుతూఉండేవి. చక్కగా అలంకారము చేసుకొన్నవారు అన్నము మొదలుఅయిన పదార్థాలను వడ్డనచేసేవారు. ఆవడ్డనచేసేవారికి మణికుండలాలు ధరించిన తేజోవంతులు ఆయాపక్వపదార్థాలను అందించేవారు. దేశదేశాలనుంచీ వచ్చిన స్త్రీలూ పురుషులూ అందరూ ఆపాకపురుచి అపూర్వముగా ఉంది అని మెచ్చుకున్నారు. ఆఅన్నదానానికి అందరూ అబ్బురపడిపోయినారు.

ఆవిధముగా అంతమందికి అంతచక్కగా అన్నదానము చేస్తూఉన్నప్పటికిన్నీ ఎక్కడ ఎవరికి విలోపము జరుగుతుందోనని దశరథమహారాజు ఎప్పుడూ ఏమరుపాటులేకుండా వారివారిని హెచ్చరిస్తూ ఉండేవాడు. "అందరికీ

అన్నము పెట్టవలసింది. వారివారి యోగ్యతలనుపట్టి అందరికీ నూత్నవస్త్రాలు ఇవ్వవలసింది" అనేకేకలు ఆయజ్ఞశాలలో ఎప్పుడూ వినిపిస్తూఉండేవి. అందరినీ ఆదరించి అన్నము పెట్టి నూత్నవస్త్రాలు కట్టబెట్టినారు. దేశదేశాలస్త్రీలూ పురుషులూ తనివితీర ఆయజ్ఞశాలలో భోజనము చేసినారు. అందరూ దశరథమహారాజును చూచి "ఓరాజా, పాకము మహారుచ్యము గాఉంది. ఎంతో ఆదరముతో అన్నము పెట్టినారు. మేము తృప్తిగా భోజనము చేసినాము. రాజా, నీకు శుభము అవుతుంది." అని ప్రశంసించినారు.

యజ్ఞకోవిదులు పని తెలిసిన వర్ధంకులచేత శాస్త్రములో చెప్పినట్లుగా ఎనిమిది అంచులు తేలేటటు యూపస్తంభాలను చక్కగా నున్నగా చెక్కించినారు. వాటిలో ఆరింటిని మారేడుమానుతోనూ ఇంకొక ఆరింటిని చండ్రమానుతోనూ మరిఒక ఆరింటిని మోదుగుమానుతోనూ ఒకదానిని విరిగి చేవకర్రతోనూ మిగతా రెంటినీ దేవదారుమానుతోనూ పిడికిలితి ఇరవైఒక్క మూరలు ఉండేట్లుగా చేయించినారు. బారెడుబారెడు దూరాన వాటిని పాతిపెట్టించినారు. శోభాయమానముగా కనిపించడానికి బంగారుసొమ్ములతో వాటిని అలంకరించినారు. గుడ్డలుకట్టి మంచిగంధము పూసినారు. ఆకాశములో సప్తర్షుల మాదిరిగా ఆ యజ్ఞశాలలో ఆ యూపస్తంభాలు మెరిసిపోయినవి.

శాస్త్రములో చెప్పిన కొలతల ప్రకారము బ్రాహ్మణులు ఇటుకరాళ్ళను తీయించినారు. నూలుతాడు పట్టి కట్టుబడిపనిచేసే బ్రాహ్మణులు ఆ ఇటుకరాళ్ళతో అగ్నివేదిని గరుడపక్షి రూపాన నిర్మించినారు. ఆయా దేవతలను ఉద్దేశించి శాస్త్రములో చెప్పినట్టుగా పశువులనూ పాములనూ పక్షులనూ ఇంకా ఆయాజలచరాలనూ మొత్తము మున్నూరు జంతువులనూ దశరథమహారాజు ఉత్తమాశ్వాన్ని ఆ యూపస్తంభాలకు కట్టివేసినారు.

అప్పుడు దశరథమహారాజు పట్టపురాణి కౌసల్యాదేవీ సుమిత్రా కైకేయీలూ వచ్చి ఆ గుర్రానికి ప్రదక్షిణము చేసినారు. వారు ముగ్గురున్నూ మూడు బంగారుకత్తులతో ఆ గుర్రానికి వాట్లు పెట్టినారు. అది పడిపోయింది. ఆ పడిపోయిన గుర్రముదగ్గిర కౌసల్యాదేవి మనోదార్ఢ్యముతో ధర్మసిద్ధికోసము ఆ రాత్రి అంతా గడిపింది.

అంతట దశరథమహారాజు హోతకు పట్టమహిషినీ అధ్వర్యువుకు పరివృత్తినీ ఉద్గాతకు వావాతనూ బ్రహ్మకు పాలాకలినీ దక్షిణగా ఇచ్చినాడు. ఆ నల్గురు ఋత్విజులున్నూ ఆనలుగురు స్త్రీలకు ఏర్పాటుచేసిన ఓలినిప్రతినిధి దానముగా పుచ్చుకొని వారిని నల్గురినీ తిరిగీ దశరథమహారాజుకు ఇచ్చివేసినారు.

అధ్వర్యువు ప్రయోగచతురుడు. ఆయన ఏకాగ్రచిత్తముతో అశ్వము మెదడుతీసి శాస్త్రీయముగా పక్వము చేసినాడు. ఆవపను హోమము చేసే సమయములో వచ్చినధూపాన్ని పాపపరిహారార్థము దశరథమహారాజు ఆఘ్రాణించినాడు. మంత్రవేత్తలుఅయిన పదహారుగురు ఋత్విజులున్నూ అప్పుడు అశ్వము అవయవాలను అన్నిటినీ యథాశాస్త్రముగా హోమము చేసినారు.

అన్ని యజ్ఞాలలోనూ హవిస్సును జువ్వికట్టెలలో పాకము చేస్తారు. అశ్వమేధములో అట్లా కాదు. ప్రబ్బలితీగెలలో హోమము చేస్తారు. అదేవిధముగా దశరథమహారాజు చేస్తున్న అశ్వమేధములో చేసినారు. కల్పసూత్రాలలోనూ బ్రాహ్మణాలలోనూ అశ్వమేధము మూడుదినాల యజ్ఞము అని చెప్పి ఉంది. మొదటిదినము చతుష్టోమము అనీ రెండవదినము ఉక్థ్యము అనీ మూడవదినము అతిరాత్రముఅనీ అంటారు. ఆమూడురోజులలో చేయవలసిన క్రతువులేకాకుండా శాస్త్రాంతరాలలో చెప్పిన క్రతువులనుకూడా తలపెట్టి ఒక జ్యోతిష్టోమము ఒక ఆయుర్యాగమూ రెండు అతిరాత్రములూ ఒక అభిజిద్యాగమూ ఒక విశ్వజిద్యాగము ఒక అప్తోర్యామమూ చేసినారు.

అశ్వమేధకర్మలు అన్నీ అయిపోయినవి. అంతట దశరథమహారాజు క్రతుఫలము తనకు పూర్తిగా లభించేటందుకు పూర్వము అశ్వమేధము చేసిన బ్రహ్మదేవుడు మాదిరిగా భూదానము చేయ సంకల్పించుకున్నాడు. తన రాజ్యములో తూర్పుభాగాన్ని అంతా హోతకున్నూ పడమటిభాగాన్ని అంతా అధ్వర్యువుకున్నూ దక్షిణభాగాన్ని అంతా బ్రహ్మకున్నూ ఉత్తరభాగాన్నీ అంతా ఉద్గాతకున్నూ దానము ఇచ్చినాడు. యథావిధిగా యజ్ఞము సమాప్తము చేసినాడు. అంతట ఋత్విజులు అందరూ నిష్కళంకుడుగా ఉన్న దశరథమహారాజును చూచి "ఓరాజా, ఈరాజ్యాన్ని అంతా మీరే పరిపాలించవలెను. ఈ సామర్థ్యము మీకుఒక్కరికే ఉంది. మాకు రాజ్యపాలనాసామర్థ్యము ఏమాత్రము లేదు. మేము ఎప్పుడూ వేదాధ్యయనముచేసుకొంటూ ఉంటాము. అందువల్ల మాకు మీరాజ్యముతో ప్రయోజనము ఏమీ లేదు. మీరాజ్యానికి బదులు ఏకొంచెము మూల్యము మాకు ఇచ్చినా మేము సంతోషిస్తాము. మణులుకానీ బంగారముకానీ లేకపోతే మీకు తోచేది ఏమిఅయినాకానీ మాకు ఇవ్వవలసింది. మీ రాజ్యము మాకు అక్కరలేదు" అన్నారు.

దశరథమహారాజు అప్పుడు ఆ వేదపారంగతులకు పదిలక్షల ఆవులనూ నూరుకోట్ల బంగారాన్నీ దానికి నాల్గుఅంతలు వెండినీ దానము ఇచ్చినాడు. వారు ఆధనాన్ని అంతా ఋశ్యశృంగుడికీ వసిష్ఠమహర్షికీ ఒప్పచెప్పి తమతమ

అర్హతలకు తగినట్టు పంచిపెట్టవలసింది అని కోరినారు. వారు ఉభయులున్నూ ఆ ధనాన్ని వారికి న్యాయముగా పంచిపెట్టినారు.

ఋత్విజులకే కాకుండా ఆ యజ్ఞానికివచ్చిన అతిథులూ అభ్యాగతులూ మొదలు అయినవారికి అందరికిన్నీ దశరథమహారాజు జంబూనదిలో పుట్టిన బంగారాన్ని ఒకకోటి దానముచేసినాడు. అందరికీ అన్నీ దానముచేసిన వేసిన తరువాత ఏమీ ముట్టని ఒక పేద బ్రాహ్మణుడు వచ్చి చెయ్యిచాచినాడు. అప్పుడు దశరథమహారాజు దగ్గర ఏమీలేకపోయింది. తన ముంజేతి మురుగులు తీసి దానముగా ఇచ్చివేసినాడు. ఆయన ద్విజవత్సలుడు. బ్రాహ్మణులను అందరినీ సంతృప్తిపరచినాడు. ఆనందపరవశుడు అయినాడు. ఆ బ్రాహ్మణో త్తములకు అందరికీ సాష్టాంగ నమస్కారము చేసినాడు. వారుఅందరూ అమిత శ్రద్ధాసక్తులతో ఆయనను వేదోక్తముగా ఆశీర్వదించినారు.

ఏ రాజున్నూ సులభముగా చేయలేని అశ్వమేధయాగాన్ని దశరథమహారాజు ఏ లోపమూ లేకుండా యథావిధిగా సమాప్తముచేసినాడు. సంతుష్టుడు అయినాడు. ఆయన అంతట ఋశ్యశృంగ మహర్షినిచూచి "ఓసువ్రతా, తాము నాచేత పాపపరిహార్థము నిర్విఘ్నముగా అశ్వమేధము చేయించినారు. ఇకను వంశాభివృద్ధికోసము నాచేతను ఏదిఅయినా ఒక కర్మను చేయించకోరు తున్నాను. అటువంటి కర్మను చేయించడానికి తాము ఒక్కరే సమర్థులు." అన్నాడు.

"ఓ రాజా, సంతానముకోసము ఇప్పుడేమీ చేత మరిఒకకర్మచేయిస్తాను. మీకు నల్గురుపుత్రులు పుట్టుతారు. ఆ నల్గురున్నూ వంశోద్ధారకులు అవుతారు" అన్నాడు ఋశ్యశృంగుడు.

## ౧౫

ఋశ్యశృంగుడు మహామేధాసంపన్నుడు. పుత్రోత్పత్తికి ఏ యజ్ఞము చేయించడమా అని క్షణకాలము ఆలోచించినాడు. చప్పున స్ఫురించింది. దశరథమహారాజును చూచి "ఓ రాజా, మీకు పుత్రులు పుట్టడానికి అథర్వ శిరస్సులో చెప్పిఉన్న మంత్రాలతో ఒక ఇష్టిని చేయబోతున్నాను" అన్నాడు.

పుత్రకామేష్టి (యాగము) ఆరంభించి వేదమంత్రాలతో హోమము చేయడము మొదలు పెట్టినాడు.

అప్పుడు అక్కడికి వారివారి హవిర్భాగాలను తీసుకొని పోవడానికి దేవతలూ మహర్షులూ సిద్ధులూ వచ్చినారు. వారికన్నా ముందుగా అక్కడికి

బ్రహ్మదేవుడు వచ్చి కూర్చున్నాడు. దేవతలు మొదలు అయినవారు అందరూ బ్రహ్మదేవుణ్ణి చూచి "ఓ లోకకర్తా, ఈ భూలోకములో రావణుడు అనే రాక్షసుడు తమ అనుగ్రహమువల్ల అమితపరాక్రమ వంతుడు అయిపోయినాడు. మమ్మలను మహాబాధలు పెట్టుతూ ఉన్నాడు. వాణ్ణి మేము శాసించలేకుండా ఉన్నాము. ప్రేమాతిశయముతో తాము వాడికి ఇదివరలో ఎన్నోవరాలు ఇచ్చినారు. అందువల్ల వాడు పెట్టేబాధలు అన్నీ మేము భరించవలసివచ్చింది. వాణ్ణి మేము గౌరవించవలసివచ్చింది. ఆ దుర్మతి ముల్లోకాలనూ తలడిల్ల చేస్తూ ఉన్నాడు. లోకపాలకులను అందరినీ తిరస్కరిస్తూ ఉన్నాడు. దేవేంద్రుణ్ణి పరాభవించ తలపెట్టినాడు. వాడు మదించిపోయినాడు. వాణ్ణి ఎదిరించడానికి మాకు శక్యముకాకుండా ఉంది. వాడు ఒళ్లు తెలియక ఋషులనూ గంధర్వులనూ యక్షులనూ బ్రాహ్మణులనూ అవమానిస్తూ ఉన్నాడు.

ఆ రావణాసురుడికి సూర్యుడు భయపడిపోయి ఎండకాయడము లేదు. గాలి వీచడము లేదు. వాణ్ణిచూచి సముద్రములో అలలు ఆగిపోతూ ఉన్నవి. వాడు మహాభయంకరుడు అయినాడు. వాణ్ణి సంహారము చేసే ఉపాయము ఏది అయినా మీరు మాకు చెప్పవలెను." అని మొర పెట్టుకొన్నారు.

బ్రహ్మదేవుడు వారి మొర ఆలకించి "ఓ దేవతలారా, ఆ దురాత్ముణ్ణి సంహారము చేసే ఉపాయము నాకు ఇప్పుడు తోచింది. దేవదానవ రాక్షసుల చేతకానీ యక్ష గరుడ గంధర్వుల చేతకానీ తనకు చావురాకూడదు అని వాడు నన్ను వరము అడిగినాడు. నేను 'అట్లాగేను' అన్నాను. మానవుల చేత తనకు చావు రాకూడదు అనే వరము వాడు నన్ను అడగలేదు. బహుశః వాడు మానవులను లెక్క చేసి ఉండడు. అందువల్ల మానవుడు ఎవడు అయినా వాణ్ణి చంపివేయవచ్చును. అంతకన్నా మరి ఒకవిధముగా వాడికి చావురాదు" అన్నాడు.

బ్రహ్మదేవుడు చెప్పిన ఈ రహస్యానికి దేవతలూ మహర్షులూ సంతోషించినారు.

ఆ సమయములో పీతాంబరాలతో ధగధగలాడుతూ శంఖమూ చక్రమూ గదా పట్టుకొని మహావిష్ణువు అక్కడికి వచ్చినాడు. బ్రహ్మదేవుని సరసను కూర్చున్నాడు. దేవతలు మొదలుఅయినవారు అందరూ చేతులు జోడించి "ఓ మహావిష్ణూ, లోకహితముకోసము తాము ఒకపని చేయవలెను. రావణుడు అనే రాక్షసుడు లోకభీకరుడు అయిపోయినాడు. మేము ఎవరమూ వాణ్ణి ఎదిరించలేకుండా ఉన్నాము. బ్రహ్మదేవుడు ఇచ్చిన వరాలవల్ల వాడు పొగ

రెక్కిపోయినాడు. గర్వాంధుడు అయినాడు. మహాభయంకరుడున్నూ అయినాడు. దేవేంద్రుణ్ణి ద్వేషిస్తున్నాడు. తాపసోత్తములకు కంటకుడు అయినాడు. మునులనూ ఋషులనూ నానాబాధలూ పెట్టుతూఉన్నాడు. నందనోద్యాన వనములో గంధర్వులతో క్రీడించే అప్సరసలను హింసిస్తూఉన్నాడు. ఎక్కడెక్కడి స్త్రీలను ఎత్తుకొనిపోతూఉన్నాడు. ముల్లోకాలవారినీ ఏడిపిస్తూఉన్నాడు. అందరికీ భయావహుడు అయిపోయినాడు. ఆ రావణాసురుణ్ణీ వాడి సైన్యాలనూ వాడి బంధువులనూ తాము నాశనముచేసి ఓ స్వామీ, మా బాధలను తీర్చవలెను. ఓ పరంతపా, మేము అందరమూ మీ శరణుచొచ్చినాము. మీకన్నా మాకు వేరే దిక్కులేదు. మీరు మమ్ములను రక్షించవలెను." అని ప్రార్థించినారు.

మహావిష్ణువుకు సమస్తమూ తెలిసినప్పటికిన్నీ రావణవధోపాయము చెప్పమని మధురవాక్కులతో దేవతలను ప్రశ్నించినాడు. అంతట దేవతలు అందరూ "ఓ శత్రుసంహారకా, రావణసంహారము చేయడానికి తాము మానవజన్మము ఎత్తవలెను. ఆ రావణాసురుడు పూర్వము చాలాకాలము తీవ్రము అయిన తపస్సుచేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించినాడు. ఈ ప్రపంచములో నానావిధప్రాణులవలనూ తనకు చావు రాకుండా ఉండేట్టు వరము అడిగినాడు. బ్రహ్మదేవుడు వాడికి ఆ వరము ఇచ్చినాడు. మానవులు అంటే వాడికి లెక్కలేకనో ఏమో మానవులనుంచి తనకు చావు రాకూడదు అనే వరము వాడు బ్రహ్మదేవుణ్ణి అడగనూలేదు. బ్రహ్మదేవుడు వాడికి అటువంటి వరము ఇవ్వనూలేదు. కాబట్టి ఆ రావణాసురుణ్ణి సంహారము చేయడానికి మానవులకు తప్ప మరి ఒకరికి సాధ్యముకాదు" అన్నారు.

మహావిష్ణువు ఈ లోకములో ఎవరి ఇంట జన్మము ఎత్తడమూ అని ఆలోచించసాగినాడు. దేవతలు అందరూ ఆయన ఆలోచనను గమనించి "ఇప్పుడు ఇక్కడ యజ్ఞముచేస్తూఉన్న ఈ అయోధ్యాధిపతి దశరథమహారాజు ధర్మజ్ఞుడు. వదాన్యుడు. మహర్షి సమతేజోవంతుడు. ఈయనకు ముగ్గురు భార్యలు. వారు దక్షప్రజాపతి కూతుళ్లు హ్రీ-శ్రీ-కీర్తి వంటివారు. తాము నాలుగు భాగాలుగా మారిపోయి ఆ ముగ్గురు ఇల్లాండ్ల కడుపులలోను పుట్టగోరుతున్నాము" అన్నారు.

మహావిష్ణువు దేవతల కోరికను అంగీకరించినాడు. దశరథ మహారాజును తండ్రిగా వరించినాడు.

"ఓ దేవతలారా, మీరు భయపడవద్దు. మీకు మేలుచేస్తాను. మీరు హాయిగా ఉండడానికి నేను మానవజన్మము ఎత్తి ఆ రావణా

సుగున్ని పుత్రమిత్రజ్ఞాతిబాంధవసహితముగా యుద్ధములో సంహారము చేసి వేస్తాను. మానవుణ్ణిగా బహుకాలము ఈ భూమిని ఏలుతాను." అంటూ మహా విష్ణువు అంతర్ధానము అయినాడు.

అప్పుడు ఏకాదశరుద్రులూ దేవతలూ అప్సరసలూ మహావిష్ణువును స్తోత్రము చేసినారు.

## ౧౬

దశరథ మహారాజు చేస్తూ ఉన్న పుత్రకామేష్టి పూర్తి అవుతూ ఉంది. అప్పుడు హోమ గుండములోనుంచి కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతులతో ఒకభూతము బయలుదేరింది. అది పురుషాకారముగా తోచింది. ప్రియభార్యను కౌగలించుకొన్నట్టుగా ధగధగ లాడుతూ ఉన్న బంగారు గుండిగను ఆ పురుషుడు తన రెండు చేతులా కౌగలించి పట్టుకొని ఆ అగ్ని వేదిలో నుంచి బయటకి వచ్చినాడు. ఆ బంగారు గుండిగమీద వెండి పళ్ళెము మూతపెట్టి ఉంది.

ఆ పురుషుడు అమితపరాక్రమవంతుడుగానూ మహాబలశాలిగానూ గోచరించినాడు. ముఖము ఎర్రగా ఉంది. ఎరుపూనలుపూ కలిసిన బట్టకట్టుకొని ఉన్నాడు. ఒంటినిండా వెంట్రుకలూ పెద్దపెద్ద మీసాలూ సింహముజూలు మాదిరిగా తలనిండా వెంట్రుకలూ నిగనిగలాడుతూ ఉన్నవి. దివ్యాభరణాలతో సర్వశుభలక్షణసంపన్నము అయిన రూపముతో కొండ అంత ఎత్తున పొడగట్టి మిట్టమధ్యాహ్న సూర్యుడి మాదిరిగానూ భగభగ మండే అగ్నిహోత్ర జ్వాల మాదిరిగానూ తేజరిల్లుతూ పొగరెక్కిన పెద్దపులి మాదిరిగా అడుగులు వేస్తూ దశరథ మహారాజు ఎట్ట ఎదట నిలుచుని దుందుభిస్వనముతో "నేను ప్రాజాపత్య పురుషుడను. నీ కోసము ఇక్కడికి వచ్చినాను." అన్నాడు.

తత్‌క్షణమే దశరథ మహారాజు లేచి ఆ పురుషుడికి నమస్కారము చేసి "స్వామీ, తమకు స్వాగతము. ఇప్పుడు నేను ఏమి చేయవలెనో తామే సెలవు ఈయవలెను" అన్నాడు.

"ఓ రాజా, నీయజ్ఞాలను దేవతలు మెచ్చుకొన్నారు. ఇదిగో ఈపాత్రలో పాయసము ఉంది. దీనిని దేవతలు పాకము చేసినారు. ఈ దివ్యపాయసము ప్రజాకరమూ ధన్యమూ ఆరోగ్యవర్ధనము. ఈ పాయస పాత్రను నీవుతీసుకొని ఇందులో ఉన్న పాయసాన్ని నీకులకాంతలకు ఇవ్వవలెను. వారికి పుత్రులు పుట్టుతారు" అన్నాడు, ప్రాజాపత్య పురుషుడు.

దశరథ మహారాజు తల ఒగ్గి ఆ పాయస పాత్రను ఆ దివ్య పురుషుడి దగ్గరనుంచి అందుకొన్నాడు. పెన్నిధి దొరికిన పేదవాడికి మల్లే సంతోష పడ్డాడు. ఆ మహాద్భుత పురుషుడికి ప్రదక్షిణము చేసి సాష్టాంగ నమస్కారము చేసినాడు. అప్పుడు ఆ ప్రాజాపత్యపురుషుడు అంతర్ధానము అయిపోయినాడు.

ఆ దివ్య పాయసపాత్రను తీసుకొని దశరథమహారాజు అంతఃపురాంగనలు ఉన్న ప్రదేశానికి పోయినాడు. ఆయన సంతోషకాంతులకు ఆ ప్రదేశము అంతా శరత్కాల పున్నమినాటి రాత్రి మాదిరిగా శోభించింది.

దశరథ మహారాజు కౌసల్యా దేవిని చూచి "ఇదుగో దివ్యపాయసము. దేవతలు నన్ను మెచ్చుకొని దీనిని పంపించారు. ఈ పాయసము నీవు పుచ్చుకోవలెను" అంటూ ఆ పాత్రలో ఉన్న పాయసములో సగభాగము ఆమెకు ఇచ్చినాడు. మిగతా సగము పాయసములో సగభాగము సుమిత్రాదేవికి ఇచ్చినాడు. ఇంకా మిగిలి ఉన్న పాయసములో సగభాగము కైకేయీ దేవికి ఇచ్చినాడు. ఆ పాత్రలో ఇంకా మిగిలి ఉన్న ఎనిమిదో వంతు పాయసాన్ని ఆలోచించి సుమిత్రాదేవికి ఇచ్చినాడు.

ముగ్గురున్నూ ఆదివ్యపాయసాన్ని సంతోషముగా ఆరగించినారు.

ఆకులకాంతలు ముగ్గురున్నూ గర్భవతులు అయినారు. బాలసూర్యుడివంటి కాంతులతోనూ అగ్ని హోత్రుడివంటి తేజస్సుతోనూ వారు ముగ్గురూ మెరసి పోయినారు.

అంతట దశరథ మహారాజు స్వస్థచిత్తుడు అయినాడు. దేవలోకములో దేవేంద్రుడి మాదిరిగా తేజరిల్లినాడు.

౧౭

మహావిష్ణువు అంతర్ధానము అయిపోగానే బ్రహ్మదేవుడు దేవతలను అందరినీ చూచి "ఓ దేవతలారా, మనకు అందరికీ మేలు చేయడానికి మహావిష్ణువు భూలోకములో పుట్టబోతున్నాడు. అందువల్ల ఆయనకు యుద్ధములో సాయపడడానికి కామరూపులూ బలవంతులూ అయినవారని మనము ఇప్పుడు సృష్టించవలెను. అప్సరః స్త్రీలూ గంధర్వాంగనలూ వానరరూప పుత్రులను కనేట్టు చేయవలెను. ఆ పుట్టే వానరులు మాయావిదులూ మహాశూరులూ వాయువేగసమానులూ నీతిమంతులూ బుద్ధిమంతులూ ఉపాయమంతులూ సుగుణసంపన్నులూ అజయ్యులూ అమృతపానము చేసిన వారి మాదిరిగా మృతిలేని వారూ

కావలెను. సింహాలవంటి శరీరాలతోనూ విష్ణుమూర్తితో సరిసమానము అయిన పరాక్రమముతోనూ ఆ వానరులు అందరూ భూలోకములో సంచరించవలెను.

"మీరు అందరూ అటువంటి వానరులను ఇప్పుడే సృష్టించవలెను. ఇంతకు ముందే నేను జాంబవంతుడు అనే ఎలుగుబంటిని సృష్టించినాను. నేను సంకల్పించి ఆవలించినాను. నా నోటిలో నుంచి వాడు తటాలున పుట్టుకొని వచ్చినాడు. వాడు మహా బలవంతుడు." అన్నాడు.

బ్రహ్మదేవుడు చెప్పిన ఈ విషయాన్ని దేవతలు అందరూ శ్రద్ధతో ఆలకించినారు. దేవతలూ మహర్షులూ సిద్ధులూ విద్యాధరులూ ఉరగులూ చారణులూ ఈ భూలోకములో వానర రూపపుత్రులను పుట్టించడానికి పూనుకొన్నారు.

దేవేంద్రుడికి వాలి అనే వానరుడు పుట్టినాడు. వాడు మహాబలాఢ్యుడు. మహేంద్ర పర్వతముతో సరిసమానము అయిన వాడు.

ఈ జగత్తునంతా తాపము ఎత్తించే సూర్యుడికి సుగ్రీవుడు పుట్టినాడు. బృహస్పతికి తారుడు అనే వానరుడు పుటినాడు. ఆ తారుడు మహాబుద్ధిమంతుడు. వాడి అంతటి ఉత్తముడు వానరులలో మరి ఒకడు లేడు. కుబేరుడికి గంధమాదనుడున్నూ విశ్వకర్మకు నలుడున్నూ అగ్నిహోత్రుడికి నీలుడున్నూ అశ్వినీ దేవతలకు మైందద్వివిదులున్నూ వరుణుడికి సుషేణుడున్నూ పర్జన్యుడికి శరభుడున్నూ వానర రూపపుత్రులుగా పుట్టినారు.

వాయుదేవుడికి హనుమంతుడు అనే వానరుడు పుట్టినాడు. వాడు అతికాంతిమంతుడు. అమిత వీర్యవంతుడు. వాడి దేహము వజ్రము మాదిరిగా అభేద్యము. వాడు గరుత్మంతుడి అంతటి వేగవంతుడు. బలవంతుడు.

వీరే కాకుండా ఇంకా అనేక వేలమంది వానరులు అప్పటికి అప్పుడు ఈ భూలోకములో పుట్టుకొని వచ్చినారు. దేవతలూ ఋషులూ మొదలు అయిన వారు అందరూ ఎలుగుబంట్ల రూపాలతో కొందరూ కొండముచ్చు రూపాలతో కొందరూ ఆవులోకలు అంతలోకలతో కొందరూ అవతరించినారు.

వారు అందరూ అప్రమేయబలులు. వీరులు. విక్రాంతులు. మేరుమందర పర్వతసమానులు. దృఢశరీరులు. కామరూపులు. ఏఏ దేవతలకు పుట్టినారో వారి వారి రూపముతో వారివారి చిహ్నాలతో వారివారి పరాక్రమముతో రావణ వధాసక్తులు అయి తిరుగసాగినారు.

ఆ వానరులు అందరూ అప్సరసలకూ గంధర్వాంగనలకూ నాగకన్యలకూ విద్యాధరస్త్రీలకూ జన్మించినారు. వారు అందరూ మహాకాయులు. కామరూ

పులు. సర్వాస్త్రశస్త్రకోవిదులు. దర్పానికి వారు అందరూ సింహాలవంటి వారు. బలానికి వారు అందరూ పెద్దపులులవంటివారు. పెద్దపెద్ద రాళ్లురువ్వడము లోనూ చెట్లకొమ్మలు పెద్దపెద్దవాటితో కొట్టడములోనూ వారు అందరూ ఆరితేరిన యోధులు. తమతమ గోళ్ళనూ కోరలనూ ఆయుధాలుగా ఉపయోగించగలరు. తమతమపాదాలతో ఈభూమిని బ్రద్దలుకొట్టగలరు. పెద్దపెద్దకొండలను కదిలించి అవతల పడవేయగలరు. మహోన్నతవృక్షాలను కూకటివ్రేళ్లతో పెళ్ళగించి పారవేయగలరు. వేగముగా పరుగులెత్తి మహాసముద్రాన్ని క్షోభ పెట్టగలరు. అంతరిక్షమువరకు ఎగిరి అటు మేఘాలను పట్టుకోగలరు. ఇటు సముద్రాలను దాటిపోగలరు. మదముఎక్కి మహారణ్యసానువులలో చెలరేగి పరుగులెత్తే ఏనుగులను సయితము అటకాయించగలరు. కేకలువేసి పెద్దపెద్దపక్షులను బెదరకొట్టగలరు.

అటువంటి పరాక్రమముతో పుట్టిన ఆ వానరులు అందరూ గుంపులుగుంపులుగా బయలుదేరి ఋక్షవంతము మొదలుఅయిన పర్వతాలమీదనూ సాంద్రారణ్యాలలోనూ నివాసము పెట్టుకొన్నారు.

వాలి మొదలుఅయిన వానర ముఖ్యులకు వారిఅంతటి పరాక్రమవంతులు అయిన పుత్రులున్నూ పుట్టినారు.

వానరులు అందరూ అన్నతమ్ములుఅయిన వాలి సుగ్రీవులనూ నలుణ్ణీ నీలుణ్ణీ హనుమంతుణ్ణీ సేనానాయకులుగా ఎన్నుకొన్నారు.

ఆ వానరులలో ప్రతివాడూ గరుత్మంతుడు అంతటి బలవంతుడు. అంతటి వేగవంతుడు. ప్రతివాడూ యుద్ధవిశారదుడు. వారు అందరూ ఆయాప్రాంతాలలో సింహశార్దూలమహోరగాలను మర్దిస్తూ తిరగసాగినారు.

మహాబాహువూ మహాపరాక్రమశాలీ అయిన వాలి వారికి అందరికీ రాజు అయినాడు.

ఆ వానరులు అందరూ వివిధాకారాలతో వివిధజాతుల చిహ్నలతో మేఘసమూహాలమాదిరిగాను పర్వతశిఖరాలమాదిరిగాను భయంకరముగా ఈ పృథ్విఅంతటా వ్యాపించినారు.

వారు అందరూ రాముడికి యుద్ధములో సాయము చేయడానికే పుట్టినారు.

## ౧౮

దశరథమహారాజు పాగించిన హయమేధమూ పుత్రేష్టీ పూర్తి అయిపోతూ ఉండగా దేవతలు తమ హవిర్భాగాలను తీసికొని, వచ్చినదారినే వెళ్లిపోయినారు.

యజ్ఞదీక్షా నియమము అయిపోగానే దశరథమహారాజు భార్యలతోనూ భృత్యులతోనూ సైన్యవాహనాలతోనూ యజ్ఞవాటమునుంచి అయోధ్యానగరము పోదలచి యజ్ఞము చూడవచ్చిన రాజులను అందరిని వారివారి యోగ్యతలకు తగినట్టుగా సన్మానించి సంతోష పెట్టినాడు. వారు అందరూ సంతుష్టాంతరంగులు అయి వసిష్ఠమహర్షికి నమస్కారముజేసి దశరథమహారాజుకు వీడ్కోలు చెప్పి తమతమ దేశాలకు ప్రయాణము అయినారు.

ఆయా దేశాధిపుల సైనికులకు అందరికీ దశరథమహారాజు తెల్లని వస్త్రాలు ఇచ్చి బహూకరించినాడు. వారు అందరూ అధౌతవస్త్రాలను సంతోషముతో ధరించి బారులుతీరి బయలుదేరినారు. అప్పుడు ఆ ప్రదేశము అంతా తెల్లని కాంతులతో తేజరిల్లింది.

బ్రాహ్మణోత్తములు ముందర నడుస్తూఉండగా దశరథ మహారాజు సపరివారముగా అయోధ్యానగరము ప్రవేశించినాడు. అక్కడ ఋశ్యశృంగుణ్ణీ, శాంతాదేవినీ ఎంతో గొప్పగా సన్మానించినాడు. ఆ దంపతులు అంతట రోమపాద మహారాజు వెంట అంగదేశానికి ప్రయాణముఅయిపోయినారు. ఆతరువాత దశరథమహారాజు బ్రాహ్మణులను అందరినీ చక్కగా సన్మానించి వారివారి తావులకు పంపించివేసినాడు. తన మనోరథము ఈడేరినట్టు సంతోషించినాడు. పుత్రోత్పత్తినిగురించి ఆలోచిస్తూ హాయిగా కాలము గడపసాగినాడు.

పుత్రేష్టిక్రతువు అయి ఒక సంవత్సరము కావచ్చింది. ఆరవఋతువు జరుగుతూ వుంది. పన్నెండోమాసము వచ్చింది. అది చైత్రమాసము. ఆనాడు శుద్ధ నవమి. పునర్వసూనక్షత్రము. అయిదుగ్రహాలు ఉచ్చలో సంచారము చేస్తూ ఉన్నవి. గురువూ చంద్రుడూఉన్న కటకలగ్నము ఆటు తూర్పున ఉదయిస్తూ ఉంది- ఇటు కౌసల్యాదేవి ప్రసవించింది. మొగశిశువు పుట్టినాడు. ఆ శిశువు అరచేతిలో వజ్రరేఖఉంది. వజ్రపాణిని కన్న అదితిమాదిరిగా కౌసల్యాదేవి సంతోషించింది. అప్పుడు గంధర్వులు మధురగానము చేసినారు. అప్సరసలు ఆడినారు. దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశమునుంచి పూలవాన కురిసింది.

పుష్యమీ నక్షత్రాన కైకేయీదేవి ఒక మొగ శిశువును కన్నది. ఆశ్లేషా నక్షత్రాన మిట్టమధ్యాహ్నమప్పుడు సుమిత్రాదేవి ఇద్దరు మొగపిల్లలను కన్నది.

ఆ నల్గురు శిశువులూ దశరథమహారాజు ప్రతిబింబాలుగా కనుపించినారు.

పూర్వాభాద్రా ఉత్తరాభాద్రా నక్షత్రాలమాదిరిగా రెండురెండుజంటలుగా ఆ నలుగురు బిడ్డలూ మెరసినారు.

దశరథమహారాజుకు నలుగురు పుత్రులు పుట్టడముతో అయోధ్యానగరములో మహోత్సవము ఆరంభము అయింది. రాజవీథులు అన్నీ జనాకీర్ణము

అయిపోయినవి. ఒకపక్కను నటనర్తకులు రసభావాలను అభినయించ సాగినారు. మరిఒకప్రక్కను గాయకులు శ్రావ్యముగా పాడసాగినారు. ఇంకొకపక్కను వాద్యగాండ్లు సంతోషాతిశయముతో జయవాద్యాలను ప్రయోగించినారు. అప్పుడు అయోధ్యానగరముఅంతా సంతోషధ్వనులతో మారుమ్రోగిపోయింది.

దశరథమహారాజు బ్రాహ్మణులకు ధనాన్నీ గోధనాన్నీ అపారముగా దానము ఇచ్చినాడు. సూతవందిమాగధులు మొదలుఅయినవారిని అందరినీసత్కరించినాడు.

పదకొండవ రోజున ఆబిడ్డలకు దశరథమహారాజు నామకరణ కర్మను ఏర్పాటుచేసినాడు. వసిష్ఠమహర్షి ఆపిల్లలలో జ్యేష్ఠుడికి రాముడు అనీ కైకేయీపుత్రుడికి భరతుడు అనీ సుమిత్రాదేవి పెద్దపిల్లవాడికి లక్ష్మణుడు అనీ రెండవవాడికి శత్రుఘ్నుడు అనీ నామకరణము చేసినాడు. అనాడు దశరథమహారాజు బ్రాహ్మణులకూ పౌరులకూ జానపదులకూ మృష్టాన్నదానము చేసినాడు.

కాలక్రమేణా ఆ నలుగురు అన్నతమ్ములకు చౌలోపనయాది కర్మలు అన్నీ యథావిధిగా జరిగిపోయినవి.

ఆ నల్గురిలో పెద్దవాడు రాముడు దేవతలలో బ్రహ్మదేవుడు మాదిరిగా అందరికీ ఇష్టుడు అయినాడు. సుమిత్రాపుత్రుడు లక్ష్మణుడు పుట్టింది మొదలు రాముడితో ఎక్కువగా చెలిమిచేయసాగినాడు. ఎప్పుడూ రాముణ్ణి సంతోషపెట్టేవాడు. వాడు రాముడికి బహిఃప్రాణముఅయిపోయినాడు. రాముడున్నూ లక్ష్మణుణ్ణి తనకన్నా ఎక్కువగా చూచుకొనేవాడు. లక్ష్మణుడు దగ్గరలేకుండా రాముడు ఎన్నడూ నిద్ర అయినా పోయేవాడుకాడు. ఎంత రుచ్యము అయిన ఆహారము అయినా లక్ష్మణుడు సరసనులేకుండా రాముడు తినేవాడు కాడు. రాముడు గుర్రము ఎక్కి వేటకు బయలుదేరితే తత్క్షణమే లక్ష్మణుడు విల్లూ అంబులనూ తీసుకొని వెంట తోడుగా పోయేవాడు.

ఆ లక్ష్మణుడు మాదిరిగానే వాడి తమ్ముడు శత్రుఘ్నుడున్నూ చిన్నప్పటి నుంచీ భరతుడికి ప్రాణస్నేహితుడు అయినాడు. భరతుడున్నూ శత్రుఘ్నుడిని విడిచిపెట్టి ఉండేవాడుకాడు. భరతుడు ఎప్పుడూ ఆ తమ్ముడినే సంతోషపెట్టుతూ ఉండేవాడు.

ఆ నల్గురు అన్నతమ్ములూ వేదాధ్యయనము చేసినారు. శ్రుతిస్మృతేతిహాసపురాణాదులు చదివినారు. ధనుర్వేదము అభ్యసించినారు. లౌకిక వ్యవహారజ్ఞానము సంపాదించినారు. నలుగురూ లోకహితాచరణ పరాయణులూ సర్వజన మనోహరులూ అయినారు. వారు విలువిద్యలో ఆరితేరడమేకాకుండా

గజాశ్వరథారోహణచతురులున్నూ అయినారు. నలుగురూ తేజోవంతులు, భీరుపోని పరాక్రమవంతులు. పెద్దపులులవంటివారు. తండ్రి తమను మెచ్చు కొన్నాడు అని వారు ఎన్నడూ విర్రవీగిపోలేదు. తమ విద్యానైపుణ్యము తోనూ తమ సుగుణసంపదతోనూ నల్గురూ తండ్రిని ఎప్పుడూ సంతోష పెట్టుతూ ఉండేవారు. నల్గురూ దిక్పాలకులవంటివారు. వారిలో పెద్దవాడు కళంకరహి తుడు అయిన చంద్రుడు మాదిరిగా సర్వజనమనోహరుడూ నిరంతర పితృసేవా పరాయణుడు అయినాడు.

దశరథ మహారాజు సమస్తధర్మాలూ తెలిసినవాడు. పుత్రులకు యుక్త వయస్సు సమీపిస్తూ ఉన్నందువల్ల పురోహితులనూ బంధువులనూ రావించి వారితో పుత్రుల వివాహ విషయము ఆలోచన చేయసాగినాడు.

అదేసమయాన మహాతేజోవంతుడుఅయిన విశ్వామిత్రమహర్షి అయోధ్యా నగరానికి వచ్చినాడు. దశరథ మహారాజును చూడతలచి ద్వారాధ్యక్షులతో "ఓ ద్వారపాలకులారా, మీరు మీ మహారాజువద్దకుపోయి గాధిపుత్రుడు విశ్వామిత్రుడు వచ్చినాడు అనీ మిమ్మలను చూడవలెను అనుకొంటున్నాడు అనీ చెప్పవలెను." అన్నాడు. ఆయన ఎవరు అయిందీ తెలియగానే ఆ ద్వార పాలకులు విభ్రాంతులు అయిపోయినారు. వారు తత్క్షణమే రాజభవనము లోకిపోయి తమ ఏలికను చూచి "మహారాజా, విశ్వామిత్రమహర్షి తమను చూడ తలచి వచ్చిఉన్నాడు." అన్నారు.

బ్రహ్మదేవుడికి ఎదురుకోలు చెప్పడానికిపోయే దేవేంద్రుడి మాదిరిగా దశరథమహారాజు పురోహితులు మొదలుఅయిన వారితో విశ్వామిత్రమహర్షికి ఎదురుగుండా పోయినాడు. తపోదీప్తులతో తేజరిల్లుతూ తీక్షణదీక్షలో ఉన్న విశ్వామిత్రమహర్షిని చూచినాడు. దశరథ మహారాజు దేహము పులకలెత్తింది. నమస్కారము చేసినాడు. పురోహితుడిచేత అర్ఘ్యమూ పాద్యమూ ఇప్పించి నాడు. విశ్వామిత్రమహర్షి దశరథమహారాజు ఇప్పించిన అర్ఘ్యాదులను అందు కొని "ఓ రాజా, నీవు క్షేమముగా ఉంటూఉన్నావా-నీ పట్టణానికీ నీ బొక్క సానికి నీ దేశానికీ ఏ ఉపద్రవాలూ లేకుండా సుఖముగా ఉంటూఉన్నావా- నీ సామంతరాజులు అందరూ వినయవిధేయతలతో మెలుగుతూఉన్నారా- నీ శత్రువులను అందరినీ నీవు జయించినావుకదా-సామదానభేదదండోపాయా లతో నీ రాజ్యపాలనము చక్కగా సాగుతూఉందా-ఏ అంతరాయాలూ లేకుండా నీ రాజ్యములో అతిథి సత్కారాలూ దేవతార్చనలూ యజ్ఞాదిక్రతు వులూ జరుగుతూ ఉన్నవాకి?" అని ప్రశ్నించి సమాధానము విని వసిష్ఠమహ ర్షినీ తక్కినవారినీ యథాన్యాయముగా కుశలము అడిగి తెలుసుకొన్నాడు.

విశ్వామిత్రమహర్షి కుశలప్రశ్నలకు వారు అందరూ ఎంతో సంతోషించినారు.

దశరథమహారాజు వారిని అందరినీ తన కొలువుకూటములోకి తీసుకొని పోయి కూర్చుండటానికి వారివారి యోగ్యతలకు తగినట్టుగా సుఖాసనాలు చూపించి వారు అందరూ కూర్చున్నతరువాత విశ్వామిత్రమహర్షిని చూస్తూ మహదానందముతో "మహర్షీ, తమకు స్వాగతము. తమ రాకవల్ల నాకు అమృతకలశము దొరికినట్టుగాఉంది. నిర్జలప్రదేశములో వాన కురిసినట్టుగా ఉంది. సంతానములేనివాడి కులకాంత పుత్రుణ్ణి కన్నట్టుగాఉంది. పేదవాడికి పెన్నిధి దొరికినట్టుగాఉంది. ఇది ఏదో మహోత్సవసమయముగాఉంది. తమంతటతాము వచ్చినందుకు నా సంతోషాన్ని తమకు ఏవిధముగా తెలియచెప్పవలెనో తోచడములేదు. ఓ బ్రహ్మర్షీ తమ కోరిక ఏమిటి-తమ కోరిక నెరవేర్చడముకన్నా నేను చేయకలిగింది ఏమి ఉంది. నేను ఏమిచేయవలెనో తాము చెప్పవలెను.

"స్వామీ, తాముపూర్వము రాజర్షులు మాత్రమే. ఇప్పుడో తపఃప్రభావముతో బ్రహ్మర్షులు అయినారు. అందువల్ల నేను తమను ఎంత అయినా పూజించవలెను. ఓ బ్రహ్మర్షీ, తమఅంతటతాము ఇక్కడికి రావటము మహాద్భుతము. ఏదో నా భాగ్యవశమువల్ల తాము ఇక్కడకు వచ్చినారు. తమ సందర్శనము వల్ల నా పుట్టుక సఫలము అయింది. నా బ్రతుకు సార్థకము అయింది. నేను పరమపవిత్రుణ్ణి అయినాను. నా ఈ గృహము పుణ్యక్షేత్రము అయింది. తాము ఏ ప్రయోజనము కోసము వచ్చినారో సెలవు ఈయవలెను. తమ అనుగ్రహముతోనే తమ పనిని నేను నెరవేరుస్తాను. తాము చెప్పేపని వీడు చేయగలడా చేయలేడా-చేస్తాడా చేయడా అనే ఏ సంకోచమూవద్దు. ఏ కొరతా లేకుండా తమ పనిని నేను చక్కబెట్టుతాను. తాము నాకు దేవుడు వంటివారు. తాము రావడమే నాకు అభ్యుదయము." అని వినయవిధేయతలతో చెవులకు ఇంపుగానూ మనస్సుకు నాటుకొనేట్టుగానూ అన్నాడు.

దశరథమహారాజు ఈ విధముగా చెప్పినందుకు విశ్వామిత్రమహర్షి ఎంతో హర్షించినాడు.

## ౧౯

విశ్వామిత్రమహర్షి దశరథమహారాజును చూస్తూ "రాజా, నీవు మహాగొప్పవంశములో పుట్టినావు. అందుకుతోడు నీకు వసిష్ఠమహర్షి ఉపదేష్టఅయినాడు. అందువల్ల నీవు ఈ విధముగా అనకలిగినావు. ఇక నా మనస్సులోఉన్న విషయము చెప్పతాను. విను. నా పని నెరవేరుస్తాను అని నీవే అన్నావు. నీవు

ఆడి తప్పవు. కాబట్టి నాపని నెరవేర్చి సత్యసంధుడవు అనే పేరు నీవు నిలుపుకోవలెను."

"నేను ఒక ఫలసిద్ధికోసము ఇప్పుడు ఒకయజ్ఞము చేస్తూఉన్నాను. ఇద్దరు రాక్షసులు వచ్చి నాయజ్ఞాన్ని విఘ్నము చేస్తూఉన్నారు. వాండ్లు ఇద్దరూ కామరూపులు. వీర్యవంతులు. అస్త్రవిద్యలో ఆరితేరినవారు. వారిని మారీచ, సుబాహువులు అంటారు. నేను యజ్ఞము సమాప్తము చేయబోయేటప్పుడు వాండ్లు నాయజ్ఞవేదిక మీద మాంసము ముద్దలతో నెత్తురువానకురిపిస్తూఉంటారు. అందువల్ల నాయజ్ఞము పదేపదే విఘ్నము అయిపోతూఉంది. నా శ్రమఅంతా వృథా అయిపోతూ ఉంది. నేను యజ్ఞదీక్షలో ఉండబట్టి వాండ్లను శపించకూడదు. నిరుత్సాహపడిపోయి యజ్ఞవాటిక వదిలిపెట్టి ఇక్కడికి వచ్చినాను.

ఓ రాజా, నిన్ను అడిగి నీ పెద్దకుమారుణ్ణి రాముణ్ణి నావెంట తీసుకొనిపోవలెనని నేను ఇక్కడికి వచ్చినాను. రాముడు జుట్టూ జునపాలతో ఉన్న పిల్లవాడు అని అనుకోవద్దు. వాడు మహాశూరుడు. నేనున్నూ నా తపోబలముతో వాణ్ణి కనిపెట్టిఉంటాను. రాముడు వాడి దివ్య తేజస్సుతో ఆ ఇద్దరు రాక్షసులను చంపివేస్తాడు. నీవు నీకుమారుడి శక్తిని గురించి ఎంతమాత్రమూ సంశయించవద్దు. నీ పిల్లవాడి ఎదుట ఆ మారీచ సుబాహువులు ఇద్దరూ నిలువలేరు. రఘువంశములో పుట్టిన నీ కుమారుడు రాముడు తప్ప మరిఒకడు ఎవడూ వాండ్లను చంపివేయలేడు. ఆ ఇద్దరు రాక్షసులూ వీర్యవంతులము అనే గర్వముతో చెలరేగినారు. అయితే వాండ్లు పాపాత్ములు కాబట్టి కాలపాశవశంగతులు కాకమానరు. రాముడి పరాక్రమానికి వాండ్లు ఈషణ్మాత్రమూ చాలరు. నేను నీ పిల్లవాడికి అనేక విద్యలు ఉపదేశిస్తాను. ముల్లోకాలలోనూ ప్రసిద్ధికెక్కేటట్టు చేస్తాను.

రాజా, నీవు ఏసందేహమూ వద్దు. రాముణ్ణి గురించి నీవు పుత్రస్నేహముతో ఆలోచించవద్దు. నేను ప్రతిజ్ఞచేసి చెప్పుతున్నాను. నీకొడుకు రాముడు ఆఇద్దరు రాక్షసులనూ సంహారము చేసివేస్తాడు. నా మాట నమ్ము. రాముడి సత్యపరాక్రమాన్నీ మహాత్మ్యాన్నీ నేను ఎరుగుదును. ఈ వసిష్ఠమహర్షి ఎరుగును. ఇంకా ఈ తాపసులు అందరూ ఎరుగుదురు. ఓ రాజా, రాముణ్ణినావెంట పంపిస్తే నీకు సమస్తధర్మలాభాలూ సమకూరుతవి. నీ యశస్సు శాశ్వతముగా నిలచిపోతుంది. నీకు ఏమి అయినా సంశయము ఉంటే ఈ వసిష్ఠమహర్షినీ ఈ తాపసులనూ ఈ మంత్రిసత్తములనూ సంప్రదించు. వీరు అందరూ ఒప్పుకొంటేనే రాముణ్ణి నాతో పంపించు. యజ్ఞముజరిగే పదిరాత్రములే నీ పిల్లవాణ్ణి

నాదగ్గర ఉంచుకొంటాను. ఆతరువాత జాగుచేయకుండా నీ పిల్లవాణ్ణి నీదగ్గరకు పంపించివేస్తాను. పసివాణ్ణి పంపించడమా అని మనస్సులో దిగులుపడవద్దు. నా యజ్ఞకాలము అతిక్రమించిపోతూఉంది. ఇప్పుడే నీపిల్లవాణ్ణి నావెంట పంపించవలెను. నీకు శుభము అవుతుంది." అని ధర్మసహితముగానూ, అర్థయుక్తముగానూ చెప్పి ఊరకఉన్నాడు.

విశ్వామిత్రమహర్షి ఇంతగాచెప్పినా దశరథమహారాజుకు భయము వేసింది. దిగులుపడిపోయినాడు. ఆయనగుండె బ్రద్దలు అయిపోయింది. మనస్సు వికలము అయిపోయింది. సింహాసనముమీద కూర్చున్నవాడు కూర్చున్నట్టుగానే గజగజ వణికిపోయినాడు.

## ౨౦

దశరథమహారాజు నిశ్చేష్టుడు అయిపోయినాడు. కొంచెము సేపటికి తెప్పరిల్లి విశ్వామిత్రమహర్షితో "ఓ మహామునీ, రాముడికి ఇంకా పదహారు ఏండ్లు అయినా నిండలేదు. రాక్షసులతో యుద్ధము చేసే సామర్థ్యము వాడికి ఎక్కడిది. నాకు ఒక అక్షౌహిణీ సైన్యము ఉంది. నా సైనికులు అందరూ శూరులు. మహాపరాక్రమవంతులు. సకలశస్త్రాస్త్ర విద్యావిశారదులు. నేనూ నా అక్షౌహిణీసైన్యమూ తమవెంటవచ్చి ఆ నిశాచరులతో యుద్ధము చేసాము. నేను ధనుర్ధరుణ్ణిఅయి తమ యజ్ఞానికి కావలి కాస్తాను. నా బొందిలో ప్రాణము ఉండేటంతవరకూ ఆ రాక్షసులతో పోరాడుతాను. తమ యజ్ఞము నిర్విఘ్నముగా కొనసాగిస్తాను."

"రాముడు పసివాడు. విలువిద్యను ఇంకా సాంగముగా నేర్చుకోలేదు. ఎదటివారి బలాబలాలను ఇంకా సరీగా గుర్తించలేడు. అస్త్రబలసంపన్నుడున్నూ కాలేదు. యుద్ధకుశలుడున్నూ కాడు. రాక్షసులకు కొంచెముఅయినా దీటు అయినవాడుకాడు. రాక్షసులు తప్పకుండా కూటయుద్ధము చేస్తారు. అందువల్ల వాండ్లతో యుద్ధానికి రాముడు ఎంతమాత్రమూ పనికిరాడు. వాడివల్ల తమ కార్యము నెరవేరదు."

"మహర్షీ! నేను బాగా ముసలివాణ్ణి అయిపోయి బిడ్డలులేరే అని దుఃఖపడ్డ తరువాత నాకు పుత్రులు పుట్టినారు. నా నలుగురు పుత్రులలో నాకు రాముడిమీద మక్కువ ఎక్కువ. వాడు జ్యేష్ఠుడు. పరమధార్మికుడు. వాణ్ణి వదిలిపెట్టి నేను ఒక్క ముహూర్తము అయినా ఉండలేను. కాబట్టి రాముణ్ణి ఒక్కణ్ణి తమ వెంట పంపించలేను. నేనునా చతురంగబలాలతో వచ్చి తమ యజ్ఞాన్ని కాపాడుతాను.

"మహర్షీ, ఆ రాక్షసులు మహాపరాక్రమముతో గర్వించిఉన్నారు అని తాము సెలవు ఇచ్చినారు. ఇంతకూ ఆ రాక్షసులు ఎవండ్లు. వాండ్లు ఎవరి కొమాళ్లు. వాండ్లకు రాజు ఎవడు. వాండ్లవి ఎటువంటి ఆకారాలు. వాండ్లు ఎటువంటి పరాక్రమవంతులు. నేనూ నా సైన్యమూ వాండ్లకు ఏవిధముఅయిన ప్రతీకారము చేయవలెను. వాండ్లతో యుద్ధము చేయడానికి మేము ఎటు వంటి వ్యూహము పన్నవలెను. అవి అన్నీ తామే చెప్పవలెను." అన్నాడు దశరథ మహారాజు.

విశ్వామిత్రమహర్షి "ఓ రాజా పులస్త్యమహర్షి వంశములో రాక్షసుడు ఒకడు పుట్టినాడు. వాడి పేరు రావణుడు. వాడు మహాబలవంతుడు. అమిత వీర్యవంతుడు. వాడు తీవ్రముగా తపస్సు చేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించినాడు. అనేకవరాలు సంపాదించినాడు. అనేకమంది రాక్షసులు వాడిచుట్టూ చేరి నారు. వాడు ఆ రాక్షసులు అందరికీ రాజు అయినాడు. వాణ్ణి గురించి నీవూ విని ఉంటావు. వాడు ఎవడోకాడు. విశ్రవమహర్షి రెండో పుత్రుడు. కుబే రుడికి సాక్షాత్తూ తమ్ముడు. ఇప్పుడు వాడు ముల్లోకాలవారినీ నానాబాధలూ పెట్టుతూ ఉన్నాడు. అయితే నా యజ్ఞవాటికకు వాడు స్వయముగా రావడము లేదు. మారీచసుబాహువులను పురికొల్పి నా మీదికి పంపిస్తూఉన్నాడు. వాండ్లు వచ్చి నా యజ్ఞాన్ని పాడుచేస్తూఉన్నారు." అని చెప్పినాడు.

దశరథమహారాజు "ఓ మహర్షీ, ఆ రావణాసురుడితో యుద్ధము చేసే సామర్థ్యము నాకేలేదు. తాము ధర్మజ్ఞులు. నాకు గురువులు. దేవుడువంటి వారు. మందభాగ్యుణ్ణి అయిన నన్నూ నా కుమారుణ్ణీ తాము అనుగ్రహించ వలెను. దేవదానవయక్షగంధర్వపన్నగపతగులు ఎవరున్నూ యుద్ధములో ఆ రావణాసురుణ్ణి ఎదుర్కొనలేకపోయినారు. యుద్ధములో వాడు మహావీర్య వంతుల వీర్యాన్ని ఆకర్షించివేస్తాడు. నేనూ నా చతురంగబలాలూ ఏకము అయినా వాడితోకానీ వాడి సైన్యముతోకానీ పోరాడలేము. ఇక మారీచ సుబాహువులో-వాండ్లు సుందోపసుందుల కొమాళ్లు. మహావీర్యవంతులు. సుశిక్షి తులు. యుద్ధములో వాండ్లు యముడితో సరిసమానులు. నేనూ నా సైన్యమూ వాండ్లలో ఏ ఒక్కడితోనయినా పోరాడగలమో లేమో. కాబట్టి నా కుమా రుణ్ణి ఒక్కణ్ణీ ఎంతమాత్రమూ పంపించలేను. వాడు పసివాడు. యుద్ధములో ఆరితేరలేదు. పైపెచ్చువాడు నా ఇలువేల్పు. ఏమి అయినప్పటికిన్నీ రాముణ్ణి తమ వెంట పంపించను." అన్నాడు.

ఈ మాటలకు విశ్వామిత్రమహర్షికి మహాచెడ్డకోపము వచ్చింది. మంట రగులుకొంటూ ఉన్న హోమకుండములో నెయ్యిపోసినప్పుడు భగ్గమనే అగ్ని జ్వాల మాదిరిగా మండిపడిపోయినాడు.

## ౨౧

"ఓ దశరథుడా, నీ అంతట నీవే నాపని నెరవేరుస్తాను అన్నావు. ఆ అన్నమాట ఇప్పుడు తప్పుతున్నావు. ఈ విపర్యయము రఘువంశీయులకు తగింది కాదు. ఆడితప్పటము నీకు సమ్మతము ఏమో చెప్పు. నీకు సమ్మతి మే అయిన ట్లయితే వాదారిన నేనుపోతాను. నీవు అబద్ధాలు ఆడుతూ హాయిగా ఉండు." అంటూ విశ్వామిత్రమహర్షి కోపపరీతుడుఅయి లేచినాడు.

ఈ జగత్తు అంతా కంపించడము మొదలు పెట్టింది. దేవతలు భయపడి పోయినారు.

పరమపూజ్యుడు అయిన వసిష్ఠమహర్షి స్థితిగతులను గమనించినాడు' అంతట ఆ సువ్రతుడు, ఆ ధీరుడు దశరథమహారాజుతో "రాజా, నీవుఇక్ష్వాకు వంశములో పుట్టినావు. ధర్మము సాక్షాత్తూ నీ రూపాన మూర్తీభవించినట్టుగా ఇంతవరకూ నీవు ప్రవర్తించినావు. నీవు శ్రీమంతుడవు. ధైర్యవంతుడవు. సువ్రతుడవు. ధర్మాత్ముడవు అని ముల్లోకాలలోనూ ప్రసిద్ధికెక్కినావు. ఇప్పుడు నీవు ధర్మహాని చేయకూడదు. ఈవిశ్వామిత్రమహర్షితో 'మీపని నెరవేరుస్తాను' అని మొదట నీవే అన్నావు. నీవు అన్నమాట నీవు దక్కించుకొనక పోయేట్లయితే నీవు చేసిన అశ్వమేధాదియజ్ఞాలూ నీవు నిర్మించిన వాపీకూప తటాకాది ధర్మకార్యాలూ నిష్ఫలాలు అయిపోతవి. కాబట్టి నీవు రాముణ్ణి ఈ విశ్వామిత్ర మహర్షి వెంట పంపించవలెను."

"రాజా, రాముడికి శస్త్రాస్త్రబలము ఉంటేనేమి లేకపోతేనేమి. జ్వలితాగ్నిహోత్రచక్రము అమృతకలశాన్ని కాపాడినట్టు ఈ విశ్వామిత్ర మహర్షి రాముణ్ణి కాపాడుతూ ఉంటే రాక్షసులు ఏమిచేస్తారు. ఏమీ చేయలేరు. ఓ రాజా, ఈలోకములో ధర్మము ఈ విశ్వామిత్రమహర్షి రూపాన అవతరించింది. ఈయన మహాపరాక్రమవంతులకు మేలుబంతి. ఈ జగత్తులో ఈయన అంతటి బుద్ధిమంతుడూ శస్త్రాస్త్రబల సంపన్నుడూ మరిఒకడులేడు. చరాచరాత్మకము అయిన ముల్లోకాలలో ఉన్న సమస్త శస్త్రాస్త్రాలనూ ఈయనఒక్కడే వశపరచుకొన్నాడు. ఇన్ని శస్త్రాస్త్రాలు ఉన్నవి అని ఇంతవరకూ ఏ ఒక్కడూ తెలుసుకోలేదు. ఇకముందు ఎవడూ తెలుసుకో కలుగుతాడు అని

తోచదు. ఈయన స్వాధీనము చేసుకొన్న అన్ని శస్త్రాస్త్రాలను దేవదానవ యక్షరాక్షసకిన్నరమహోరగులు ఎవరూ స్వాధీనము చేసుకోలేదు.

ఈ లోకములో భృశాశ్వుడిపుత్రుల రూపాన అవతరించిన శస్త్రాస్త్రాలను అన్నిటినీ పూర్వము ఈ విశ్వామిత్ర మహర్షి రాజ్యపాలనము చేస్తూఉన్న కాలములో శివదేవుడు ఈయనకు ఇచ్చివేసినాడు.

దక్షప్రజాపతి కూతుళ్లు జయ-సుప్రభ అనే అక్కచెల్లెండ్లు భృశాశ్వుడి భార్యలు. వారు ఇద్దరూ నూరుమంది పుత్రులను కన్నారు. జయకు జయులు అనే ఏభైమంది పుత్రులూ సుప్రభకు సంహారకులు అనే ఏభైమంది పుత్రులూ పుట్టినారు. వారు కామరూపులు. మహాప్రభావులు. దుర్ధర్షులు. అప్రమేయ బలులు. అప్రతిహత తేజోవంతులు. రాక్షససంహారము చేయడానికే వారు నూరుగురూ పుట్టినారు. ఆ అక్కచెల్లెండ్లకు పుట్టిన ఆ నూర్గురు పుత్రులూ పరమ భాస్వరముఅయిన నూరు శస్త్రాస్త్రాలుగా మారిపోయినారు. అవి అన్నీ ఈ విశ్వామిత్రమహర్షి వశము అయిపోయినవి. ఈయన శివదేవుడు అంతటివాడు. వశపరుచుకొన్న వాటినేకాకుండా కొత్తకొత్తశస్త్రాస్త్రాలను ఎన్నిటిని అయినా ఈయన సృష్టించి ప్రయోగించగలడు. అటువంటి ప్రభావము ఈయనకు ఒక్కడికే ఉంది. ఈయన అమేయపరాక్రమవంతుడు. మహాతేజోవంతుడు. పరమయశస్వి. ఈయనవెంట రాముణ్ణి పంపించడానికి ఏసంశయమూ వద్దు.

“ఓ రాజా, ఈజగత్తులోఉన్న రాక్షసులను అందరినీ ఈయన ఒక్కడే సంహారము చేయగలడు. కాని నీపుత్రుడు రాముడికి మేలుచేయతలచి నీదగ్గిరకు వచ్చి నీ కుమారుడిణ్ణి రాముణ్ణి తనతో పంపించమని నిన్ను ఇప్పుడు యాచిస్తున్నాడు.” అని చెప్పినాడు.

వసిష్ఠమహర్షి చెప్పిన ఈ మాటలకు దశరథమహారాజు సంతుష్టచిత్తుడయినాడు. ఆయన సర్వాంగాలూ శోభించినవి. బుద్ధిపూర్వకముగానూ సంతోషముగానూ రాముణ్ణి విశ్వామిత్రమహర్షి వెంట పంపించడానికి ఒప్పుకొన్నాడు.

## ౨౨

దశరథ మహారాజు రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ అక్కడికి పిలిపించినాడు. ప్రేమాతిశయముతో రాముడి శిరస్సును ఆఘ్రాణించినాడు. ఆయనా ఆయన భార్యలూ రామలక్ష్మణులను ఆశీర్వదించినారు.

వశిష్ఠమహర్షి మంగళప్రదముఅయిన మంత్రాలతో రామలక్ష్మణులను అభిమంత్రించినాడు. మహదానందముతో ఆ అన్నతమ్ములను దశరథ మహా

రాజు విశ్వామిత్రమహర్షికి ఒప్పచెప్పినాడు. ఆ సమయాన దుమ్మూధూళీ లేక కుండా చల్లనిగాలి వీచింది. దేవదుందుభులు మ్రోగినవి. పూలవాన కురిసింది. రాజభవనములోనుంచి శంఖాలు పూరించినారు. దిక్కులు పిక్కటిల్లిపోయేట్టు భేరులు మ్రోగినవి.

విశ్వామిత్రమహర్షి ముందు నడిచినాడు. ఆయన వెనుక ధనుర్ధరుడు అయి రాముడూ అతని పక్కను చక్కని గిరజాలజుట్టుతో విల్లు పట్టుకొని లక్ష్మణుడూ నడిచినాడు.

ఆ సుందరాకారులు మణికట్లకూ వ్రేళ్ళకూ ఉడుముతోలు కవచాలు తొడుగుకొని చక్కగా అలంకరించుకొని భుజాలమీదనుంచీ ధనుస్సులూ నడుములలో కత్తులూ వ్రేలాడుతూ దివ్యకాంతులు విరజిమ్ముతూ విశ్వామిత్ర మహర్షి వెనుక నడుస్తూఉంటే అగ్నిహోత్రోద్భవులుఅయిన స్కందవిశాఖులు చింతించనలవికాని శివదేవుడివెంట సాగిపోయినట్లుగా తోచినారు.

ఆ కాంతిమంతులు అనల్పరూపాలతో విశ్వామిత్రమహర్షి వెంట నడుస్తూ ఉంటే బ్రహ్మదేవుడివెంట దశదిశలూ శోభిస్తూ నడిచే అశ్వినీదేవతలమాదిరిగా తోచినారు.

ఆ అన్నతమ్ములు రెండేసి అంబులపొదులతో నడుస్తూఉంటే మూడు తలలపాములు రెండు పడగలువిప్పి ఆడుతూ పోతూ ఉన్నట్లుగా తోచినారు.

వారు ముగ్గురూ ఒకటిన్నర యోజనాల దూరము నడిచినారు. సరయూ నది దక్షిణతీరము చేరినారు. విశ్వామిత్రమహర్షి మధురస్వరముతో "రామా, ఆలస్యము చేయవద్దు. నీవు ఇప్పుడు ఈ నదిలో ఆచమించవలెను. సమస్త మంత్రాలకున్నూ మూలాధారాలుఅయిన 'బల-అతిబల' అనే రెండు మంత్రాలు ఇప్పుడు నీకు ఉపదేశము చేయ తలచినాను. ఈ మంత్రాల ప్రభావమువల్ల నీకు ఇకను ఎన్నడూ అలసట అనేది ఉండదు. ఏ వ్యాధీ నిన్ను అంటదు. నీవు నిద్రపోతూ ఉన్నా ఏమరుపాటునఉన్నా నిన్ను రాక్షసులుఎదిరించలేరు.

"నాయనా, నీవు దారినపోతూ ఈ మంత్రాలను జపముచేస్తే నీకు ఆకలి వేయదు దాహముకాదు. ఈ మంత్రాల అనుష్ఠానమువల్ల బాహుబలములో నీ అంతటివాడు ఈ పృథ్విలో మరిఒకడు ఉండడు. అంతేకాదు. సామర్థ్యములో సౌందర్యములో బుద్ధికుశలతలో కార్యాకార్యనిశ్చయజ్ఞానములో వాదప్రతి వాదాలలో ఉత్తర ప్రత్యుత్తరాలలో నీ సరిసమానము అయినవాడు ముల్లోకాల లోనూ మరిఒకడు ఉండడు.

ఓరామా, బల అతిబల అనే ఈరెండు విద్యలూ సమస్త మంత్రాలకే కాదు: సమస్తము అయిన జ్ఞానానికిన్నీ తల్లులవంటివి. మహాతేజోవంతాలు అయిన ఈ రెండుమంత్రాలూ బ్రహ్మదేవుడు సృష్టించినాడు. నేను నా తపోబలముతో సంపాదించినాను. ఈ రెండువిద్యలూ అభ్యసించడానికి నీవు తగినవాడవు. అందువల్ల నీకు ఉపదేశము చేయ నిశ్చయించుకొన్నాను. నీవు ఈ రెండు మంత్రాలనూ చక్కగా జపము చేయవలెను. ఈ రెండూ నీకు అనేక విధాల ఉపయోగపడుతవి. వీటివల్ల నీవు మహాయశస్వివి అవుతావు." అన్నాడు.

రాముడు సంతోషముతో సరయూనదిలో ఆచమించి శుచి అయినాడు. అప్పుడు విశ్వామిత్రమహర్షి ఆరెండు మంత్రాలనూ రాముడికి ఉపదేశము చేసినాడు. మంత్రోపదేశము అయిన రాముడు సహస్రకిరణాలతో ధగధగలాడే శరత్కాల సూర్యుడిమాదిరిగా గోచరించినాడు.

ఆ సాయంకాలము గురువందనాదికాలు అయిపోయిన తరువాత ఆరాత్రి పడుకొనేటందుకు దగ్గరదగ్గరగా గడ్డితో పరుపులను రామలక్ష్మణులు అమర్చినారు.

విశ్వామిత్ర మహర్షి సవిలాసముగా వారికి పుణ్యకథలు చెప్పసాగినాడు.

ఆరాత్రి వారు ముగ్గురూ సరయూనది దక్షిణతీరాన హాయిగా నిద్ర పోయినారు.

## 23

తెల్లవారబోతూ ఉంది. ఆ గడ్డి పరుపులమీద పడుకొన్న రామలక్ష్మణులు ఇంకా నిద్ర లేవలేదు. విశ్వామిత్రమహర్షి వారిని చూచి "రామా, తొలిసంజె అయింది. నిద్రలేవవలెను. నిత్యకర్మానుష్ఠానానికి వేళ మించిపోతుంది" అంటూ మేలు కొల్పినాడు.

రామలక్ష్మణులు నిద్రలేచి కాల్యాలు నిర్వర్తించుకొని స్నానము చేసి ఆచమించి అర్ఘ్యము ఇచ్చి గాయత్రీ జపము చేసి ప్రాతఃకాలాహ్నికాలను అన్నిటిని ముగించుకొని ప్రయాణానికి సంసిద్ధులు అయి విశ్వామిత్రమహర్షికి నమస్కారము చేసినారు.

విశ్వామిత్రమహర్షి వెంట రామలక్ష్మణులు నడిచినారు. సరయూనది గంగానదిలో సంగమించే చోటికి పోయినారు. పరమ పావనము అయిన గంగానదిని సందర్శించినారు. ఆ అన్నదమ్ములు ఆ ప్రాంతములో ఒక పుణ్యాశ్రమపదము చూచినారు. అది అతిప్రాచీనము అయిన ఆశ్రమపదముగా వారికి

తోచింది. రాముడు మహోత్సాహముతో "మహాత్మా, ఎవరిది ఈ పుణ్యాశ్రమము. ఇక్కడ ఏ మహానుభావుడు ఉంటూఉన్నాడు." అని కుతూహలముతో ప్రశ్న చేసినాడు.

విశ్వామిత్రమహర్షి మందహాసము చేస్తూ "ఈ పుణ్యాశ్రమము ఎవరిదో చెప్పతాను. విను. శివుడు పార్వతిని పెండ్లి ఆడక పూర్వము ప్రమథగణాలతో ఇక్కడికి వచ్చినాడు. దృఢనియమముతో స్థాణువు రూపాన సమాధిలో ఉండి తపస్సు చేయసాగినాడు. అప్పుడు మన్మథుడు దుర్బుద్ధితో ఇక్కడికి వచ్చినాడు. ఆయన తపస్సు చెడగొట్టబోయినాడు. అంతట శివుడికి కోపము వచ్చింది. హుంకరించి కన్ను తెరచినాడు. రౌద్రముతో చూచినాడు. మన్మథుడి శరీరము అంతా దగ్ధము అయిపోయింది. క్షణలేశములో వాడు భస్మము అయిపోయినాడు.

"ఆ విధముగా మన్మథుడి సర్వాంగాలూ భస్మము అయిపోయినందువల్ల అప్పటి నుంచి వాడు అనంగుడు అయిపోయినాడు.

"ఈచోట మన్మథుడు తన అంగాలను అన్నిటినీ కోలుపోయినాడు కనుక ఈ ప్రాంతాన్ని అప్పటి నుంచి అంగదేశము అంటున్నారు. ఇది చాలా శ్రీమంతము అయిన దేశము.

"ఈ ఆశ్రమపదము ఆ పరమశివుడిది. ఆయన శిష్యులు తరతరాలవారూ అప్పటి నుంచి తపస్సు చేసుకొంటూ ఇక్కడనే ఉండిపోయినారు. వారు అందరూ పాపరహితులు. పరమధార్మికులు.

"ఓ రామా, ఇప్పుడు మనము ముందుగా స్నానము చేదాము. పరిశుద్ధులము అయి జపహోమాదులు ముగించుకొందాము. ఆ తరువాత ఈ పుణ్యాశ్రమములో ఈ రాత్రి గడుపుదాము. రేపు ఉదయము గంగానదిని దాటిపోదాము అన్నాడు.

విశ్వామిత్రమహర్షి ఇట్లా చెప్పతూ ఉండగా ఆస్థాణ్వాశ్రమవాసులు రామలక్ష్మణులు విశ్వామిత్రమహర్షి వెంట తమ ప్రాంతానికి వచ్చినట్టు దివ్యదృష్టితో చూచినారు. పులకాంకితులు అయినారు. పరమానందభరితులు అయినారు. వారు అందరు పోయి విశ్వామిత్రమహర్షినీ రామలక్ష్మణులను దర్శనము చేసినారు. విశ్వామిత్రమహర్షికి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి ఆతిథ్యము సమర్పించినారు. ఆ తరువాత రామలక్ష్మణులకు వారు అతిథి సత్కారాలు చేసినారు.

రామ లక్ష్మణ విశ్వామిత్రులు వారిని ఎంతో కొనియాడినారు.

ఆ ఆశ్రమవాసులతో విశ్వామిత్ర మహర్షి పుణ్యకథాప్రసంగము చేస్తూ ఉండగా మలిసంజె అయింది. అంతట వారు సమాహిత మనస్కులు అయి జప

తపాదులు చేసినారు. అసువ్రతులు ఆతరువాత రామ లక్ష్మణ విశ్వామిత్రులను తమ స్థాణ్వాశ్రమ పదానికి తీసుకొనిపోయినారు.

ఆ రాత్రి విశ్వామిత్రమహర్షి అతిమనోహరము లయిన పుణ్యకథలు చెప్పి రామలక్ష్మణులను రంజింపజేసినాడు.

ఆ రాత్రి ఆముగ్గురూ ఆ ఆశ్రమములో సుఖముగా గడిపినారు.

## ౨౪

తెల్లగా తెల్లవారింది. రామలక్ష్మణులు ప్రాతరాహ్నికాలను ముగించుకొని విశ్వామిత్ర మహర్షి వెంట ప్రయాణము అయినారు. గంగాతీరము చేరినారు. స్థాణ్వాశ్రమవాసులు వారికోసము ఒక చక్కని నావను ఏర్పాటు చేసినారు. వారు విశ్వామిత్రమహర్షితో "స్వామీ తాము సుఖముగా ఈ నావమీద ఈ రాజకుమారులతో దాటిపోవలసింది. పొద్దు ఎక్కిపోతూ ఉంది. ఆలస్యము చేయవద్దు" అని చెప్పినారు. విశ్వామిత్ర మహర్షి వారిని అందరినీ మెచ్చుకొన్నాడు. రామలక్ష్మణులున్నూ వారిని కొనియాడినారు. వారికి వీడ్కోలు చెప్పినారు. రామ లక్ష్మణ విశ్వామిత్రులు ఆ నావ ఎక్కినారు.

నావ నదీ మధ్యములోకి పోయింది. ఒక ప్రవాహము మరిఒక ప్రవాహముతో ఒరసుకొనిపోయి పెద్దపెద్ద అలలు లేచినవి. ఉరవడితో చెవులు బద్దలు అయ్యే మహాధ్వని వినిపించింది. అప్పుడు రాముడు "ఏమిటి ఈ ధ్వని" అని విశ్వామిత్రమహర్షిని ప్రశ్న చేసినాడు.

"రామా, మహాప్రశాంతముగా ప్రవహించే గంగానదిలోకి సరయూనది ఉరవడితో వచ్చిపడుతూఉంది. అందువల్ల ఇంతధ్వని అవుతూఉంది" అంటూ విశ్వామిత్రమహర్షి ఈ విధముగా చెప్ప సాగినాడు.

"రామా, పూర్వము బ్రహ్మదేవుడు కైలాస పర్వతముమీద ఒక సరస్సు ఉండవలెను అని మనసా సంకల్పించినాడు అక్కడ అప్పటికి అప్పుడు ఒక సరస్సు వెలసింది. అందువల్ల దేవతలు దానిని మానససరోవరము అన్నారు. ఆ సరస్సులో నుంచి పొంగి పార్లిన ప్రవాహమే సరయూనది. ఆసరయూనదే అయోధ్యానగరాన్ని ఆవరించి ప్రవహించి ఇక్కడికి వచ్చి ఈ గంగానదిలో పడుతూ ఉంది.

"బ్రహ్మదేవుడి మానససరోవరములోనుంచి వెలువడి ప్రవహించినందువల్ల సరయూనది పుణ్యనది అయింది. ఈ రెండు పుణ్యనదులకున్నూ మీరు నమస్కారము చేయవలెను." అన్నాడు విశ్వామిత్ర మహర్షి.

అంతట రామలక్ష్మణులు ఆ రెండు పుణ్యనదులకున్నూ భక్తి తాత్పర్యాలతో నమస్కారము చేసినారు.

వారు ముగ్గురూ ఆ నావలో గంగానది దాటి దక్షిణతీరము చేరినారు. వారు అక్కడ ఆగకుండా నడిచిపోయినారు. ఒక భయంకరారణ్యము ప్రవేశించినారు. అప్పుడు రాముడు విశ్వామిత్రమహర్షిని చూచి "మహాత్మా, ఈ అడవిలో మనుష్యులు ఎన్నడూ సంచారము చేసిన చిహ్నాలే కనపడటము లేదు. చెవులు గింగుర్లు ఎత్తేట్టు పెద్ద పెద్ద పక్షులు కూస్తూ ఉన్నవి. సింహాలూ పెద్ద పులులూ ఘోరముగా గర్జిస్తూ ఉన్నవి. ఈల పురుగులు రొదపెట్టుతూ ఉన్నవి. ఎటు చూచినా చంద్ర-ఇనుమద్ది-ఏరుమద్ది - మారేడు-తుమ్మికి - కలిగొట్టు చెట్లూ రేగు పొదలూ మొదలు అయినవి క్రిక్కిరిసిపోయి ఉన్నవి. దారి కనపడటము లేదు. ఇది మహాఘోరారణ్యముగా ఉంది. స్వామీ, ఈ భయంకరారణ్యము ఎవరిది" అని అడిగినాడు.

"రామా, ఈఘోరారణ్యము ఎవరిదో చెప్పుతాను. వినవలెను. పూర్వము ధనధాన్యసమృద్ధము అయిన మలదకరూశాలు అనే రెండు దేశాలు ఇక్కడ ఉండేవి. అవి దేవతల దేశాల మాదిరిగా వర్ధిల్లినవి. అసలు దేవతలే ఆ రెండు దేశాలనూ నిర్మించినారు."

"పూర్వము దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి సంహారము చేసినప్పుడు ఆయనకు బ్రహ్మహత్యాపాతకము పట్టుకొన్నది. ఆయన అశుచి అయినాడు. అంతే కాదు. ఆయన ఘోరము అయిన ఆకలితో బాధపడసాగినాడు. అప్పుడు ఆయనను దేవతలూ మహర్షులూ ఇక్కడికి తీసుకొనివచ్చి ఈ గంగానదిలో స్నానము చేయించినారు. కడవలు-కడవలు గంగా జలాలను మంత్రపూతము చేసి ఆయన తలమీద కుమ్మరించినారు. అంతటితో ఆయన బ్రహ్మహత్యాపాతకము ఇక్కడ క్షాళనము అయిపోయింది. అశుచీ అత్యాకలీ మాయము అయిపోయినవి. దేవేంద్రుడు సంతోషించినాడు.

"ఇక్కడ ఈ ప్రదేశములో నా మలము పోయింది కనుక మలదము అనీ నా కారూశముపోయింది. కనుక కరూశము అనీ ఈ ప్రాంతము రెండు దేశాలుగా ప్రసిద్ధి కెక్కవలెను" అన్నాడు దేవేంద్రుడు. అందుకు దేవతలున్నూ మహర్షులున్నూ సంతోషముతో అంగీకరించి ఇక్కడ రెండు దేశాలను నిర్మించినారు. అంతటనుంచీ మలదకరూశాలు అనే రెండు దేశాలున్నూ సకల ధన ధాన్య సమృద్ధముగామా సర్వ సంపన్నముగానూ ఇక్కడ విలసిల్లుతూ ఉండేవి.

"అంతట కొంతకాలానికి ఈ దేశాలలో తాటక అనే ఒక రాక్షసి విజృంభించింది. అది యక్షిణి. కామరూపిణి. అదిపుట్టడమే వెయ్యి ఏనుగుల బలముతో పుట్టింది. సుందుడు అనే వాణ్ణి పెండ్లి ఆడింది. మారీచుడు అనేవాణ్ణి కన్నది. వాడు ఇంద్రుడు అంతటి పరాక్రమవంతుడు. విశాలము అయిన ముఖముతోనూ సుంద్రిడము అయిన చేతులతో మహాదార్ఢ్యము అయిన శరీరముతోనూ తిరుగుతూ ఉండేవాడు. వాడున్నూ రాక్షసుడు అయిపోయినాడు. ప్రజలను బాధిస్తూ మహాభయంకరుడున్నూ అయిపోయినాడు

"దుష్టచారిణి అయిపోయిన తాటక ఇక్కడికి ఒకటిన్నర యోజనాల దూరములో ఉంటూ ఉంది. అది దార్లుకొట్టి బ్రతుకుతున్నది. మలదకరూశ దేశాలను రెంటినీ నాశనము చేసివేసింది.

"ఓరామా, ఆయక్షిణివల్ల ఈ రెండు దేశాలూ నిర్జనము అయిపోయినవి. మహారణ్యాలు అయిపోయినవి. ఆ తాటక ఈ ప్రాంతానికివచ్చే ఏ ఒక్కణ్ణీ బ్రతక నీయకుండానూ ఏ ఒక్కడికీ చిక్కకుండానూ తిరుగుతూ ఉంది. రామా నేను ఆజ్ఞాపిస్తున్నాను. నీవు ఆ తాటకను చంపివేయవలెను. ఈ ప్రాంతానికి హానిపీడ విరగడ అయిపోవలెను. నిరుపద్రవము అయినదేశముగా ఈ ప్రదేశాన్ని నీవు మార్చివేయవలెను" అన్నాడు విశ్వామిత్ర మహర్షి.

౨౫

విశ్వామిత్ర మహర్షి అంతటివాడు స్త్రీ వధము చేయవలెను అని ఆజ్ఞాపించినాడు. అందుకు రాముడు అణకువతో "మునిపుంగవా, యక్షులు అల్పవీర్యులు అని చెప్పగా విన్నాను. అందులో తాటక ఆడుది. అబల. ఆమెకు వెయ్యి ఏనుగుల బలము ఎట్లావచ్చింది" అని అడిగినాడు.

విశ్వామిత్ర మహర్షి "రామా, దానికి అంతబలము ఎట్లావచ్చిందీ చెప్తాను. విను.

"పూర్వము సుకేతుడు అనే యక్షుడు ఒకడు ఉండేవాడు. వాడు మహాపరాక్రమవంతుడు. సదాచారసంపన్నుడు. కాని సంతానము లేకపోయింది. అందుకు వాడు గొప్ప తపస్సు చేసినాడు. బ్రహ్మదేవుడు వాడితపస్సు మెచ్చుకొన్నాడు. వెయ్యి ఏనుగుల బలముతో ఒక కన్యారత్నము పుట్టేటట్టు వరము ఇచ్చినాడు. కాని పుత్ర సంతానానికి వరము ఇవ్వలేదు.

"ఆ యక్షుడికి తాటక పుట్టింది. అది పెరిగి పెద్దది అయింది. అబల అయినప్పటికిన్నీ బ్రహ్మానుగ్రహమువల్ల వెయ్యి ఏనుగులబలముకలది అయింది. మంచి

రూపసి అయింది. అందానికి పేరుపడ్డది. ఆ యక్షుడు దానిని సుందుడు అనే వాడికి ఇచ్చి పెండ్లిచేసినాడు. కొంతకాలానికి తాటక మారీచుణ్ణికన్నది. వాడు ఎవరూ ఎదిరించలేనంతటి పరాక్రమవంతుడు అయినాడు.

"అగస్త్యమహర్షి శాపమువల్ల సుందుడు చచ్చిపోయినాడు. పెనిమిటిని చంపివేసినాడు అనే కోపముతో తాటక రేగింది. మారీచుణ్ణితీసుకొని అగస్త్యుడు మీదికిపోయింది. పెద్దపెద్ద కేకలు పెడుతూ అతిఉరవడిగా ఆయనమీదికి పరుగు లెత్తింది. ఆయనను మ్రింగివేయ నుంకించింది. తనపయిన పడబోతున్న తాటకనూ మారీచుణ్ణి అగస్త్యమహర్షి చూచినాడు. "నీవు రాక్షసుడవు అయిపో" అంటూ ముందుగా మారీచుణ్ణి శపించినాడు.

"మారీచుణ్ణి శపించినప్పటికిన్నీ తాటక సంరంభము ఏమీ తగ్గలేదు. అగస్త్యమహర్షి అప్పుడు పరమక్రుద్ధుడు అయినాడు. "ఓ తాటకా నీరూపము మారిపోయి వికృతాననముతో వికారాకారముతో నరమాంసభక్షణముచేస్తూ మహారాక్షసివిగా తిరుగుతూ ఉండు" అని శాపము పెట్టినాడు. ఆ శాపానికి దానికి మరింతకోపము వచ్చింది. అయితే అది అగస్త్యమహర్షిని ఏమీ చేయలేక పోయింది. కాని ఆయన సంచరించినాడు అనే కసితో సుభిక్షముగా ఉంటూ ఉన్న మలదకరూశదేశాలను రెంటినీ నాశనముచేసి వేయసాగింది. ఆ విధముగా ఈప్రదేశము ఘోరారణ్యము అయిపోయింది.

"ఓ రామా, ఆ యక్షిణి దుర్వృత్త. మహాభయంకరురాలు. దౌష్ట్యానికి పరాక్రమవంతురాలు. నీవు గోబ్రాహ్మణ హితముకోసము ఆ మహాయక్షిణిని చంపివేయవలెను. ఆ శాపగ్రస్తను ఆ రాక్షసిని చంపివేయడానికి నీవు తప్ప మరి ఎవడూ ధైర్యముచేసేవాడు ముల్లోకాలలోనూ లేడు. స్త్రీవధముఅసహ్యము అయిన పని అని నీవు అనుకోవద్దు. నాల్గుకులాలవారికీ మేలుచేయడమే రాజ్యకార్యధురంధరుల కర్తవ్యము. ప్రజారక్షణమే రాజధర్మము. రాజ్యభార నియుక్తులు అయినవారు ప్రజా రక్షణానికి అవసరము అయిన ఏపనిని అయినా చేసితీరవలెను. క్రూరము అనీ పాతకము అనీ, దోషము అనీ సంశయించ కూడదు. ఇది సనాతన రాజధర్మము.

"ఈ తాటక ధర్మమార్గము తప్పింది. అధర్మమార్గము పట్టింది. ఓ రామా, నీవు అధర్మాన్ని నాశనము చేసివేసి ధర్మాన్ని ప్రతిష్ఠచేయవలెను. పూర్వము విరోచనుడి కూతురు మంధర అనే ఆమె ఈ పృథివిని అంతా నాశనముచేయ తలపెట్టింది. దేవేంద్రుడు అంతటివాడు అందుకు ఆమెను చంపివేసినాడు. భృగుమహర్షి ఇల్లాలు- శుక్రుడి అంతటివాడితల్లి ఈ లోకములో ఇంద్రుణ్ణి

లేకుండా చేయడానికి దృఢవ్రత అయింది. అప్పుడు మహావిష్ణువే ఆమెను సంహారము చేసివేసినాడు. వీరే కాదు. ఇంకా ఎందరో మహాత్ములు అధర్మ పరాయణలు అయిన స్త్రీలను హతమార్చివేసినారు." అన్నాడు.

## ౨౬

ఈవిధముగా విశ్వామిత్రమహర్షి స్త్రీని వధించమని చెప్పింది అంతా రాముడు విన్నాడు. ఆలోచన చేయసాగినాడు. "విశ్వామిత్రమహర్షి చెప్పినట్టుగా చేయమని నాతండ్రి నన్ను ఆజ్ఞాపించినాడు. కాబట్టి విశ్వామిత్రమహర్షి చెప్పినట్టు అవిశంకముగా చేయటమే నావిధి" అని మనసా నిశ్చయించుకొన్నాడు.

విశ్వామిత్ర మహర్షిని చూచి "స్వామీ, అయోధ్యానగరములో గురువుల ఎదుట నా తండ్రి దశరథమహారాజు తాము ఏమి చెప్పినా నేను చేయవలెను అని ఆజ్ఞాపించినాడు. ఆయన ఆజ్ఞను నేను అవజ్ఞ చేయను. పితృవాక్య పరిపాలనమే నా వ్రతము. తాము బ్రహ్మర్షులు. మహాప్రభావము కలవారు. తాటక వధము ఉత్తమము అని తాము శాసిస్తున్నారు. కాబట్టి గోబ్రాహ్మణ హితము కోసమూ ఈ దేశసౌఖ్యము కోసమూ ఏ సంశయమూ లేకుండా తాటకను వధిస్తాను. మహానుభావులు తాము ఆజ్ఞాపించిన ఈ కార్యాన్ని ఇప్పుడే నిర్వహిస్తాను" అంటూ తన వింటి నడుము పిడికిటతో పట్టుకొని దశదిశలూ మారు మ్రోగిపోయేట్టు టంకారము చేసినాడు.

ఆ మహాధ్వనికి ఆమహారణ్యములో ఉన్న ప్రాణికోటులు అన్నీ ఉలిక్కిపడిపోయినవి. తాటక దిగ్భ్రమ చెందింది. క్షణలేశము ఆలోచించింది. క్రోధపరవశ అయింది. ఆ మహాధ్వని వినిపించిన దిక్కు కుపరుగుతీసింది. వికారాకారముతో వికృతాననముతో పరుగులెత్తుకొంటూ వస్తూఉన్న తాటిచెట్టు అంతటి తాటకను రాముడు చూచినాడు. తమ్ముడితో "లక్ష్మణా, తాటక భైరవాకారమూ వికృతాకారము చూస్తూ ఉన్నావా? దీనిని చూస్తే అంతంతమాత్రపు ధైర్యవంతులు గుండెలు బ్రద్దలు అయి చచ్చిపోతారు. దీనిని ఎవరూ ఎదిరించలేరు. దీనికి మాయాబలముఉంది. దీని ముక్కూ చెవులూ ఇప్పుడే తెగవేస్తాను. చూడు. ఇంతకూ ఇది ఆడుది. దీనినిచంపివేయ బుద్ధిపుట్టడములేదు. దీని చేతులూ కాళ్లూ విరగకొట్టితే చాలుననుకొంటున్నాను" అని అంటూఉండగానే తాటక చెలరేగి చేతులు ఎత్తి గర్జిస్తూ రాముడిమీద పడబోయింది.

అప్పుడు విశ్వామిత్రమహర్షి హుంకరించి దానిని అదలించినాడు. రామలక్ష్మణులు క్షేమముగా ఉండవలెను అనీ వారికి జయము చేకూరవలెను అనీ ఆశీర్వదించినాడు.

తాటక ఘోరముగా దుమ్ము ఎగజిమ్ముతూ ఆ ప్రదేశము అంతా అంధకారబంధురము అయ్యేట్టు చేసివేసింది. ఆదుమారములో రామలక్ష్మణులు ఒక ముహూర్తముసేపు ఏమీ తెలియకుండా సొమ్మసిల్లిపోయినారు. అంతట అది కంటికి కనబడకుండా మాయము అయిపోయి వారిమీద రాళ్లవాన కురిపించడము మొదలుపెట్టింది. రాముడికి కోపము వచ్చింది. తాటకమీద బాణాలు వదిలి అది రాళ్ళవాన కురిపించకుండా చేసినాడు. అదికనబడ్డది. రాముడిమీదికి దూక నుంకించింది. తత్ క్షణమే రాముడు దాని రెండు బాహువులూ తెగవేసినాడు. బుజాలు తెగిపోయి అది రొప్పుతూ కేకలుపెట్టుతూ కిందపడిపోయింది. వెంటనే లక్ష్మణుడు దాని రెండు చెవులూ ముక్కూ అంటకోసినాడు.

ఆ తాటక కామరూపిణి. అప్పటికి అప్పుడు అది అనేక రూపాలతో కనబడుతూ కనబడుతూ మాయము అయిపోతూ మహాభయంకరముగా మళ్ళీ రాళ్లవానకురిపించసాగింది. రాళ్ళవానలో రామలక్ష్మణులు చిక్కుకొనిపోయినారు. విశ్వామిత్రమహర్షి వారినిచూచి "ఓరామా, ఆడుది అనే దాక్షిణ్యము నీవు ఇక చాలించవలెను. ఈ యక్షిణి దుష్టచారిణి. పరమపాపి. యజ్ఞహంత్రిణి. దీనిని నీవు వెంటనే తెగవేయవలెను. సంధ్యాకాలము సమీపిస్తూ ఉంది. ఇక దీని మాయలు పెచ్చుపెరిగిపోతవి. సూర్యాస్తమయము అయిన తరువాత దీనిని నీవు ఎదిరించలేవు. ఈ లోపలనే నీవు దీనిని సంహారము చేయవలెను" అన్నాడు.

అప్పుడు తాటక ఎక్కడ ఉన్నదీ శబ్దవేధిత్వజ్ఞానముతో రాముడు కనిపెట్టినాడు. దానిమీద బాణాలు వదిలినాడు. దానికి ఎంతో మాయాబలము ఉన్నప్పటికిన్నీ అది ఆ బాణాలకు కట్టుబడిపోయింది. పెద్దపెద్ద కేకలు పెట్టుతూ అది అమితపరాక్రమముతో పిడుగుమాదిరిగా రామలక్ష్మణులమీద పడబోయింది. రాముడు దానిని చూచినాడు. దాని ఎదురురొమ్ములమీద ఒక బాణము వదిలినాడు. అంతటితో అది కిందపడ్డది. చచ్చిపోయింది.

చచ్చిపోయిన ఆ భైరవాకారను దేవేంద్రుడూ దేవతలూ చూడవచ్చినారు. "భళేభళే" అని రాముణ్ణి మెచ్చుకొన్నారు. అప్పుడు దేవేంద్రుడు విశ్వామిత్రమహర్షిని చూచి "ఓ బ్రహ్మర్షీ, నీవు ఈ తాటకను చంపించినందుకు మేము అందరమూ సంతోషిస్తూఉన్నాము. భృశాశ్వుడి సంతతిఅయిన అస్త్రశస్త్రాలను అన్నిటినీ నీవు ఆర్జించినావు. నీ తపోబలమువల్ల అవి అన్నీ

నీదగ్గర వర్ధిల్లుతూ ఉన్నవి. ఈ రాముడు అమితధైర్యముతో నిన్ను అనుసరించి ప్రవర్తిస్తున్నాడు. శస్త్రాస్త్ర విద్యలను అభ్యసించటానికి తగినవాడు. ఇతడు దేవతలకు ఒక మహాత్కార్యము నెరవేర్చవలసి ఉంది, ఆయా శస్త్రాస్త్రాలను అన్నిటినీ నీవు ఈ రాముడికి ఉపదేశము చేయవలెను" అని చెప్పినాడు. అంతట మహర్షులూ దేవతలూ దేవేంద్రుడూ విశ్వామిత్రమహర్షిని కొనియాడి వారి దారిన వారు వెళ్ళిపోయినారు.

సంధ్యాకాలము కాబోతూ ఉంది. విశ్వామిత్రమహర్షి సంతోషముతో రాముణ్ణి దగ్గరకు తీసుకొని శిరము ఆఘ్రాణించి "రామా, మనము ఈ రాత్రి ఇక్కడనే ఉందాము. రేపువనే లేచి మన ఆశ్రమానికి పోదాము" అన్నాడు. అంతటితో ఆ మహారణ్యములో ఉపద్రవము అంతా తొలగిపోయింది.

అది కుబేరుడి చైత్రరథమువంటి ఉద్యానవనముగా మారిపోయింది.

౨౭

ఆ రాత్రి రామలక్ష్మణ విశ్వామిత్రులు అక్కడ గడిపినారు. ప్రాతఃకాలాన వారివారి విహితానుష్ఠానాలను ముగించుకొన్నారు. విశ్వామిత్ర మహర్షి రాముణ్ణి చూచి మందహాసము చేస్తూ మాధుర్యము ఉట్టిపడే వాక్కులతో "రామా, నీ పరాక్రమానికి నేను సంతుష్టుడను అయినాను. సర్వాస్త్రాలనూ సంతోషముగా నీకు ఇప్పుడు స్వాధీనము చేయతలచినాను. ఈ అస్త్రాల బలమువల్ల దేవాసురగణాలు అన్నీ నీకు లోబడిపోతవి. వారినే కాకుండా మరి ఏ ఇతర శత్రువులను అయినా నీవు జయించ కలుగుతావు"

"రామా, ఆయా అస్త్రాలను అన్నిటినీ ఉపదేశము చేస్తాను. నీకు ముందుగా దండచక్రాన్ని ఇస్తాను. అది చాలా గొప్పది. ధర్మచక్రాన్నీ కాలచక్రాన్నీ అత్యుగ్రముఅయిన విష్ణుచక్రాన్నీ ఐంద్రాస్త్రాన్నీ వజ్రాస్త్రాన్నీ శివదేవతాకము అయిన శూలాన్నీ బ్రహ్మశిరాస్త్రాన్నీ ఐషీకాస్త్రాన్నీ బ్రహ్మాస్త్రాన్నీ ఇస్తాను. బ్రహ్మాస్త్రముకన్నా ఉత్తమము అయింది మరిఒకటి లేదు.

"మోదకీ శిఖరీ అనే రెండు గదలు ఉన్నవి. అవిరెండూ దీప్తిమంతాలు. వాటిని నీకు ఇస్తాను. ధర్మపాశాన్నీ కాలపాశాన్నీ వరుణపాశాన్నీ నీకు ఇస్తాను. వరుణపాశముకన్నా ఉత్తమముఅయింది మరిఒకటి లేదు. శుష్కాశని ఆర్ద్రాశని అనే పిడుగులనూ పైనాకాస్త్రాన్నీ నారాయణాస్త్రాన్నీ అగ్నిదేవుడికి ప్రియముఅయిన ఆగ్నేయాస్త్రాన్నీ ప్రథనము అనే వాయవ్యాస్త్రాన్నీ

హయశిరాస్త్రాన్నీ క్రౌంచాస్త్రాన్నీ విష్ణుశక్తి రుద్రశక్తి అనే రెండు శక్తులనూ ఇస్తాను.

"రాక్షసులు ధరించే కంకాళకపాలాలు అనే ముసలాలనూ వైద్యాధరాస్త్రాన్నీ గంధర్వులు మెచ్చుకొనే మానవాస్త్రాన్నీ నిద్రకలగచేసే స్వాపనాస్త్రాన్నీ శాంతి కలుగచేసే ప్రశమనాస్త్రాన్నీ సౌరాస్త్రాన్నీ గర్వము కలుగజేసే దర్పణాస్త్రాన్నీ శోషిల్లచేసే శోషణాస్త్రాన్నీ తాపము ఎత్తించే సంతాపనాస్త్రాన్నీ విడిపించే విలాపనాస్త్రాన్నీ ఎవరూ ఎదిరించలేని మదనాస్త్రాన్నీ పిశాచక దేవతాకము అయిన మోహనాస్త్రాన్నీ తామసమూ సౌమనమూ సంవర్ధనమూ దుర్ధర్షమూ మౌసలమూ సత్యమూ మాయాధరమూ తేజఃప్రభమూ శిశిరమూ సుదామనమూ దారుణము అయిన భగాస్త్రమూ మానవాస్త్రమూ ఇస్తాను.

"ఓ రామా, ఈఅస్త్రాలుఅన్నీ ఇచ్ఛాదీన రూపాలు. మహాబలయుతాలు. ఈ ప్రపంచములో మిగతా అన్ని అస్త్రాలనూ ఇవి అతిశయించినవి. వీటిని-అన్నింటనీ నీకు ఇప్పుడే ఉపదేశము చేస్తాను." అంటూ శుచి అయి ప్రాఙ్ముఖుడు ఆయి నిలుచుని అస్త్రమంత్రసమూహాన్ని రాముడికి ఉపదేశము చేసినాడు. ఆమంత్ర దేవతలను అందరినీ అప్పుడే రాముడి వశము చేయతలచి జపము చేయడము మొదలుపెట్టినాడు. అంతట మహార్హాలు అయిన అస్త్రాలు అన్నీ రాముడికి స్వాధీనము అయినవి. అయా అస్త్రాల దేవతలు అందరూ రాముడి ఎట్టఎదుట నిలుచున్నారు. నమస్కారము చేసి "ఓ రామప్రభూ, మేము అందరమూ మీ కింకరులము" అన్నారు.

అప్పుడు రాముడు ఆదేవతలను అందరినీ తన చేతులతో తట్టి "మీరు అందరూ నా చిత్తాన్ని అనుసరించి నడుచుకోవలెను. అవసరము వచ్చినప్పుడు మిమ్ములను పిలుస్తాను. ఇప్పుడు మీ ఇష్టము వచ్చిన చోప్పున ఉండవచ్చును" అన్నాడు.

అప్పుడు ఆయా అస్త్రదేవతలు అందరూ అంతర్ధానము అయిపోయినారు. అంతట రాముడు విశ్వామిత్రమహర్షికి సాష్టాంగ నమస్కారము చేసినాడు.

## ౨౮

ప్రయాణము కాబోతున్న విశ్వామిత్రమహర్షిని రాముడుచూచి "స్వామీ తాము సాక్షాత్తూ భగవంతుడు వంటివారు. సమస్త అస్త్రాలను నాకు అనుగ్రహించినారు. ఇకను దేవతలు అయినా నన్ను ఎదుర్కొనలేరు. తాము ఆయా అస్త్రాల ఉపసంహారాలనుకూడా నాకు ఉపదేశము చేయవలెను" అన్నాడు.

విశ్వామిత్రమహర్షి ఆయా ఉపసంహారమంత్రాలను అప్పుడే రాముడికి ఉపదేశము చేయనిశ్చయించుకొన్నాడు. "రామా, సత్యవంతమూ సత్యకీర్తిధృష్టమూ రభసమూ ప్రతీహారతరమూ పరాఙ్ముఖమూ లక్ష్యాక్షమూ విషయమూ దృఢలాభమూ సునాభయూ దశాక్షమూ శతవక్త్రమూ దశశీర్షమూ శతోదరమూ పద్మనాభమూ మహానాభమూ దుందునాభమూ సునాభకమూ జ్యోతిషమూ కృశనమూ నైరాశ్యమూ విమలమూ యోగంధవమూ హరిద్రమూ యోగంధరమూ దైత్యమూ ప్రశమనమూ సార్చిర్మాలినీ ధృతిమాలినీ వృత్తిమంతమూ రుచిరమూ పితృసౌమసమూ విధూతమూ మకరమూ కరవీరకమూ ధనమూ ధాన్యమూ కామరూపమూ కామరుచీ మోహమూ ఆవరణమూ జృంభకమూ సర్వనాభమూ సంతానమూ వీరణమూ అనేవి అన్నీ భృశాశ్వుడిపుత్రులు. ఇవి అన్నీ ఇచ్ఛాధీన రూపాలు. వీటిని అన్నిటినీ దానము చేస్తాను." అంటూ విశ్వామిత్రమహర్షి ఆయా ఉపసంహారమంత్రాలను రాముడికి ఉపదేశము చేసినాడు.

రాముడు పరమసంతోషముతో ఆ ఉపసంహారమంత్రాలను అన్నిటినీ జపము చేయసాగినాడు. అప్పుడు ఆ మంత్రాధిష్ఠాన దేవతలు అందరూ దేదీప్యమానదివ్యదేహాలతో రాముడి ఎదుట నిలుచున్నారు. వారిలో కొందరు నిప్పుకణికలవలెనూ మరికొందరు ధూమసమూహాలవలెనూ ఇంకా కొందరు సూర్యచంద్రులు అంతటి కాంతిమంతులవలెనూ కనుపించినారు. అందరూ నమ్రభావముతో నమస్కరించినారు. "రామప్రభూ, మమ్ములను తాము స్మరించినారు. వచ్చినాము. ఏమి ఆజ్ఞ" అన్నారు.

"ఓ మంత్రాధిదేవతలారా, మిమ్ములను పిలిచినప్పుడు మీరు అందరూ వచ్చి నాకు సాయపడవలెను. ఇప్పుడు మీరు మీ చిత్తమువచ్చిన చోటను ఉండవచ్చును." అన్నాడు రాముడు. ఆ మంత్రాధిష్ఠాన దేవతలు అందరూ రాముడికి వీడుకోలు చెప్పి మాయము అయిపోయినారు.

ఆ తరువాత రామలక్ష్మణులు విశ్వామిత్రమహర్షి వెంట ప్రయాణము అయినారు. కొంతదూరము నడిచినతరువాత వారు ఒక పర్వతప్రదేశానికిపోయినారు. ఆసమీపములో రామలక్ష్మణులకు ఒకసుందరోద్యానవనము కనిపించింది. అప్పుడు రాముడు విశ్వామిత్ర మహర్షితో "స్వామీ, ఒళ్లు జలదరించే మహారణ్యము దాటివచ్చినాము. ఇది ఏదో ఉద్యానవనము. దర్శనీయముగా ఉంది. వృక్షసమూహాలు మేఘాల మాదిరిగా కనిపిస్తూఉన్నవి. జింకలు అటూ ఇటూ పరుగులెత్తుతున్నవి. రంగురంగుల పిట్టలు మహాశ్రావ్యముగా పాటలు పాడుతూ

ఉన్నవి. ఇది ఏదో పుణ్యాశ్రమము అయి ఉండవలెను. తెలుసుకోవలెను అని కుతూహలముగా ఉంది" అన్నాడు.

౨౯

అంతట విశ్వామిత్ర మహర్షి ఈవిధముగా చెప్పడము మొదలు పెట్టినాడు.

"దేవదేవుడు మహావిష్ణువు తపస్సిద్ధికోసమున్నూ అష్టాంగయోగసిద్ధికోసమున్నూ అనేక వేలసంవత్సరాలు ఎన్నోయుగాలు ఈప్రదేశములో నివసించినాడు. ఆ మహావిష్ణువు వామనావతారము ఎత్తి దేవకార్యము చక్కబెట్టిన తరువాతనున్నూ నివసించడానికి ఇక్కడికే వచ్చినాడు. కాశ్యపుడున్నూ ఇక్కడనే తపస్సిద్ధుడు అయినాడు; అందువల్ల ఇది సిద్ధాశ్రమము అని ప్రసిద్ధికెక్కింది.

"మహావిష్ణువు ఇక్కడ తపస్సు చేసుకొంటూ ఉన్నకాలములో దేవేంద్రుణ్ణి దేవగణాలతోనూ, మరుద్గణాలతోనూ బలిచక్రవర్తి జయించివేసి ముల్లోకాలు రాజ్యపాలనము చేయసాగినాడు. ఆ బలిచక్రవర్తి ఒక మహాయజ్ఞము ఆరంభించినాడు. అంతట దేవతలు అందరూ అగ్నిహోత్రుడి వెనుక బయలు దేరి ఇక్కడికి వచ్చి మహావిష్ణువును సందర్శించి "ఓ ప్రభూ, విరోచనుడి కొడుకు బలిచక్రవర్తి ఇప్పుడుఉత్తమోత్తమముఅయినయజ్ఞము చేస్తూ ఉన్నాడు. దారినపోయే ఏ యాచకుడువచ్చి ఏది అడిగినా లేదు అనకుండా దానము చేసి వేస్తున్నాడు. ఆయజ్ఞము పూర్తి అయ్యేలోపలనే తాము దేవకార్యము చక్కబెట్టవలెను. తాము తమ మాయాబలముతో వామనరూపము ఎత్తి పోయి ముల్లోకాలనూ దానము అడిగి పుచ్చుకొని తిరిగీ దేవతలకు పట్టము కట్టవలెను" అని ప్రార్థించినారు.

విష్ణుమూర్తి వారి ప్రార్థనను అంగీకరించినాడు.

"రామా, ఆకాలములోనే అగ్నిహోత్రుడువంటి కాంతిమంతుడు కాశ్యపుడు అదితితో కూడా మహావిష్ణువును గురించి తపస్సుచేయడము మొదలు పెట్టినాడు. గతకల్మషుడు అయినాడు. దివ్య తేజముతో తేజరిల్లుతూఉన్న ఆ కాశ్యపుడికి విష్ణుమూర్తి ప్రత్యక్షము అయినాడు.

"ఓ పురుషోత్తమా, నీవు తపోమయుడవు. తపోరాశివి. తపోమూర్తివి. తపస్సే నీ ఆత్మ. మేము తపస్సు చేసినందువల్లనే నిన్ను ఇపుడు చూడగలుగుతున్నాము. ప్రభూ! నీ శరీరములో ఈ జగత్తుఅంతా మాకు కనబడుతూఉంది.

నీవు ఆదిమధ్యాంతరహితుడవు. అనిర్దేశ్యుడవు. క్షేమము నీ శరణుజొచ్చినాము. మమ్ములను నీవు కాపాడవలెను." అంటూ కాశ్యపుడు స్తోత్రము చేసినాడు. మహావిష్ణువు సంతోషించి "ఓ కాశ్యపా, నీకు శుభము అవుతుంది. నేను వరము ఇవ్వడానికి నీవు తగినవాడవు. నీకు కావలసిన వరము అడుగు ఇస్తాను" అన్నాడు.

"ఓ వరదా నిన్ను దేవతలు అందరూ యాచించినారు. ఇప్పుడు ఈఅదితీ నేనూ యాచిస్తున్నాము. దేవతలు అందరూ శోకార్తులు అయిఉన్నారు. వారికి నీవు తోడ్పడవలెను. ఇందరమూ యాచిస్తున్న వరము నీవుసంతోషముగా ఇవ్వవలెను.

"ఓ స్వామీ, ఈ అదితికి నీవు పుత్రుడవుగా పుట్టి ఇంద్రుడికి తమ్ముడవు అయి రాక్షసులను నిర్మూలనము చేయవలెను. ఓ ప్రభూ, నీవు ఇక్కడనుంచి లేవవలెను" అని కాశ్యపుడు ప్రార్థించినాడు. అందుకు మహావిష్ణువు అంగీకరించినాడు. అంతట కాశ్యపుడు "ఓ దేవా, నీ అనుగ్రహమువల్ల నా తపస్సు ఇక్కడ సిద్ధించింది. కాబట్టి ఈ ప్రదేశము సిద్ధాశ్రమము అని ప్రసిద్ధి కెక్కవలెను" అన్నాడు. అందుకున్నూ మహావిష్ణువు 'సరేను' అన్నాడు.

"ఓ రామా, అటుతరువాత ఆ మహాతేజోవంతుడు విష్ణుమూర్తి అదితి కడుపున పుట్టినాడు. వామనరూపముతో వటువుగా బలిచక్రవర్తి దగ్గరకుపోయినాడు. సమస్త ప్రాణులకున్నూ మేలు చేయతలచి నిరభిమానముతో మూడు అడుగుల మేరను భిక్షను అడిగి పుచ్చుకొన్నాడు. మూడు అడుగులూ వేసి ముల్లోకాలూ ఆక్రమించినాడు. తన తేజస్సుతో బలిచక్రవర్తిని బంధించి వేసినాడు. అంతట దేవేంద్రుడికి ఆ ముల్లోకాలనూ ఒప్పగించినాడు. వామనరూపములో ఉన్న మహావిష్ణువు ఈ ఆశ్రమప్రదేశము శ్రమనాశని అయినందువల్ల ఇక్కడికి వచ్చి నివసించినాడు".

"ఇప్పుడు నేనూ భక్తి తాత్పర్యాలతో ఈ ఆశ్రమములో నివాసము పెట్టుకొన్నాను. ఓరామా, ఈ ఆశ్రమపదానికే రాక్షసులు వచ్చి నా యజ్ఞాన్ని విఘ్నము చేస్తూఉన్నారు. ఈచోటనే వాండ్లను సంహారము చేయవలెను. ఇప్పుడే ఈ సిద్ధాశ్రమములోకి పోదాము. నాయనా, రామా, ఈ ఆశ్రమపదము నాది అయినట్టే నీదీన్నీ" అంటూ విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులను వెంట బెట్టుకొని ఆ ఆశ్రమపదములో అడుగు పెట్టినాడు. మంచు విడిపోయినతరువాత పునర్వసూ నక్షత్రాలలో సంచారము చేసే చంద్రుడికిమల్లె విశ్వామిత్రమహర్షి అప్పుడు విరాజిల్లినాడు.

సిద్ధాశ్రమవాసులు అందరూ ఆయనను చూచినారు. చూచే చూడటముతో పరుగులెత్తుకొంటూ ఆయనకు ఎదురుగుండావచ్చి యథార్హముగా ఆయనకు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చినారు. పూజచేసినారు. రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేసినారు.

రామలక్ష్మణులు అలసట తీర్చుకొన్నారు. అప్పుడు అక్కడ పెద్దపులి మాదిరిగా ఉన్న విశ్వామిత్రమహర్షిని చూచినారు. నమస్కారముచేసి "ఓ బ్రహ్మర్షీ, తాము ఇప్పుడే ఈనాడే యజ్ఞదీక్షవహించవలెను. ఇది సిద్ధాశ్రమము అని తాము సెలవు ఇచ్చినారు; సార్థకనామము అయితీరుతుంది" అన్నారు.

అంతట ఆ మహాతేజోవంతుడు ఆ జితేంద్రియుడు విశ్వామిత్రమహర్షి యజ్ఞదీక్షితుడు అయినాడు.

ఆరాత్రి రామలక్ష్మణులు స్కందవిశాఖులవలె జాగరూకతతో గడిపినారు. వేకువనే లేచి స్నానముచేసి పరిశుద్ధులు అయి ప్రాతఃసంధ్యను ఉపాసించి గాయత్రీజపముచేసి హుతాగ్నిహోత్రుడు అయి కూర్చునిఉన్న విశ్వామిత్రమహర్షిని సందర్శించినారు. ఆయనకు నమస్కారము చేసినారు.

## 30

రామలక్ష్మణులు కేవలమూ శత్రుసంహారకులే కారు. ఎక్కడ ఎప్పుడు ఎవరితో ఏమి మాట్లాడవలెనో తెలిసినవారు. విశ్వామిత్రమహర్షి యజ్ఞదీక్షలో ఉన్నాడు. ఆయనను అప్పుడు పలుకరించకూడదు అనుకొన్నారు. అక్కడి మహర్షులను అందరినీ చూచి "మహాత్ములారా, రాక్షసులు ఎప్పుడు వస్తారు. మేము వాండ్లకోసము ఎప్పుడు కనిపెట్టుకొని ఉండవలెను" అని రాముడు ప్రశ్నించినాడు.

ఆ అన్నతమ్ములు అప్పటికి అప్పుడే పోరాటానికి సంసిద్ధులు అవుతూ ఉన్నందుకు ఆమహామునులు అందరూ మెచ్చుకొన్నారు. "ఓ సోదరులారా రాక్షసులు ఏ క్షణములోనైనా రావచ్చు. కాబట్టి మీరు ఈ రోజు మొదలుకొని ఆరు అహోరాత్రములు కనిపెట్టుకొని ఉండవలెను" అన్నారు.

అంతట రామలక్ష్మణులు ధనుర్ధరులు అయినారు. అయిదు అహోరాత్రములూ నిద్రపోకుండా వారు విశ్వామిత్రమహర్షినీ ఆ తపోవనాన్నీ కావలికాసినారు. ఆరవ పగలు వచ్చింది.

విశ్వామిత్రమహర్షి యజ్ఞము యథాప్రకారము సమంత్రకముగా సశాస్త్రీయముగా సాగుతూవుంది. ఋత్విజులు మొదలు అయినవారు అందరూ వారివారి పనులను నెరవేరుస్తూ ఉన్నారు.

రాముడు లక్ష్మణుడితో "తమ్ముడా ఏకాగ్రచిత్తముతో నీవు సన్నద్ధుడవు అయి ఉండవలెను" అంటున్నాడు.

ఇంతలో ఆకాశము బ్రద్దలు అయిపోయేటంత భయంకరము అయిన ధ్వని అయింది. దర్భలూ పానపాత్రలూ హోమపాత్రలూ సమిధలూ పూలూ అన్నీ ఒక్కసారిగా అంటుకొన్నవి. భగ భగమంటలు లేచినవి.

వర్షాకాల మేఘాలమాదిరిగా ఆకాశాన్ని అంతా మాయమబ్బులతో మారీచ సుబాహువులు కమ్మివేసినారు. ఆమాయమబ్బులు అమిత వేగముతో పరుగులెత్త సాగినవి. అప్పుడు మారీచసుబాహువులు వెల్లువగా నెత్తురు కురిపించసాగినారు. ఆ రక్తప్రవాహము వేదికమీద పడిపోతున్నది. అప్పుడు మరింతగా మంటలు లేచినవి.

ఆకాశములో తిరుగుతూ ఉన్న రాక్షసులను రాముడు చూచినాడు. మారీచసుబాహువులు ఆ అన్నతమ్ములమీద దూకబోతున్నారు. రాముడు పరమ క్రుద్ధుడు అయిపోయినాడు. తత్క్షణము పరమభాస్వరము అయిన మానవాస్త్రాన్ని మారీచుడి ఎదురురొమ్ములమీద వదిలినాడు. ఉత్తరక్షణాన ఆగ్నేయాస్త్రాన్ని సుబాహువు రొమ్ములమీద వేసినాడు.

ఓరుగాలి మేఘాలను నెటుకొని పోయేట్టుగా ఆమానవాస్త్రము మారీచుణ్ణి నూరు యోజనాలదూరము ఎగరవేసుకొనిపోయి సముద్రములో పడవేసింది. వాడు చేష్టలు తప్పి గిరగిర తిరుగుతూ సముద్రములో పడ్డాడు. కాని చావలేదు. సుబాహువు ఆ ఆగ్నేయాస్త్రానికి నేలకూలి చచ్చిపోయినాడు.

అంతట మారీచసుబాహువుల అనుచరులు అందరూ అటూ ఇటూ పరుగెత్తసాగినారు. వారినిచూచి రాముడు "లక్ష్మణా, ఈ రాక్షసులు బహు క్రూరులు. దుష్టులు. పాపకర్ములు. రుధిరాశనులు. వీరిని అందరినీ సంహరించవలసిందేను" అంటూ దివ్యము అయిన వాయవ్యాస్త్రము వేసి ఆరాక్షసులను అందరినీ చంపివేసినాడు.

అక్కడి మహామునులు అందరూ ఆశ్చర్యచకితులు అయినారు. ఎంతో సంతోషించినారు. అసురసంహారము చేసిన దేవేంద్రుణ్ణి దేవతలు పూజించినట్టుగా అప్పుడు రాముణ్ణి ఆమహర్షులు అందరూ పూజించినారు. దిశదిశలూ ప్రశాంతముగా తోచినవి. విశ్వామిత్రమహర్షి యజ్ఞము యథావిధిగా సమాప్తము అయింది.

విశ్వామిత్రమహర్షి రాముణ్ణి చూచి "యశస్వీ, నీతండ్రి నిన్ను పంపించినందుకు నాపని నెరవేర్చినావు. ఈసిద్ధాశ్రమనామము సార్థకము అయింది. నీవల్ల నేను కృతార్థుణ్ణి అయినాను" అని మెచ్చుకొన్నాడు.

# ౩౧

కృతకృత్యులు అయిన రామలక్ష్మణులు ఆ రాత్రి మహదానందముతో గడపినారు. సుఖముగా నిద్రపోయినారు. తెల్లవారుతూ ఉండగా నిద్ర లేచి పౌర్వాహ్ణిక కృత్యాలను ముగించుకొని విశ్వామిత్రమహర్షినీ తక్కిన మహర్షులనూ సందర్శించ పోయినారు.

అగ్నిహోత్రుడి మాదిరిగా తేజరిల్లుతూ ఉన్న విశ్వామిత్రమహర్షికి సాష్టాంగ నమస్కారము చేసినారు. తక్కిన మహర్షులకున్నూ అభివాదాలు చేసినారు. అంతట రాముడు గంభీరముగానూ మనోహరముగానూ "ఓ బ్రహ్మర్షీ, ఈ కింకరులు ఇంకా ఏమి చేయవలెనో యథేష్టముగా ఆజ్ఞాపించవలసింది. తమ ఆజ్ఞలను అన్నిటినీ నెరవేరుస్తాము" అన్నాడు.

ఈ మాటలకు అక్కడి మహర్షులు అందరూ సంతోషించినారు. విశ్వామిత్ర మహర్షి అనుమతితో వారిలో ఒకరు "రామా, మిథిలాధిపతి అయిన జనక మహారాజు పరమధర్మిష్ఠము అయిన మహాయజ్ఞము ఒకటి తలపెట్టినాడు. మేము అందరమూ అక్కడికి పోతున్నాము. మీరు అన్నతమ్ములున్నూ మాతో రావలసింది అక్కడ జనక మహారాజు దగ్గిర ధనూరత్నము ఒకటి ఉంది. అది చాలా గొప్పది. దేదీప్యమానముగా తేజరిల్లుతూ ఉంటుంది. భయంకరముగా కనబడుతుంది. దానిని మీరు అన్నదమ్ములు చూచి తీరవలెను"

"పూర్వము మిథిలాధిపతి దేవరాతుడు అనే ఆయన ఒకగొప్పయజ్ఞముచేసినాడు. అందుకు దేవతలు అందరూ మెచ్చుకొని ఆధనుస్సును యజ్ఞఫలముగా ఆయనకు ఇచ్చినారు. అది శివదేవుడి ధనుస్సు. అప్పటి నుంచీ అది మిథిలాధిపతుల ఇంట్లో ఉంటూ ఉంది. దానిని ప్రతినిత్యమూ గంధపుష్పధూపదీపాదులతో పూజ చేస్తూ ఉంటారు. ఆయుధపూజా సమయాలలో దానిని ప్రత్యేకముగా పూజ చేస్తారు. దేవదానవగరుడగంధర్వయక్షరాక్షసులు ఎవరూ దానిని ఎక్కుపెట్టలేకపోయినారు. ఇక మానవుల సంగతి చెప్పనే అక్కర లేదు. అయినప్పటికిన్నీ అనేకమంది రాజపుత్రులు మహాబలవంతులు ఆవింటిని ఆరోపించడానికి ప్రయత్నించి విఫలులు అయిపోయినారు. రామా, నీవు ఆఅత్యద్భుతధనుస్సును చూడవలెను. మీరు జనక మహారాజు చేసేయజ్ఞమున్నూ చూడవచ్చును. కాబట్టి మాతో రావలసింది" అని చెప్పినారు.

వారు అందరూ అక్కడ నుంచి మైథిలదేశానికి ప్రయాణము అయినారు.

విశ్వామిత్ర మహర్షి ముందుగా వనదేవతలను అందరినీ ఆహ్వానించి "ఓవన దేవతలారా, మీరు అందరూ ఇక్కడ సుఖముగా ఉండవలెను. నాకు కార్య సిద్ధి అయింది. సంతోషము. నేను ఇప్పుడు ఈ సిద్ధాశ్రమము వదిలిపెట్టి పోతున్నాను. ఉత్తరత్రా నేను గంగానదికి ఉత్తరాన ఉన్న హిమాలయ పర్వత ప్రాంతాలకు వెళ్లిపోతాను" అని వీడ్కోలు చెప్పి రామలక్ష్మణులతోనూ మహామునులతోనూ ఆసిద్ధాశ్రమానికి ప్రదక్షిణము చేసి ఉత్తరాభిముఖముగా నడిచినాడు. వారి వెంట అగ్నిహోత్ర సంభారాలు వేసుకొని ఒక నూరు బండ్లు సాగినవి. అప్పుడు ఆ సిద్ధాశ్రమములో ఉంటూ ఉన్న జింకలు గుంపులు గుంపులుగా వారి వెంటపడినవి. వాటిని చూచి అక్కడి రకరకాల పక్షులున్నూ ఎగురుకొంటూ ఆకాశాన బారులు తీరి వారి వెంటబయలుదేరినవి. అంతట విశ్వామిత్రమహర్షి అక్కడ ఆగి ఆ పక్షులకూ ఆ మృగాలకూ వీడ్కోలు చెప్పి అవి తమ వెంటపడకుండా వెనుకకు పంపించి వేసినాడు.

వారు అందరూ చాలా దూరము నడిచినారు. సూర్యాస్తమయము అవుతూ ఉండగా అనగా శోణాకూలము చేరినారు. ఆరాత్రి వారు అందరూ అక్కడ ఉండి పోతలచినారు. అంతట ఆ శోణానదములో స్నానము చేసి జపహోమాదులు ముగించినారు. సూర్యాస్తమయము అయిపోయిన తరువాత వారు అందరూ విశ్వామిత్ర మహర్షి చుట్టూ కూర్చున్నారు.

రామలక్ష్మణులున్నూ సంధ్యను ఉపాసించినారు. ఆ మహామునులకు అందరికీ అభివాదము చేసి విశ్వామిత్రమహర్షికి పాదాభివందనము చేసి ఆయనకు అభిముఖముగా కూర్చుని "ఓ స్వామీ, ఈ ప్రాంతము అంతా శోభాయమానముగా ఉంది. ఇది ఎవరి దేశమో తెలుసుకోవలెను అని కుతూహలముముగా ఉంది" అన్నాడు రాముడు.

అంతట విశ్వామిత్రమహర్షి ఆదేశవృత్తాంతము ఈవిధముగా చెప్పసాగినాడు.

## 32

"బ్రహ్మమానస పుత్రుడు కుశుడు అనే తాపసి పూర్వము బ్రహ్మలోకములో నుంచి ఈ భూలోకములోకి వచ్చినాడు. అతడు దృఢవ్రతుడు. ధర్మజ్ఞుడు. శౌర్యసంపన్నుడు. మహాకులీన అయిన విదర్భరాజపుత్రిని పెండ్లి ఆడినాడు. ఈడూజోడూ అయిన ఆదంపతులకు కుశాంబుడూ కుశనాభుడూ అధూర్తరజసుడూ వసువూ అనే నల్గురు పుత్రులు పుట్టినారు. ఆ నల్గురూ

తండ్రితో సరిసమానము అయిన సద్గుణసంపన్నులు. అమిత తేజోవంతులు. మహోత్సాహులు. పరమధార్మికులు. సత్యసంధులు.

"వారు నల్గురూ క్షత్రియధర్మాన్ని అవలంబించవలెను అని కుశుడు నిశ్చయించినాడు. ఈ భూమిని నాల్గుభాగాలు చేసి వారికి ఇచ్చి "ఓ పుత్రులారా, మీ మీ భూభాగాలను మీరు రాజ్యము ఏలవలెను. మీకు అందువల్ల పుణ్యము వస్తుంది" అని చెప్పినాడు. తండ్రి నిర్ణయించినందువల్ల వారు నలుగురూ రాజ్యపాలనాసక్తులు అయినారు. లోకసమ్మతముగా రాజ్యపాలనము చేయడానికి ముందుగా రాజధానీనగరాలను కట్టించడము మొదలు పెట్టినారు. మహా తేజోవంతుడు అయిన కుశాంబుడు కౌశాంబీ నగరాన్ని కట్టించినాడు. ధర్మాత్ముడు కుశనాభుడు మహోదయము అనే పట్టణాన్ని కట్టించినాడు. అధూర్తరజసుడు ధర్మారణ్యము అనే పట్టణాన్నీ వసువు గిరివ్రజమూ అనే పట్టణాన్నీ కట్టించినారు.

రామా, మనము ఇప్పుడు ఉన్న ఈ ప్రదేశము ఆవసురాజు రాజ్యములోది. ఈ దేశము చుట్టూ అయిదు కొండలు ఉన్నవి. అందువల్లనే రాజధానీ నగరానికి గిరివ్రజము అని పేరు పెట్టినారు. మంగళకరము అయిన ఈ శోణ నదమే సుమాగధీ అని ప్రసిద్ధి కెక్కింది. ఈ నది నుంచే ఈ దేశాన్ని మగధ దేశము అని కూడా అన్నారు. ఈ మాగధీనది అయిదుకొండల మధ్యనూ పూలమాలవలె శోభాయమానముగా తూర్పునుంచి పడమటికి ప్రవహిస్తూ ఉంది. వసురాజు మహాత్మ్యమువల్ల ఈ నదీజలాలు పారినంత లెక్కనూ భూమి సుక్షేత్రము అయింది. సస్యశాలిని అయింది. సుభిక్షము అయిన దేశమున్నూ అయింది.

"రామా, కుశుడి రెండవ కుమారుడు కుశనాభుడు రాజర్షి. ధర్మాత్ముడు. ఘృతాచీ అప్సరాంగనను పెండ్లి ఆడినాడు. ఆ ఆదంపతులకు నూరుగురు ఆడపిల్లలు పుట్టినారు. వారు అసమాన రూపవతులు. ఆ రూపయౌవన సంపన్నలు ఒకనాడు సొమ్ములు అన్నీ పెట్టుకొని ఇంకా గంధపుష్పాదులతో చక్కగా అలంకరించుకొని తొలకరి మెరుపువలె మెరిసిపోతూ ఉద్యాన వనానికి పోయినారు. అక్కడ గుబురుగా ఉన్న చెట్లమధ్యను వారు సంతోషాతిశయముతో వీణలు వాయిస్తూ సంగీతాలు పాడుతూ నృత్యము చేస్తూ సర్వాంగాలూ శోభిస్తూ ఉంటే కారుమబ్బులలో తళుక్కు తళుక్కుమనే చుక్కలవలె కనిపించినారు.

వాయుదేవుడు వారిని చూచినాడు. వారిదగ్గరకు చేరి "ఓ కన్నెలారా, మిమ్ములను నేను వలచినాను. మీరు అందరూ నన్ను పెండ్లి ఆడవలసింది.

మీకు మానవత్వము వదలి పోతుంది. ఇక మీకు జరామరణాదులు ఉండవు. మీరు దేవకన్నెలు అవుతారు. మీ యౌవనము అక్షయము అవుతుంది" అన్నాడు.

ఆ కన్నెలు నవ్వుతూ "ఓ వాయుదేవుడా, నీ ప్రభావము మేము ఎరుగుదుము. నీవు ఎక్కడ పడితే అక్కడ తిరుగుతూ ఉంటావు. నీకు ఏ అడ్డూ లేదు. ఎక్కువ తక్కువలూ లేవు. ఇప్పుడు మమ్మలను ఎందుకు అవమానించ తలచినావు. మేము కుశనాభుడి కూతుళ్ళము. నిన్నే కాదు నీ ప్రభువు అయిన దేవేంద్రుణ్ణి కూడా పదభ్రష్టుణ్ణి చేయగలము. ఇంతమాత్రానికి మా శక్తియుక్తులను వ్యర్థము చేయడము ఎందుకు అని ఊరకుంటున్నాము. నీ దుర్బుద్ధి మా తండ్రికి తెలిస్తే నిన్ను హతమారుస్తాడు, జాగ్రత్త. మమ్మలను అవమానించవద్దు. మేము ధర్మము తప్పము. మా తండ్రే మా ప్రభువు. పరదైవము. ఆయన మమ్మలను ఎవరికి ఇవ్వవలెను అనుకొంటే వారినే భర్తగా వరిస్తాము" అన్నారు.

వాయుదేవుడికి పట్టరాని కోపము వచ్చింది. వారిని వశపరచుకోవలెను అనుకొన్నాడు. వారి సర్వావయవాలలోనూ దూరినాడు. అంతట వారు అందరూ కురూపలూ కుబ్జలూ అయిపోనారు. అడుగులు తడబడుతూ తండ్రి దగ్గిరకు పోయి ఏడుస్తూ నేలమీద కూలబడ్డారు.

కుశనాభుడు వారిని అందరినీ చూచినాడు. పరమశోభనలు అయిన వారు అట్లా కురూపలూ కుబ్జలూ అయిపోయినందుకు ఆశ్చర్యచకితుడు అయి "పిల్లలారా, ఇది ఏమిటి– చెప్పవలసింది. మీరు ఇట్లా కురూపలూ కుబ్జలూ ఎందుకు అయిపోయినారు. ఎవడు అయినా ధర్మహాని చేసినాడా–పలుకరేమి– ఏడుస్తారు. మాట్లాడరు. ఎందువల్ల" అంటూ నిట్టూర్పులు విడిచినాడు.

## 33

ఆ కన్నెలు తండ్రిపాదాలు పట్టుకొని "ప్రభూ, ఈ ప్రపంచము అంతటా సంచారము చేసే వాయుదేవుడు మమ్మలను బలాత్కరించినాడు. ధర్మాన్ని పాటించలేదు. అక్రమముగా ప్రవర్తించినాడు. మేము అడుల చాటు పిందెల మాదిరిగా తండ్రిచాటు బిడ్డలము అనీ స్వచ్ఛందలము కాము అనీ మా తండ్రిని పోయి అడగవలసింది అనీ ఆయన అంగీకరిస్తేనే మేము పెండ్లి అడుతాము అనీ చెప్పినాము. ఆపాపకర్ముడు మేము ఏమి చెప్పినా ఎన్ని చెప్పినా వినలేదు. మమ్మలను భంగపరచినాడు. ఈ విధముగా అయిపోయినాము" అంటూ ఏడ్చినారు.

కుశనాభుడు అసమానపరాక్రమవంతుడు. అయినప్పటికిన్నీ పరమ ధార్మికుడు. ఆలోచనాపరుడు. కూతుళ్లను చూచి "ఓ కన్నెలారా, అపరాధులను క్షమించటమే క్షమావంతుల కర్తవ్యము. మీరు మహోగొప్పగా ప్రవర్తించినారు. అడిగితే లొంగిపోలేదు. అవమానపరచినా ఓర్చుకొన్నారు. పురుషులకు అయినా స్త్రీలకు అయినా క్షమే గొప్ప అలంకారము. అపరాధులను క్షమించటము అశక్యము. అందులో దేవతలే అపరాధము చేసినప్పుడు క్షమించటము అంతకన్నా అశక్యము. ఆడుపిల్లలు మీరు అందరూ ఏకము అయి క్షమించటము అన్నిటికన్నా అశక్యము అయిన విషయము. మీరు నాపరువునూ మన కులగౌరవాన్నీ నిలబెట్టినారు.

ఓ పిల్లలారా, క్షమే దానము. క్షమే యజ్ఞము. క్షమే సత్యము. క్షమే యశస్సు. క్షమే సమస్తధర్మాలకూ మూలము. ఈ సకలచరాచరాత్మకము అయిన జగత్తు అంతా క్షమమీదనే ఆధారపడిఉంది" అని చెప్పి ఓదార్చి కూతుళ్లను పంపించివేసినాడు.

అంతట మంత్రిసత్తములను రావించి ఆకూతుళ్ళను ఎవరికి ఇచ్చి పెండ్లి చేయటము-ఎప్పుడు పెండ్లిచేయటము-ఎక్కడ పెండ్లి చేయడము - అని ఆలోచించినాడు.

ఆకాలములో సదాచారసంపన్నుడూ ఊర్ధ్వరేతస్కుడూ అయిన చూళి అనే బ్రాహ్మణుడు ఒకడు బ్రైడికము అయిన తపస్సు చేయటము మొదలుపెట్టినాడు. ఊర్మిళ అనే గంధర్వాంగన కూతురు సోమద అనే ఆమె బ్రాహ్మణ సేవాపరాయణత్వముతో ఆయనకు అప్పుడు సమస్తోపచారాలూ చేయసాగింది. చూళి తపస్సిద్ధుడు అయినాడు. ఆ గంధర్వాంగన పరిచర్యకు సంతుష్టుడు అయి "ఓసోమదా, నీ శుశ్రూషకు మెచ్చుకొన్నాను. నేను ఏమిఇచ్చి సంతోషపెట్టవలెను. చెప్పు" అన్నాడు. అందుకు ఆమె ఎంతో సంతోషపడ్డది. ఆమె మాటనేర్పరి. మధురస్వరముతో "ధర్మాత్మా, తాము బ్రహ్మవర్చస్సులో బ్రాహ్మణులను అందరినీ అతిశయించినారు. సాక్షాత్తు బ్రహ్మదేవుడుగా ఉన్నారు. నాకు పెనిమిటి ఎవడూ లేడు. నేను ఎవరినీ పెండ్లిఆడలేదు. ఇకముందు ఎవరినీ పెండ్లిచేసుకోను. నేను నైష్ఠిక బ్రహ్మచారిణిని. బ్రాహ్మణశక్తియుక్తుడు అయిన పుత్రుణ్ణి నాకు మీరు అనుగ్రహించవలెను" అన్నది సోమద.

చూళి ప్రసన్నుడు అయినాడు. మనసా సంకల్పించినాడు. ఆమెకు బ్రహ్మదత్తుడు అనే పుత్రుడు పుట్టినాడు.

ఆ బ్రహ్మదత్తుడు కాంపిల్యానగరానికి రాజు అయినాడు. దేవేంద్రుడి మాదిరిగా రాజ్యపాలనము చేయసాగినాడు. అతనికి కుశనాభుడు తన నూరుగురు

కూతుళ్ళనూ ఇచ్చి వివాహము చేయ నిశ్చయించినాడు. ఆ బ్రహ్మదత్తుణ్ణి రావించి ఎంతో సంతోషముతో కన్యాదానము చేసినాడు. బ్రహ్మదత్తుడు వరుసగా ఆకన్నెల పాణులు పట్టుకొన్నాడు. అంతట వారి కుబ్జత్వము వదిలిపోయింది. అదివరకటివలెనే దివ్యసుందరవిగ్రహాలు అయినారు. కుశనాభుడు వారిని అందరినీ పురోహితులతోకూడా బ్రహ్మదత్తుడివెంట కాంపిల్యానగరానికి పంపించినాడు.

సోమద కోడళ్ళను అందరినీ చూచి సంతోషించింది. అత్యంత ఆదరముతో కౌగలించుకొన్నది. కుశనాభుణ్ణి ప్రశంసించింది.

## ౩౪

"రామా, బ్రహ్మదత్తుడి వెంట కూతుళ్లు అందరూ వెళ్లిపోయిన తరువాత ఇంట్లో ఒక్క పిల్లవాడు అయినా లేడే అని కుశనాభుడు విచారపడిపోయి పుత్రేష్టిని ఆరంభించినాడు. అప్పుడు ఆయన తండ్రి కుశుడు అక్కడికి వచ్చి కుమారుణ్ణి చూచి "నాయనా, నీకు నీ అంతటి పుత్రుడు పుట్టుతాడు. వాడు పరమ ధార్మికుడు అవుతాడు. గాధిరాజుఅని ప్రసిద్ధికెక్కుతాడు. నీ కీర్తిని శాశ్వతము చేస్తాడు" అని చెప్పి ఆకాశమార్గాన బ్రహ్మలోకము పోయినాడు. కొంతకాలము అయిన తరువాత కుశనాభుడికి కొడుకుపుట్టినాడు.

అతడే పరమధార్మికుడు అయిన గాధిరాజు. మా తండ్రి. నేను కుశవంశములో పుట్టినాను: కనుక నన్ను కౌశికుడు అన్నారు. నా కన్నముందు నా అక్క సత్యవతి అనే ఆమెపుట్టింది. ఋచీకుడు అనే ఆయనకు ఆమెను ఇచ్చి పెండ్లిచేసినారు. నా అక్క సత్యవతి సువ్రత. సత్యశీలిని. ధర్మిష్ఠ. పరమపతివ్రత. మహాభాగ. ఎంతో పుణ్యము చేసింది. ఆమె భర్తననువర్తిని అయి దేహముతో స్వర్గానికిపోయింది. అంతటితో తృప్తి చెందక ఈ లోకములో వారికి అందరికీ ఐహికాముష్మికఫలాలను ఇవ్వతలచి మహానదీ రూపాన హిమవత్పర్వత ప్రాంతములో అవతరించింది. మహారమ్యము అయిన కౌశికీనదిగా ప్రవహిస్తూ ఉంది. అది పుణ్యనది. నా అక్కమీది గౌరవాతిశయమువల్ల నేను హిమాలయపర్వతపార్శ్వములో ఆకౌశికీనదీ తీరాన నివసిస్తూ ఉండేవాణ్ణి. యజ్ఞనియమమువల్ల ఆ ప్రదేశము వదిలిపెట్టి సిద్ధాశ్రమానికి వచ్చినాను. రామా, నీ పరాక్రమమువల్ల నా యజ్ఞము సఫలము అయింది. నేను తపస్సిద్ధుణ్ణి అయినాను" అన్నాడు విశ్వామిత్రమహర్షి.

"బాగుంది: బాగుంది" అంటూ మహర్షులు అందరూ "స్వామీ, తమ కుశవంశము గొప్పది. తమ వంశీయులు అందరూ ధర్మాత్ములు. మహాత్ములు. బ్రహ్మదేవుడితో సరిసమానము అయినవారు. తమ భగిని వంశద్యోతకరి. అందరిలో తాము మహాయశులు" అని విశ్వామిత్రమహర్షిని ప్రశంసించ సాగినారు.

"ఓ రామా, నీవు అడిగినందువల్ల ఈ దేశాన్ని గురించీ ప్రసంగవశాత్తూ నా వంశాన్ని గురించి చెప్పినాను. నేను ఈ కథలు చెప్పుతూ ఉండడములో సందె మెల్లగా జరిగిపోయింది. ఇప్పుడు రాత్రి చాలా పొద్దుపోయింది. ఇక మనము అందరమూ నిద్ర పోవలెను. ఇంకా మేలుకొని ఉండేట్లయితే రేపు ఉదయము మన ప్రయాణము సాగక పోవచ్చును. అన్ని దిక్కులా చీకట్లు కమ్ముకొన్నవి. జ్యోతిష్మంతాలు అయిన నేత్రాలు ఉన్నట్టుగా ఆకాశము అశ్విన్యాదినక్షత్రాలతోనూ తక్కిన తారలతోనూ భాసిస్తూ ఉంది. చెట్లు కదలకుండా మెదలకుండా ఉన్నవి. మృగపక్షిసమూహాలు అలికిడి లేకుండా నిద్రపోతూ ఉన్నవి. గుడ్లగూబలు మొదలు అయిన పక్షులూ మాంసాశనులు అయిన రాక్షసులూ అటూఇటూ తిరుగుతూ ఉన్నట్టుగా ఉంది.

రామా, చూడు. చీకటిని పారదోలుతూ చంద్రుడు చల్లని కిరణాలతో ఉదయిస్తున్నాడు. సమస్త ప్రాణులనూ సంతోషపెట్టే చల్లని వెన్నెల కాస్తూ ఉన్నాడు. ఇక పరుండవలెను" అన్నాడు విశ్వామిత్రమహర్షి.

రామలక్ష్మణులు విశ్వామిత్రుడు చెప్పిన విషయాలకు విస్మితులు అయినారు. ఆయనను కొనియాడి నిద్రపోయినారు.

అస్తంగతుడు అయిన అంశుమంతుడి మాదిరిగా విశ్వామిత్ర మహర్షి నిద్రపోయినాడు.

## ౩౫

"ఓ రామా, తెల్లవారుతూ ఉంది. నీవు నిద్రలేవవలెను. పూర్వసంధ్యాకాలము అయిపోతూ ఉంది. మనము ఇక ప్రయాణము కావలెను" అని విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులను నిద్రలేపినాడు.

రామలక్ష్మణులు ప్రాతరాహ్నికాలను ముగించినారు. అందరూ ప్రయాణము అయినారు. రాముడు "ఓ స్వామీ ఈ శోణనదములో నీళ్లు లోతుగా లేవు. నిర్మలముగా కూడా ఉన్నవి, అక్కడక్కడ ఇసుకదిబ్బలున్నూ బయట పడ్డవి. ఈ నదాన్ని నావలో దాట నవసరము లేదు. నడిచిపోవచ్చును. కాని దారి ఎటో తెలియటము లేదు." అన్నాడు.

"మహామునులు అందరూ దాటిపోయేదారి నేను ఎరుగుదును. ఆ దారినే పోదాము" అని చెప్పి విశ్వామిత్ర మహర్షి బయలుదేరినాడు. ఆయన వెంట రామలక్ష్మణులున్నూ తక్కిన మహర్షులున్నూ శోణనదాన్ని దాటి అయా అరణ్యాలు చూస్తూ నడిచినారు. చాలాదూరము పోయినారు. మిట్టమధ్యాహ్నము అయింది. మునిజనసేవితమూ పరమపావనమూ అయిన జాహ్నవీ నది కనిపించింది. హంససారసాల కూహూనాదాలు వినపించినవి. మనోహరము అయిన ఆ గంగానదిని చూచి వారు అందరూ ముదితులు అయినారు.

అంతట ఆ నదీతీరాన వారు అందరూ ఆగిపోయినారు. ఆ పుణ్యనదిలో స్నానాలు చేసి యథాశాస్త్రముగా పితృతర్పణాదులు వదిలి అగ్నిహోత్రాలు వేల్చి హోమాలు చేసి అమృతమువంటి హవిస్సును భుజించినారు.

ఆ గంగానదీ తీరాన అంతట వారు అందరూ సంతోషముగా విశ్వామిత్ర మహర్షి చుట్టూ చేరినారు. రాముడు "మహాత్మా, ఈ గంగానది మూడుపాయలుగా ముల్లోకాలలో ఎందుకు ప్రవహించింది. నదీనదాలు అన్నింటికీ ప్రభువు అయిన సముద్రుణ్ణి ఎట్లా చేరింది చెప్పవలెను." అని అడిగినాడు. విశ్వామిత్ర మహర్షి మందహాసము చేసి ఈ విధముగా చెప్పడము మొదలు పెట్టినాడు.

"వెండీ బంగారమూ మొదలుఅయిన ధాతువులుఅన్నిటికీ ఈ ప్రపంచములో గనిగా హిమవంతుడు అనే పర్వతరాజు ఉన్నాడు. అతడు సన్నని నడుముతో చక్కని చుక్కవంటి మనోరమ అనే ఆమెను పెండ్లి ఆడినాడు. ఆమె మేరు రాజపుత్రి. ఆ దంపతులకు ఇద్దరు పుత్రికలు అప్రతిమానసుందరీమణులు పుట్టినారు. వారిలో పెద్దదాని పేరు గంగ. చిన్నది ఉమాదేవి. ఇద్దరూ జగత్ప్రసిద్ధలూ సర్వలోకపూజ్యలూ అయినారు.

దేవహితముకోసము గంగను తమకు ఇవ్వవలసింది అని దేవతలు హిమవంతుణ్ణి అడిగినారు. ఆయన ముల్లోకాలవారికీ మేలు చేయతలచి భువనపావని అయిన గంగాదేవిని దేవతలకు సంతోషముగా ఇచ్చివేసినాడు.

హిమవంతుడి రెండవకూతురు ఉమ మహోగ్రము అయిన తపస్సు చేయనారంభించింది. ఆమెను అప్రతిమాన రూపవంతుడు అయిన రుద్రుడికి ఇచ్చి హిమవంతుడు పెండ్లిచేసినాడు. ఆమె రుద్రుడి భార్య అయి ముల్లోకాలవారికీ పూజ్యురాలు అయింది.

త్రిలోకహితాచరణపరులు అయిన దేవతలు కృతార్థులు అయి అస్వచ్ఛందగామినిని గంగాదేవిని వెంటబెట్టుకొని దేవలోకము పోయినారు. ఆమె ఆ దేవలోకములో దివ్యవాహిని అయి ప్రవహించింది. అక్కడివారి అందరి పాపాలూ పోగొట్టి పవిత్రులను చేసింది. రామా, ఆ త్రిపథగామినే ఈ గంగానది."

## ౩౬

అంతట రాముడు "మహాత్మా, గంగాదేవి కథను సంక్షేపముగా చెప్పినారు. ఆయా విషయాలను సవిస్తరముగా చెప్పగలవారు తాము ఒక్కరే. ఆలోకపావని గంగాదేవి ఎందుకు మూడుపాయల నది అయి ప్రవహించింది. త్రిపథగామిని అయి ఏ ఏ పనులు చేసినందువల్ల ముల్లోకాలలోనూ ఉత్తమోత్తమము అయినది అని ప్రసిద్ధి కెక్కింది" అని అడిగినాడు.

అప్పుడు విశ్వామిత్ర మహర్షి ఈ విధముగా చెప్ప నారంభించినాడు.

"ఓ రామా, నీలకంఠుడు మహోగ్రము అయిన తపస్సుచేసి ఉమాదేవిని పెండ్లి ఆడినాడు. ఆమెకూడా మహాతపస్సంపన్న; జగదేక సుందరి. ఉభయులూ మోహపరవశులు అయినారు. పుత్రేచ్ఛతో రతికేళిలో నిమగ్నులు అయినారు. ఎంతోకాలము గతించింది. శివతేజము చలించలేదు. ఉమ గర్భము ధరించలేదు. వారికి పుత్రేచ్ఛ తీరలేదు. ఇకను వీక్షణలేశములోనో ఆమెకు గర్భధారణము అయ్యేస్థితి వచ్చింది."

"ఆ ఉమామహేశ్వరులకు ఎటువంటి అమేయబలాఢ్యుడు పుట్టుతాడోనని బ్రహ్మదేవుడు మొదలు అయిన దేవతలు అందరూ భయభ్రాంతులు అయిపోయినారు. అంతటవారు అందరూ పరుగెత్తుకొనిపోయి శితికంఠుడికి నమస్కారము చేసి "ఓ దేవదేవా, ఓమహాదేవా, మేము దేవతలము అందరమూ నమస్కార పురస్సరముగా వేడుకొంటున్నాము. తాము లోక సంగ్రహకర్తలు. అనుగ్రహించవలెను. తమ తేజానికి పుట్టే పుత్రుణ్ణి ఈ లోకాలు భరించలేవు. తమతేజస్సును తమ తేజోమయదేహములో నుంచి వదిలిపెట్టవద్దు. తమలోనే ఉంచుకొని ముల్లోకాలకూ మేలు చేయవలసింది" అని ప్రార్థించినారు. "మంచిది. దేవతలు అయిన మీకూ ముల్లోకాలకూ మేలుఅవుతుంది అని మీరు అంటున్నారు కనుక ఇకముందు నా తేజాన్ని నాలోనే ఉంచుకొంటాను. అయితే రేతఃస్థానము నుంచి ఇప్పుడు చలించబోతున్న దానిని ధరించ కలవారు ఎవరు" అని వృషభధ్వజుడు ప్రశ్నించినాడు. "క్షుభితము కాబోతూన్న తేజాన్ని భూమి ధరిస్తుంది" అన్నారు దేవతలు. అంతట మహాదేవుడు తన రేతస్సు భూమిమీద వదలి పెట్టినాడు.

దేవతలు అందరూ ఉమామహేశ్వరులను స్తోత్రము చేయసాగినారు.

శైలసుతకు పట్టరానికోపము వచ్చింది. ఆమెకన్నులు నిప్పుకణికలు అయిపోయినవి. దేవతలను అందరినీ చూస్తూ "మా పుత్రోత్పత్తిని మీరు చెడగొట్టి

నారు. ఇక మీ భార్యలకు సంతానము కలుగకూడదు. ఇది మొదలు మీవాండ్లు గొడ్డురాండ్లు అయిపోవలెను” అని శాపము పెట్టింది. కోపము అంతటితో ఆగ లేదు. అంతట ఆమె భూదేవిని చూస్తూ “వసుంధరా ఓ బుద్ధి తక్కువదానా, నీవు విపర్యస్తప్రకృతివి అయిపో. ఇకనుంచీ నీవు అనేకమందికి భార్యవు అయిపో. ఊషరత్వాది నానావిధరూపిణివి అయిపో. పుత్రసౌఖ్యము ఎన్నటికీ లేకుండా ఏడుస్తూఉండు” అని శపించింది.

భూమిమీదపడ్డ శివుడి రేతస్సు ఆ ఈ ప్రదేశము అనకుండా భూతలము అంతటా ప్రవహిస్తూఉంటే దేవతలు అందరూ భయపడిపోయి అగ్నిదేవుణ్ణి చూచి “ఓ దేవా, నీవు వాయుదేవుణ్ణి సహాయము చేసుకొని శివతేజాన్ని దహించి వేయవలెను” అని ప్రార్థించినారు.

అగ్నిహోత్రుడు దహించివేసిన ఆ తేజస్సు శ్వేతపర్వతముగా వెలసింది. కాలక్రమేణా అక్కడ రెల్లు పెరిగింది. అది సూర్యసమాన తేజముతో ఒక వనము అయింది. అక్కడనే మహాతేజోవంతుడు అయిన కుమారకార్తికేయుడు జన్మించినాడు.

ఆ జరిగినదానికి దేవతలు అందరూ సిగ్గుపడిపోయినారు.

ఉమామహేశ్వరులు అంతట అక్కడనుంచిబయలుదేరి పడమటిదిక్కుగా పోయి హిమవత్పర్వతో త్తరపార్శ్వము చేరినారు. అక్కడవారు తపస్సు చేయ డము మొదలుపెట్టినారు.

రామా, ఇప్పుడు పార్వతీదేవిని గురించిన కథ అంతా చెప్పినాను. ఇక గంగాదేవి ప్రభావాన్ని గురించీ కార్తికేయుడి పుట్టకనుగురించీ చెప్పతాను. వినవలెను.”

## 32

“ఉమామహేశ్వరులు తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయినతరువాత దేవత లకు సేనానాయకుడు ఒకడు కావలసి వచ్చినాడు. అగ్నిహోత్రుడు మొదలు అయిన దేవతలు అందరూ ఇంద్రుణ్ణి వెంటపెట్టుకొని బ్రహ్మదేవుడి దగ్గరకు పోయినారు. ఆయనకు నమస్కారము చేసి “ఓ దేవా, ఇదివరకు రుద్రుణ్ణి మా సేనాధిపతిగా నిర్ణయించినావు. ఆయన ఇప్పుడు ఉమాదేవితో తపోనిష్ఠలో ఉన్నాడు. స్వామీ, నీవు సమస్తోపాయాలు తెలిసినవాడవు. ఇప్పుడు మేము ఏమిచేయవలెనో నీవు చెప్పవలెను” అని అడిగినారు.

బ్రహ్మదేవుడు తియ్యనిమాటలతో దేవతలను ఓదారుస్తూ “ఓ దేవత లారా, ఇక మీ ఇల్లాండ్లకు బిడ్డలు పుట్టరు. ఉమాదేవిది అమోఘవాక్కు. ఇక

ఈ విషయములో సందేహము ఏమీ లేదు. అదిగో స్వర్గములో తిరుగుతూఉన్న గంగాదేవి. ఆమె ముమ్మూర్తులను అందరినీ పవిత్రులను చేసింది. ఆమె హిమవంతుడి పెద్దకూతురు. అగ్నిహోత్రుడు ఆమెను కలిస్తే అరిందముడు అయిన సేనాపతి పుట్టుతాడు. అందుకు గంగాదేవి ఒప్పుకొంటుంది. ఉమాదేవినీ సంతోషిస్తుంది." అన్నాడు.

కృతార్థులు అయినట్టు దేవతలు అందరూ భావించినారు. బ్రహ్మదేవుడికి నమస్కారము చేసి ఆయనను కొనియాడి అక్కడనుంచి కైలాసపర్వతానికి పోయినారు. అగ్నిహోత్రుడితో "ఓహుతాశనా, ఓ మహాతేజా, ఇక దేవకార్యాన్ని నెరవేర్చు. నీలోవున్న శివతేజాన్ని గంగా గర్భములో వదలిపెట్టు" అని చెప్పినారు. "అట్లాగేను" అని అగ్నిహోత్రుడు గంగదగ్గరకు పోయి "ఓ దేవీ, దేవతలు అందరు సంతోషిస్తారు. నీవు గర్భముధరించవలెను" అన్నాడు. గంగాదేవి అంగీకరించింది.

అంతట ఆమె దివ్యాంగనారూపము ధరించింది. ఆమెసౌందర్యాతిశయానికి అగ్నిహోత్రుడు ముగ్ధుడు అయిపోయినాడు. ఆ గంగాదేవి సర్వావయవాలలోనూ అగ్నిహోత్రుడు వ్యాపించినాడు. ఆ శివతేజాన్ని వదిలినాడు.

గంగాదేవి గర్భము ధరించింది. అంతటితో ఆమె దేహము దహించుకొని పోవడము మొదలుపెట్టింది. ఆ బాధను ఆమె భరించలేకపోయింది. అగ్నిహోత్రుడిదగ్గరకుపోయి "ఓ మహాతేజా, గర్భము వృద్ధిఅయినకొద్దీ భరించలేకుండా ఉన్నాను" అంటూ మొరపెట్టుకొన్నది. "అట్లా అయినట్లయితే నీగర్భాన్ని హిమత్పర్వతపాదములో దించుకో"మని అగ్నిహోత్రుడు చెప్పినాడు.

ఆ గర్భాన్ని గంగాదేవి అక్కడ దించుకొన్నది. ఆ గర్భస్రవములో నుంచి అప్పుడు అక్కడ బంగారము పుట్టుకొని వచ్చింది. నిర్మలము అయిన వెండిన్నీ పుట్టింది. ఆశోణిత తైక్ష్ణ్యానికి రాగిన్నీ నల్లటి ఇనుమున్నూ దాని మలములో నుంచి తగరమున్నూ సీసమున్నూ పుట్టుకొని వచ్చినవి. ఆ ప్రదేశములో సమస్తధాతువులున్నూ వర్ధిల్లినవి. అక్కడి శరవణమున్నూ తృణవృక్షలతాగుల్మాలున్నూ బంగారుమయము అయినవి.

ఆ గర్భస్రవములో నుంచి పరమభాస్వరము అయిన ఒక శిశువు పుట్టినది.

ఆ పుట్టిన శిశువుకు పాలు ఇవ్వడానికి ఇంద్రాది దేవతలు ఆరుగురు కృత్తికలనూ నియమించినారు. ఆ పిల్లవాణ్ణి తమ పిల్లవాడుగా గుర్తించవలెను అని ఆ ఆరుగురు కృత్తికలూ దేవతలను అడిగినారు. అందుకు వారు ఒప్పుకొని "ముల్లోకాలలోనూ ఆ పిల్లవాడు కార్తికేయుడు అని ప్రసిద్ధికెక్కుతాడు,

సందేహములేదు" అన్నారు. అగ్నిహోత్రుడు మాదిరిగా దేదీప్యమానముగా వెలుగుతూ ఉన్న ఆ శిశువుకు గర్భస్రావము పోవడానికి అంతట ఆ ఆరుగురు కృత్తికలూ నీళ్లు పోసినారు. ఆ ఆరుగురి స్తనాలలోనూ అప్పటికి అప్పుడు పాలు చేపినవి. ఆ శిశువు ఆరుముఖాలతో ఆ ఆరుగురి స్తనాలలో పాలనూ ఒక్కసారిగా కుడిచివేసినాడు.

ఆ పిల్లవాడు కుసుమ కోమల దేహుడు అయినప్పటికిన్నీ మహేశ్వరుని పుత్రుడు అయినందువల్ల పరాక్రమముతో రాక్షసులను అందరినీ జయించివేసినాడు.

ఆ అసమానద్యుతిమంతుణ్ణి అగ్నిహోత్రుడు దేవసేనాధిపతిగా అభిషేకము చేసినాడు. దేవతలు అందరూ సంతోషించినారు.

కృత్తికలు పెంచినందువల్ల ఆ కుమారుడు కార్తికేయుడు అయినాడు. ఆరుముఖాలతో పాలను కుడిచినందువల్ల షడాననుడు అయినాడు. గంగా గర్భస్కన్నుడు అయినందువల్ల స్కందుడు అయినాడు.

ఓ రామా దేవలోకములో గంగాదేవి వృత్తాంతాన్నీ అత్యద్భుతము అయిన కుమార సంభవాన్నీ చెప్పినాను".

## ౩౮

విశ్వామిత్ర మహర్షి మళ్ళీ ఈ విధముగా చెప్పసాగినాడు.

"ఓ రామా, పూర్వము అయోధ్యానగరములో సగరుడు అనే చక్రవర్తి రాజ్యపాలనము చేస్తూ ఉండేవాడు. ఆయన మహాపరాక్రమవంతుడు. పరమధార్మికుడు. విదర్భరాజు కూతురు కేశిని అనే ఆమె ఆయన పెద్దపెండ్లాము. ఆమె ధర్మిష్ఠ, సత్యభాషిణి. అరిష్టనేమి కూతురూ గరుత్మంతుడి చెల్లెలూ అయిన సుమతి ఆయన చిన్నభార్య. ఈ భూలోకములో ఆ సుమతి అంతటి అందకత్తె మరి ఒకతె లేదు. ఆ భార్యలు ఇద్దరికీ సంతానము కలగలేదు.

సగరుడు సంతానము కోసము తపస్సు చేయవలెను అనుకొన్నాడు. భార్యలతో కూడా హిమవత్పర్వతములో భృగుమహర్షి నివసించే సెలయేటి దగ్గరకు పోయినాడు. అక్కడ ఆయన చాలా కాలము తపస్సు చేసినాడు. మహా సత్యవంతుడు అయిన భృగుమహర్షి ఆయనకు ప్రత్యక్షము అయినాడు.

ఆయన సగరుడి తపస్సు మెచ్చుకొని "ఓ రాజా, నీకు చాలామంది బిడ్డలు పుట్టుతారు. నీవు ఈ లోకములో అసమానము అయిన కీర్తి సంపాదిస్తావు. నీ

ఇద్దరు భార్యలలో ఒకరికి వంశవర్ధనుడు అయిన పుత్రుడు ఒకడున్నూ రెండవ ఆమెకు అరవై వేలమంది పుత్రులున్నూ పుట్టుతారు" అన్నాడు

అందుకు ఆ రాజు భార్యలు ఇద్దరూ పరమానంద భరితలు అయి వినయ విధేయతలతో ఆ మహాత్ముణ్ణి స్తోత్రము చేసినారు. నమస్కారముచేసి "ఓ బ్రాహ్మణోత్తమా! మాలో ఎవరికి ఒకపుత్రుడు పుట్టుతాడు-ఎవరికి అరవై వేల మంది పుత్రులు పుట్టుతారు. తామే చెప్పవలెను. తమ మాట తప్పిపోదు" అని అడిగినారు.

"మీకు మీ చిత్తము వచ్చినట్టుగా పిల్లలు పుట్టుతారు. వంశవర్ధనుడు అయ్యే కుమారుడు ఎవరికి కావలెనో మహాబలవంతులూ మహోత్సాహులూ కీర్తిమంతులూ అయ్యే కుమారులు ఎవరికి కావలెనో మీరే కోరుకోవలసింది" అన్నాడు అథరాత్ముడు.

కేశిని తనకు వంశవర్ధనుడు అయ్యే ఒక్క కొడుకు చాలును అన్నది. సుమతి కీర్తిమంతులు అయ్యే అరవై వేలమంది కొడుకులను కోరుకొన్నది. "అవిధముగానే పిల్లలు పుట్టుతారు" అని భృగుమహర్షి అన్నాడు.

ఓ రామా, అంతట ఆసగరచక్రవర్తీ ఆయన ఇద్దరు భార్యలూ భృగు మహర్షికి ప్రదక్షిణాలు చేసి సాష్టాంగనమస్కారముచేసి తమపట్టణానికి పోయి నారు.

కొంతకాలము అయినతరువాత కేశినికి అశ్వమంజుడు (అసమంజుడు)అనే ఒక్క పుత్రుడు పుట్టినాడు. సుమతికి సొరకాయవంటి గర్భపిండము ఒకటి పుట్టింది. దాన్ని చీల్చినారు. దానిలోనుంచి అరవై వేల మంది శిశువులు పుట్టు కొని వచ్చినారు. ఆ శిశువులను దాదులు నేతితో నింపిన కుండలలో పెట్టి పెంచినారు. కాలక్రమేణా ఆ అరవై వేలమందీ పెరిగి పెద్దవాండ్లు అయినారు: రూపయావన సంపన్నులు అయినారు.

రామా, సగరుడి జ్యేష్ఠపుత్రుడు అశ్వమంజుడు దుర్మార్గుడు అయిపోయి నాడు. వాడు అయోధ్యానగరములో చిన్నపిల్లలనుఅందరినీ ప్రతిరోజూ మాయ చేసి తీసుకొనిపోయి సరయూనదిలో పడత్రోసి వాండ్లు మునిగిపోతూ ఉంటే చూచి సంతోషించేవాడు. సజ్జనులను అందరినీ నానాబాధలూ పెట్టుతూ ఉండే వాడు. అయోధ్యాపౌరులు అందరికీ వాడు అరిష్టుడుఅయిపోయినాడు. అపాపా చారుణ్ణి సగరచక్రవర్తి తన జ్యేష్ఠపుత్రుడు అని మన్నించకుండా అడవులకు వెళ్ళగొట్టినాడు.

అశ్వమంజుడి పుత్రుడు అంశుమంతుడు. మహాపరాక్రమశాలీ ప్రియంవదుడూ సర్వలోకసమ్మతుడూ అయినాడు. ఓరామా, సగర చక్రవర్తి అంతట కొంతకాలానికి అశ్వమేధయాగము చేయవలెను అనుకొన్నాడు. వేత్తలుఅయిన ఋత్విజులను రావించినాడు. హయమేధము ఆరంభించినాడు."

## 3౯

సగరుడు అశ్వమేధము ఆరంభించినాడు అని విశ్వామిత్ర మహర్షి చెప్పగానే రాముడు ఉప్పొంగిపోయినాడు. అగ్నిహోత్రజ్వాలవలెనే తేజరిల్లుతున్న విశ్వామిత్ర మహర్షినిచూచి "ఓ బ్రాహ్మణోత్తమా, మాపూర్వికుడు సగర చక్రవర్తి అశ్వమేధయజ్ఞము ఏవిధముగా చేసిందీ తమరు వివరముగా చెప్పవలెను." అన్నాడు.

విశ్వామిత్ర మహర్షి నవ్వుతూ, ఈవిధముగా చెప్పడము మొదలు పెట్టినాడు.

"ఓరామా, హిమవత్పర్వతానికి ఎదురుగుండా వింధ్యపర్వతముఉంది. ఆ రెండుపర్వతాలు పరస్పరమూ చూచుకొంటూ ఉన్నట్లు ఉంటవి. ఆ రెండు కొండల మధ్యప్రదేశము యజ్ఞకర్మలకు మహాప్రశస్తము అయింది. ఆ ప్రదేశము లోనే సగర చక్రవర్తి అశ్వమేధము తలపెట్టినాడు. యజ్ఞాశ్వమువెంట తన మనుమణ్ణి అంశుమంతుణ్ణి పంపించినాడు. ఆ మహారథుడు ధనుర్ధరుడు అయి యజ్ఞాశ్వము వెంటపోయి దిగ్విజయముగా గుర్రముతో తిరిగివచ్చినాడు.

యజ్ఞములో పర్వసమయము (ఉక్థ్యకాలము) ఆసన్నము అవుతూఉంది. అప్పుడు ఎవరికీ తెలియకుండా దేవేంద్రుడు రాక్షసవేషము వేసుకొనివచ్చి ఆ యజ్ఞాశ్వాన్ని ఇట్టే దొంగిలించుకొనిపోయినాడు. అదిఎవరూ గమనించలేదు. సమయానికి గుర్రము కనబడకుండా పోయినందువల్ల ఋత్విజులు సగరుణ్ణిచూచి "ఓరాజా, యజ్ఞాశ్వాన్ని ఎవరో ఎత్తుకొనిపోయినారు. ఆ దొంగిలించుకొని పోయినవాణ్ణి చంపించి తత్క్షణమే ఆగుర్రాన్ని తెప్పించవలెను. అట్లా నీవు చేయకపోయేట్లయితే యజ్ఞచ్ఛిద్రమువల్ల నీకూ మాకూ అమంగళము అవుతుంది. ఏ లోపమూ లేకుండా యజ్ఞము సమాప్తము అయ్యేట్లు నీవు చేయవలెను" అని చెప్పినారు.

ఋత్విజులు చెప్పింది అంతా సగరుడు విన్నాడు. ఆ సదస్సులో ఉన్న తన అరవై వేలమంది పుత్రులనూ చూచి "ఓ వీరులారా, మహానుభావులు మంత్రపూతముగా క్రతువును నడిపిస్తూఉన్నారు. అందువల్ల బ్రహ్మరాక్షసులు ఈ యజ్ఞాన్ని చెడకొట్టే అవకాశములేదు. ఎవడో దుర్మార్గుడు గుర్రాన్ని ఎత్తు

కొనిపోయినాడు. పుత్రులారా, సముద్రవలయితము అయిన ఈభూభాగాన్ని అంతా వెదకి మీరు అశ్వాన్ని పట్టుకొని రావలెను. మీరు ఒక్కొక్కరు ఒక్కొక్క యోజనము మేర వెతకవలెను. ఈ భూమిమీద మీకు అశ్వము కనపడకపోయేట్లయితే ఈభూమిని బ్రద్దలుకొట్టి భూగర్భములోకిపోయి అశ్వము కనపడేటంతవరకు మీరు వెదకవలెను. నేను యజ్ఞదీక్షలో ఉన్నాను. అందువల్ల మీరు అశ్వాన్ని పట్టుకొని వచ్చేటంతవరకూ ఈ ఋత్విజులతోనూ ఈ అంశుమంతునితోనూ నేను ఇక్కడనే ఉంటాను. ఇక మీరు బయలుదేరవలెను. మీకు శుభము అవుతుంది" అంటూ ఆశీర్వదించి ఆజ్ఞాపించినాడు.

పితృాజ్ఞను శిరసావహించి అరవై వేలమంది సాగరులూ పరమోత్సాహముతో ఈభూమిమీద ప్రతిప్రదేశమూ వెదకసాగినారు. అశ్వము ఎక్కడనూ కనిపించలేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క యోజనము పొడుగూ వెడల్పూ ఉన్న భూభాగాన్ని త్రవ్వటము మొదలు పెట్టినారు. వజ్రాయుధమువంటి శూలాలతోనూ మహాభయంకరముఅయిన హలాయుధాలతోనూ ఈభూమిని బ్రద్దలుకొట్ట నారంభించినారు.

ఓరామా, సగరపుత్రులు ఈ భూమిని చితుకకొట్టుతూ ఉంటే విన శక్యముకాని ధ్వని బయలుదేరింది. వారు ఈ జంబూద్వీపములోఉన్న పర్వతాలను అన్నిటిని పగులకొట్టినారు. ఆ అరవై వేలమంది అరవై వేల యోజనాల భూమిని పాతాళలోకమువరకూ త్రవ్వకొంటూపోయినారు. ఆ సాగరుల దెబ్బకు భూగర్భములో ఉంటూఉన్న అసురులు నాగులూ రాక్షసులూ హతముఅయి పోతూ హాహాకారాలు చేయసాగినారు. వాండ్ల ఏడుపులకు పెడబొబ్బలకూ ఈజగత్తు అంతా సంచలించిపోయింది.

అప్పుడు దేవతలూ గంధర్వులూ అసురులూ పన్నగులూ మొదలుఅయిన వారు అందరూ భయభ్రాంతులు అయిపోయినారు. వారు అందరూ బ్రహ్మదేవుడి దగ్గిరకుపోయి ఆయన పాదాలమీద పడి మ్రొక్కి గజగజ వణుకుతూ విషణ్ణముఖాలతో "ఓ భగవంతుడా, సాగరులు ఈభూమిని అంతా త్రవ్వివేస్తున్నారు. భూగర్భములోనివసిస్తూఉన్న అనేకమంది మహాత్ములను హతమారుస్తూ ఉన్నారు. కంటికి అగుపించిన ప్రతివాణ్ణీ 'నీవే మా యజ్ఞాశ్వాన్ని ఎత్తుకొని పోయినావు." అంటూ చంపివేస్తున్నారు. సర్వభూతాలనూ నాశనముచేసి వేస్తున్నారు." అంటూ మొర పెట్టుకొన్నారు.

## ౪౦

దేవతలూ మొదలు అయిన వారు అందరూ చెప్పింది అంతా బ్రహ్మదేవుడు విన్నాడు.

"ఓ దేవతలారా, ఈ భూమి అంతా మహావిష్ణువుది. ఆయన ఎప్పుడూ ఈ భూమిని కాపాడుతూనే ఉన్నాడు. ఈ సాగరులు ఆయన కోపానలానికి దగ్ధులు అయిపోతారు. వీరు అందరూ ఈభూమిని ఇట్లా బద్దలుకొట్టుతారు అనీ తవ్వుతారుఅనీ వీరు అందరూ అల్పాయుష్కులుఅనీ ఇదివరకే నిర్ణయము అయిపోయింది'' అన్నాడు బ్రహ్మదేవుడు.

అంతట ముప్పయిముగ్గురు దేవతలూ అష్టవసువులూ ద్వాదశాదిత్యులూ ఇద్దరు అశ్వినులూ ఏకాదశరుద్రులూ ఇంకామిగతా దేవతలూ గంధర్వులూ మొదలుఅయినవారు అందరూ సంతోషపడి తమతమ తావులకు వెళ్ళిపోయినారు.

ఓ రామా, సాగరులు ఈభూమిని ఆ విధముగా బద్దలుకొట్టుతూఉండగా వారికి చేటుకాలము ఆసన్నము అయింది అని సూచించడానికి పిడుగుపడ్డంత ధ్వని అయింది.

సాగరులు ఈ భూమిలో ప్రతి అంగుళమూ తిరిగి చూచినారు. త్రవ్వి చూచినారు. ప్రయోజనము లేకపోయింది. అంతట వారు అందరూ సగర చక్రవర్తి దగ్గరకుపోయి "ఓ తండ్రీ ఈ భూభాగాన్ని అంతా వెదకి చూచినాము. తవ్విచూచినాము. అడ్డమువచ్చిన దేవదానవయక్షరాక్షసపిశాచోరగకిన్నరులను చంపివేసినాము. గుఱ్ఱముకానీ, గుఱ్ఱాన్ని దొంగిలించుకొని పోయినవాడు కానీ మాకు ఎక్కడనూ కనిపించలేదు. ఇక మేము ఏమి చేయవలెనో మీరు ఆలోచించవలెను'' అన్నారు.

సగరుడు మహోగ్రుడు అయిపోయి "ఓ పుత్రులారా, అప్రయోజకులుగా మీరు నా ఎదటికి ఎందుకు వచ్చినారు. మళ్ళీపొండి. గుఱ్ఱాన్ని ఎత్తుకొనిపోయిన వాణ్ణి పట్టుకొనిరండి. పొండి" అని అజ్ఞాపించినాడు.

అరవై వేలమంది సాగరులూ అంతట ఈభూమిమీద పరుగులు తీసినారు. గుఱ్ఱము ఎక్కడనూ కనపడలేదు. తిరిగి భూమిని తవ్వకుంటూ భూగర్భములో చొరపడ్డారు. అక్కడవారికి కొండ అంత ఏనుగు కనిపించింది. అది విరూపాక్షము అనేదిగ్గజము. ఓ రామా, ఎన్నెన్నో మహాపర్వతాలూ ఎన్నెన్నో మహారణ్యాలూ ఇంకా ఎన్నో మహానదులూ ఉన్న ఈ భూమిని మోస్తూఉన్న దిగ్గజాలలో విరూపాక్షము ఒకటి. ఈ భూభారవహానానికి దానికి అలుపువచ్చి అది ఒక్కసారి ఇట్టే తల కదిలిస్తే భూకంపము అవుతుంది.

ఆ విరూపాక్షానికి సాగరులు ప్రదక్షిణము చేసి పూజ చేసినారు. అంతట వారు ఆ తూర్పు దిక్కు వదిలిపెట్టి దక్షిణ దిక్కున తవ్వుకొంటూ పోయి అక్కడ మహాపద్మము అనే దిగ్గజాన్ని చూచినారు. అదిన్నీ ఒక మహాపర్వతము మాదిరిగా కనిపించింది. దానికిన్నీ ప్రదక్షిణము చేసినారు. అక్కడ నున్నూ గుర్రము కానీ గుర్రాన్ని ఎత్తుకొని పోయినవాడు కానీ కనిపించలేదు. అంతట వారు పడమటి దిక్కున తవ్వటము ఆరంభించినారు. మహాపర్వతము మాదిరిగా ఉన్న సౌమనసము అనే దిగ్గజాన్ని చూచి ప్రదక్షిణము చేసి దాని క్షేమము అడిగి తెలుసుకొని ఆ దిక్కు వదిలిపెట్టి ఉత్తరదిక్కున హిమాలయా పర్వతప్రదేశాన తవ్వుకొంటూ పోయినారు. అక్కడ మంచుకొండ మాదిరిగా ఉన్న భద్రము అనే దిగ్గజాన్ని చూచి దానికి ప్రదక్షిణము చేసినారు. దాన్ని తాకి చూచినారు. ఆ దిక్కునకూడా గుర్రము కానీ గుర్రాన్ని ఎత్తుకొనిపోయినవాడు కానీ కనిపించలేదు. అఱవైవేలమంది సాగరులూ మహాబలవంతులు. చండవేగులు. మహారోషముతో ఈశాన్యదిక్కున తవ్వుకొంటూ భూగర్భములో సాగిపోయినారు. అప్పుడు వారు అక్కడ కపిల రూపముతో మహామునిగా ఉంటూ ఉన్న విష్ణుమూర్తినీ ఆ సమీపములోనే గరిక మేస్తూ ఉన్న యజ్ఞాశ్వాన్నీ చూచినారు. సాగరులకు పట్టశక్యము కాని సంతోషము వచ్చింది.

ఆ కపిలమహాత్మే ఆ గుర్రాన్ని దొంగిలించుకొని వచ్చినాడు అని సాగరులు అనుకొన్నారు. క్రోధావేశపరవశులు అయిపోయినారు. కన్నులు ఎర్ర చేసినారు. పలుగులూ పారలూ నాగళ్ళూ పెద్దపెద్ద రాళ్లూ చెట్లూ చేతులలో తీసుకొని "లే నిలుచో" అని కేకలు పెట్టుకొంటూ కపిలుడిమీదికి పరుగెత్తి "ఓదుర్బుద్ధీ, నీవు మా యజ్ఞాశ్వాన్ని అపహరించి తెచ్చినావు. మేము ఎవరము అనుకొన్నావో-సాగరులము" అంటూ ఆయనమీద పడ్డారు.

రామా, కపిలుడికి అప్పుడు మహా చెడ్డకోపము వచ్చింది ఆ అప్రమేయుడు హుంకారము చేసినాడు. అరవై వేల మంది సాగరులూ బూడిదబుంగలు అయిపోయినారు.

## ౪౧

ఓ రామా, ఎంతకాలము అయిపోయినా సాగరులు తిరిగీ రాకపోయినందువల్ల సగరచక్రవర్తి తనమనుమడు అంశుమంతుణ్ణిచూచి "నాయనా, నీవు శూరుడవు. అస్త్రశస్త్ర విద్యలలో ఆరితేరినవాడవు. మనపూర్వీకులతో సరిసమానము అయిన పరాక్రమవంతుడవు. నీ పినతండ్రులు ఏమిఅయిపోయినారో- గుర్రాన్ని ఎవరుదొంగిలించుకొనిపోయినారో నీవుపోయి వెదికి తెలుసుకొని గుర్రాన్ని తీసు

కొని రావలెను. భూగర్భములో మహావీర్యవంతము లయిన ప్రాణికోట్లుఎన్నో ఉన్నవి. అవిఅన్నీ మహాబలయుతము అయినవి. వాటిని ఎదుర్కొనడానికి నీవు ఖడ్గమూ కార్ముకమూ తీసుకొని పోవలెను. దారిలో నమస్కారము చేయవలసినవారికి శిరము ఒగ్గుతూనూ అడ్డుతగిలినవారిని హతమారుస్తూనూ నీవు కృతార్థుడవుఅయి రావలెను. నీవు నాచేత ఈ యజ్ఞము సమాప్తము చేయించవలెను" అని ఆజ్ఞాపించినాడు.

అంతట అంశుమంతుడు ఖడ్గమూ కార్ముకమూ తీసుకొని ప్రయాణము అయి తనపినతండ్రులు త్రవ్వుకొనిపోయిన దారినిపట్టి భూగర్భములోకి పోయినాడు. పోగాపోగా దైత్య దానవ యక్ష రాక్షస పిశాచోరగులూ మొదలు అయినవారు అందరూ పూజించే దిగ్గజము కనిపించింది. ఆ ఏనుగుకు అంశుమంతుడు ప్రదక్షిణముచేసి దాని క్షేమము అడిగి తెలుసుకొని తనపినతండ్రులను గురించీ తనతాతగారి యజ్ఞాశ్వాన్ని గురించీ విచారించినాడు. ఆ దిగ్గజము "ఓ అంశుమంతుడా, యజ్ఞాశ్వము నీకుదొరుకుతుంది. నీవు కృతార్థుడవు అవుతావు. వేగిరముగానే తిరిగిపోతావు" అని చెప్పింది. అంతట అంశుమంతుడు మిగతా మూడుదిక్కులలో దిగ్గజాలనూ వరుసగా చూస్తూ తన పినతండ్రులను గురించీ యజ్ఞాశ్వాన్ని గురించీ ప్రశ్న చేస్తూ పోయినాడు.

ఓ రామా, ఆయాదిక్కులలో ఈ భూమిని మోస్తూఉన్న దిగ్గజాలు అన్నిటికీ అన్ని భాషలూ వచ్చును. అవి మానవులతో చక్కగా మాట్లాడకలవు. ఆ ఏనుగులు చెప్పినప్రకారము అంశుమంతుడు ఈశాన్యదిక్కున దిగి భూగర్భములోకి పోయినాడు. తన పినతండ్రులు అందరూ ఏమి అయిపోయినారోనని అంతవరకూ చింతిస్తూఉన్న అంశుమంతుడు వారుఅందరూ భస్మములుఅయిపోయి అక్కడ బూడిదరాసులుగా ఉన్నారు అని తెలుసుకొన్నాడు. ఏడువసాగినాడు. అక్కడనే అటూఇటూ తిరుగుతూఉన్న యజ్ఞాశ్వాన్ని చూచినాడు.

అప్పుడు అంశుమంతుడు తన పినతండ్రులకు జలతర్పణము వదలవలెను అనుకొన్నాడు. ఎంతవెదకినా ఆ ప్రదేశములో జలాశయము ఎక్కడనూ కనిపించలేదు. ఎక్కడనయినా నీళ్ళుదొరుకుతవి ఏమోనని దృష్టిసారించి చూస్తూ ఉన్నాడు. వాయువేగముతో సంచారముచేసే గరుత్మంతుడు అక్కడ కనిపించినాడు. ఆయన సాగరుల మేనమామ. ఖగరాజు. మహాబలవంతుడు.

ఆ గరుత్మంతుడు అంశుమంతుణ్ణిచూచి "నాయనా, నీ పినతండ్రులు చనిపోయినారు, అని నీవు దుఃఖపడవద్దు. లోకహితముకోసము కపిలుడు వారిని దగ్ధము చేసివేసినాడు. అందువల్ల ఓ బుద్ధిమంతుడా వారికి ఈ లోకములో

నీళ్ళతో తర్పణాలువదిలితే ప్రయోజనములేదు. నాయనా, హిమవంతుడి పెద్ద కూతురు గంగాదేవి నదీరూపాన దేవలోకములో సంచారము చేస్తూంటుంది. ఆ గంగ లోకపావని. ఆ గంగానదీ జలాలతో నీ పినతండ్రులకు జలతర్పణాలు వదలవలెను. అంతేకాదు. ఆ గంగా పవిత్రోదకాలు ఈ భస్మరాసులమీద ప్రవహించవలెను. నీవు ఇప్పుడు ముందుగా యీ అశ్వాన్ని తీసుకొనిపోయి నీ తాతగారిచేత యజ్ఞము సమాప్తము చేయించవలసింది. ఆతరువాత నీ పినతండ్రు లకు జలతర్పణాలు వదిలేవిషయము ఆలోచించవచ్చును" అని చెప్పినాడు.

గరుత్మంతుడు చెప్పిందిఅంతా సావధానముగా అంశుమంతుడు విన్నాడు. అంతట ఆ యశస్వి అశ్వాన్ని తీసుకొని యజ్ఞదీక్షలోవున్న సగరుడిదగ్గరకు పోయి సాగరుల గతీ గరుత్మంతుడి హితబోధ తెలియచెప్పినాడు.

ఆ భయంకర వృత్తాంతము అంతా సగరచక్రవర్తి విన్నాడు. దుఃఖ పడ్డాడు. ఆయన ధీమంతుడు. యథాశాస్త్రముగా యథాక్రమముగా అశ్వమేధ యాగము పూర్తిచేసినాడు.

అంతట సగరుడు గంగాప్రవాహాన్ని యీ భూమిమీదికి తెప్పించే ఉపా యము ఆలోచించసాగినాడు. ఎంతకాలానికీ కృతకృత్యుడు కాలేక పోయి నాడు. బహుకాలము రాజ్యము ఏలి దివంగతుడు అయిపోయినాడు.

## ४२

రామా, సగరుడు కాలధర్మము అయిపోగానే మంత్రులు ప్రజానుమ తితో అంశుమంతుడికి పట్టము కట్టినారు. ఆ మహాధార్మికుడు ఎంతో గొప్పగా రాజ్యపాలనము చేసినాడు.

ఆయన పుత్రుడు దిలీపుడు జగత్ప్రసిద్ధుడు అయినాడు. అంశుమంతుడు ఆ దిలీపుడికి రాజ్యపాలనము ఒప్పచెప్పినాడు. అంతట ఆయన గంగానదిని ఈ భూమిమీదికి తీసుకొని రావలెను అనే సంకల్పముతో హిమవత్పర్వతశిఖరా నికి పోయి అక్కడ బహుకాలము దారుణముగా తపస్సు చేసినాడు. కృతకృ త్యుడు కాకుండానే స్వర్గతుడు అయిపోయినాడు.

దిలీపమహారాజు అమిత పరాక్రమవంతుడు. ఆయన తన ముత్తాతలు అందరూ భస్మము అయిపోయినందుకు దుఃఖోపహతుడు అయిపోయినాడు. గంగను భూమిమీదికి రప్పించడము ఎట్లాగు అనీ సాగరులకు జలతర్పణాదులు వదలడము ఎట్లాగు అనీ అమితముగా ఆలోచించినాడు. ఓ రామా, ఆ దిలీపుడు విదితాత్ముడు. ఎప్పుడూ ధర్మచింత చేస్తూ ఉండేవాడు. ఎన్నో యజ్ఞాలు చేసినాడు.

తన ముత్తాతలను ఉద్ధరించే ఉపాయముతో దిక దిగులుపడిపోయినాడు. ఆదిగులుతోనే వ్యాధిగ్రస్తుడు అయిపోయి తన పుత్రుడు భగీరథునికి రాజ్యాభిషేకము చేసినాడు. ఆ దిగులుతోనే చివరకు చనిపోయినాడు. పుణ్యకర్మలవల్ల స్వర్గతుడు అయినాడు.

రామా, భగీరథుడు మహాతేజోవంతుడు. పరమధార్మికుడు. ఆయనకు సంతానము కలగలేదు. సంతానము కోసమూ గంగాజలాలను ఈ భూమిమీదికి రప్పించడము కోసమూ తపస్సు చేయ సంకల్పించుకొన్నాడు. రాజ్యపాలనము మంత్రుల పరము చేసి గోకర్ణక్షేత్రానికి పోయి మండువేసంగిలో పంచాగ్నుల మధ్యను చేతులు పైకిఎత్తి నిలుచుని మాసానికి ఒక్కసారే భోజనము చేస్తూ జితేంద్రియుడు అయి బహుకాలము తపస్సు చేసినాడు.

ఆయన తపస్సుకు బ్రహ్మదేవుడు మెచ్చుకొని దేవతలతో కూడా బయలుదేరి వచ్చి భగీరథుణ్ణి చూచి "ఓ రాజా, నీ తపోవ్రతానికి నేను సంతుష్టుణ్ణి అయినాను. ఏదిఅయినా వరము అడుగు. ఇస్తాను" అన్నాడు. ఆ మహాతేజోవంతుడు బ్రహ్మదేవుడికి నమస్కారము చేసి "ఓ భగవంతుడా, నా తపస్సుకు నీవు సంతుష్టుడవు అయినట్లయితే—నా తపస్సు నీవు ఫలప్రదము చేయతలచినట్లయితే గంగాజలాలతో నేను నా ముత్తాతలకు తర్పణాలు వదిలేట్టున్నూ వారి భస్మరాసుల మీద గంగాజలము ప్రవహించి వారు స్వర్గతులు అయ్యేట్టున్నూ చేయవలెను. ఓస్వామీ, ఇక్ష్వాకువంశము నాతో క్షీణించిపోకూడదు. నాకు పుత్రసంతానము అనుగ్రహించవలెను" అన్నాడు.

బ్రహ్మదేవుడు మంగళకరముగానూ మనోహరముగానూ "ఓ మహారథా, నీ మొదటి కోరిక దుర్లభము అయింది.

అయినప్పటికీ నెరవేరుతుంది. నీ వంశము వర్ధిల్లుతుంది. నీకు సుపుత్రుడు పుట్టుతాడు. నాయనా, గంగాదేవి హిమవంతుడి పెద్దకూతురు. ఆ నది ఈ భూమిమీద పడేట్లయితే దానిపాటుకు ఈ భూమి తట్టుకోలేదు. నీవు భూపతివి. ఈ భూదేవి మేలు నీవు గుర్తుఉంచుకోవలెను. ఆ గంగ పాటును ధరించకలవాడు హరదేవుడు ఒక్కడే. ఆయనను నీవే ప్రార్థించవలెను" అని చెప్పి గంగాదేవిని చూచి "ఓ గంగా, ఈ భగీరథుడి కోరికలు నీవు నెరవేర్చవలెను." అని చెప్పినాడు. అంతట బ్రహ్మదేవుడు దేవతలతో కూడా దేవలోకము వెళ్లిపోయినాడు.

## ౪౩

భగీరథుడు కాలి బొటనవేలిమీద నిలుచుని శివుణ్ణిగూర్చితపస్సు చేయనారంభించినాడు. ఒక సంవత్సరముఅయిపోయింది. సర్వలోకనమస్కృతుడుఅయిన శివుడు సంతోషించి భగీరథుణ్ణి చూచి "ఓపురుషపుంగవా, నేను నిన్ను మెచ్చుకొన్నాను. నీ కోరిక నెరవేరుస్తాను. గంగను నా శిరస్సున ధరిస్తాను'" అన్నాడు. అంతట హిమవంతుని జ్యేష్ఠపుత్రి గంగాదేవి మహదాకారముతో దుస్సహము అయిన వేగముతో ప్రయాణము అయి వచ్చి శుభకరము అయిన హరదేవుడి శిరస్సుమీదికి దూకనుంకించింది.

ఓ రామా, గంగాదేవిని ధరించకలవారు ఈలోకములో ఎవరూ లేరు. ఆగంగాదేవి శివుడి శిరస్సుమీదికిదూకి తన ప్రవాహవేగముతో ఆ శివుణ్ణి తనతోపాటు పాతాళలోకములోకి లాగుకొనిపోవలెను అనుకొన్నది. ఆమె అభిప్రాయము త్రినేత్రుడికి తెలిసింది. ఆ గంగకు అంత గర్వమా అని హరదేవుడికి కోపము వచ్చింది. ఆ గంగాదేవిని బంధించివేయ సంకల్పించినాడు.

గంగాదేవి హరదేవుడి శిరముమీదికి దూకింది. ఆయన శిరస్సునఉన్న జడలలో ప్రవేశించింది. అప్పుడు ఆ జటలు హిమాలయపర్వతగుహలు అంతవి అయిపోయినవి. ఆ జటాగహ్వరాలలో అటూఇటూ తిరుగుతూ గంగ చిక్కుబడిపోయింది. అక్కడనుంచి ఆపుణ్యగంగ బయటపడలేక పోయింది. ఈ భూమిని చూడటము ఆమెకు అశక్యము అయిపోయింది. ఆ గంగాదేవి ఎవరికంటికీ కనబడకుండా బహుకాలము శివజటాగహ్వరాలలో తిరుగుతూ ఉండవలసి వచ్చింది.

గంగాదేవి కనబడకుండా పోయినందువల్ల భగీరథుడు మళ్ళీ మహోగ్రముగా తపస్సుచేయ నారంభించినాడు. అంతట శివుడు భగీరథుడిమీద ఆదరముతో ఆగంగను తన జటాజూటాలలోనుంచి బిందుసరోవరములో వదిలిపెట్టినాడు. ఆసరోవరములోనుంచి గంగ ఏడుపాయలుగా ఈభూమిమీద ప్రవహించింది. హ్రాదినీ నలినీ పావనీ అనే మూడుపాయలు తూర్పు దిక్కుగాపోయినవి. ఆమూడుపాయలలో జలమూ మంగళకరముఅయింది. అదేవిధముగా నిర్మలోదకాలతో పడమటిదిక్కుకు సుచక్షూ సీతా సింధూ అనేపేర్లతో మూడుపాయలుగా ప్రవహించింది. ఏడవపాయ భగీరథ రాజర్షి వెంట బయలుదేరింది.

భగీరథమహారాజు దివ్యముఅయిన రథముమీద ప్రయాణము అయినాడు ఆరథము ఈభూమిమీద ఎటుపోతే, గంగ అటు ప్రవహించింది.

గంగ ఆకాశమునుంచి శివుడి శిరస్సుమీదికీన్నీ అక్కడనుంచి భూమి మీదికీన్నీ దూకడములో పెద్ద హోరు పుట్టింది. ఆ మహాధ్వని ఈజగత్తును అంతా ఆకర్షించింది.

మహాద్భుతము అయిన గంగావతరణాన్ని చూడటానికి దేవతలూ గంధర్వులూ యక్షులూ సిద్ధులూ మొదలు అయిన వారు అందరూ పెద్దపెద్దపట్టణాలు అంతటి విమానాలలోనూ దిట్టము అయిన ఏనుగులమీదనూ గుర్రాలమీదనూ అప్పుడు అక్కడికి వచ్చినారు. వారుఅందరూ రావటములో మేఘాలు చెల్లా చెదరు అయిపోయినవి. అందువల్ల ఆకాశము నిర్మలముగా కనిపించింది.

ఆ దేవతల దేహకాంతుల వల్లనూ వారు ధరించిన దివ్యాభరణాల ధగధగ వల్లనూ నూరుగురు సూర్యులు ఉదయిస్తున్నట్టుగా అప్పుడు ఆకాశము కనిపించింది.

గంగా ప్రవాహముతో తాబేళ్ళూ మొసళ్ళూ పాములూ చేపలూ ఇంకా ఇతర జలచరాలూ యీ భూమిమీద పడుతూవుంటే మెరుపులు మెరిసినట్టుగా ఆకాశము కనిపించింది.

గంగాప్రవాహ పాతము తెల్లటినురుగులు ఎగచిమ్ముతూనూ ధౌత కాంతులతో హంసలు ఎగురుతూనూ ఉంటే శరత్కాలములో వలె తెల్లటి మేఘాలతో తళతళలాడుతూ ఆకాశము అగుపించింది.

గంగానది ఒకచోట అతివేగముగానూ ఒకచోట మందముగానూ ఒక చోట వంకరటింకరగానూ ఒకచోట విశాలముగానూ ఒకచోట వంగినట్టు గానూ ఒకచోట పైకిలేచినట్టుగానూ తరంగాలు తరంగాలుగా ఎగురుతూనూ కిందికి దూకుతూనూ ఎంతో దర్శనీయముగా ప్రవహించింది. అవిఘ్నముగా ప్రవహించడములో జలము నిష్కల్మషమూ నిర్మలమూ అయింది. శివదేవుడి జటాజూటాలలో తిరిగి బయటపడ్డందువల్ల అది పరమ పవిత్రము అయింది.

అప్పుడు దేవతలూ మానవులూ ఆ పావనోదకాలలో స్నానముచేసినారు. శాపగ్రస్తులుఅయి అంతవరకూ భూమిమీద పడిఉన్నవారు అందరూ అప్పుడు ఆ పుణ్యోదకాలలో స్నానముచేసి పాపవిముక్తులూ శాపవిముక్తులూ అయి యథారూపాలతో తేజరిల్లుతూ ఆకాశమార్గాన తమతమ తావులకు తరలిపోయినారు. దివ్యకాంతులతో ప్రవహిస్తూఉన్న గంగనుచూచి ప్రజలు అందరూ మురిసిపోయి పదేపదే ఆ గంగా జలాలలో మునగడము మొదలు పెట్టినారు. స్నానముచేయగానే వారివారి సమస్తశ్రమలూ సమసిపోయి సుఖము అనుభవించ సాగినారు.

ఓ రామా, భగీరథ రాజర్షి రథము వెంట గంగ ప్రవహించింది అని చెప్పినాను. ఆ గంగాప్రవాహాన్ని చూస్తూ దైత్యదానవయక్షరాక్షసగంధర్వమహోరగులూ అప్సరసలూ దేవతలూ మొదలు అయినవారు అందరూ వెంటనడిచినారు. భగీరథ రాజర్షి రథము జహ్నుమహర్షి యజ్ఞవాటికదగ్గరకుపోయింది. హఠాత్తుగా రథము అక్కడ ఆగింది.

మహావేగముతో భగీరథుడి రథము వెంట పరుగెత్తుకొని వస్తూఉన్న గంగ అట్లా హఠాత్తుగా ఆగలేకపోయింది. గంగాజలాలలో జహ్నుమహర్షి యజ్ఞవాటిక మునిగిపోయింది.

జహ్నుమహర్షికి పట్టరానికోపము వచ్చింది. ఆయన అనేక అద్భుత శక్తులు ఉన్నవాడు. ఆ గంగాజలాన్ని అంతా ఆయన ఇట్టే త్రాగివేసినాడు. అందరూ ఆశ్చర్యచకితులు అయినారు. భగీరథుడున్నూ గంగవెంట వస్తూఉన్నవారు అందరున్నూ జహ్నుమహర్షిని పూజించి "ఓ మహాత్మా గంగను తమ కొమార్తెగా భావించవలెను. లోకహితముకోసము తాము గంగను వదలిపెట్టవలెను" అని ప్రార్థించినారు. అందుకు జహ్నువు ఒప్పుకొన్నాడు. మహాప్రభావముతో ఆయన తన చెవులలోనుంచి ఆ గంగాప్రవాహాన్ని వదిలిపెట్టినాడు. అందువల్ల గంగ జహ్నుసుత అయింది, కనుక గంగను జాహ్నవీ అన్నారు.

గంగ యథాప్రకారము భగీరథ రథము వెంట బయలుదేరింది. ఆయన సాగరములోకి పోయినాడు. ఆయనతోపాటు గంగకూడా సముద్రములోకిపోయింది. ఆయన అక్కడనుంచి పాతాళలోకములోకి పోయినాడు. గంగా ఆయనవెంట పాతాళములోకి పోయింది.

అక్కడ భగీరథ రాజర్షి తన పితామహుల భస్మరాసులను గంగకు చూపించినాడు. ఆ మహామహుడి ప్రయత్నము సఫలము చేయడానికి గంగ ఆ భస్మరాసులమీద ప్రవహించింది. సాగరులు అందరూ అంతట నిష్పాపులు అయినారు. స్వర్గతులు అయినారు.

## ౪౪

గంగా ప్రవాహము సాగరుల భస్మరాసులను ముంచివేయగానే బ్రహ్మదేవుడు వచ్చి భగీరథుణ్ణి చూచి "ఓ రాజశార్దూలమా, అరవైవేల మంది సాగరులున్నూ తరించినారు. స్వర్గలోకము పోయినారు. సముద్ర జలాలు ఇంకిపోకుండా ఉంటేటంతవరకున్నూ సాగరులు దేవలోకములో దేవతల మాదిరిగా

సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూ ఉంటారు. ఈ గంగను నీవు తండ్రివి అని భూలోకములో అందరూ చెప్పుకొంటారు. అందువల్ల ఈ గంగను భాగీరథి అంటారు. ఈ గంగ స్వర్గమర్త్య పాతాళ లోకాలలో ప్రవహించింది కనుక త్రిపథగ అయింది. ఓరాజా, ఇక నీవు ఈ గంగాజలాలతో నీ పితరులు అందరికీ ధర్మోదకాలు వదిలి పెట్టవలసింది. అంతటితో నీ అభీష్టము నెరవేరుతుంది."

ఓ భగీరథ మహారాజా, పరమ ధార్మికుడు అనీ మహాపరాక్రమవంతుడు అనీ ప్రసిద్ధికెక్కిన నీ ముత్తాత సగర చక్రవర్తి ఈ గంగను భూమి మీదికి రప్పించవలెను అని ఎంతో ఆలోచించి మనోరథము ఈడేరకుండానే స్వర్గతుడు అయినాడు. అప్రతిమాన తేజోవంతుడు అయిన నీ తాత అంశుమంతుడు ఈ గంగను ఈ భూమిమీదికి తేవలెను అని పెద్ద ప్రయత్నము చేసి కాలధర్మము చెందినాడు. నీ తండ్రి దిలీపుడు - రాజర్షి - మహాగుణవంతుడు - క్షత్రధర్మము తప్పనివాడు-ఈ గంగను భూమిమీదికి తెప్పించ వలెను అనుకొని ఉపాయము తెలుసుకోకుండానే స్వర్గతుడు అయిపోయినాడు. నీ పెద్దలకు ఎవరికీ చేతకాని ప్రయత్నము నీవు చేసినావు. నీ ప్రయత్నము సఫలము అయింది. నీవు పరమ యశస్వి అయినావు. నీ నుంచి ఈ భూమిమీద గంగ అవతరించింది. నీకు ధర్మప్రతిష్ఠ లభ్యము అయింది.

ఓ రాజోత్తమా, ఈ గంగాజలము సముద్రజలము వంటిదికాదు. సర్వకాల సర్వావస్థలలోనూ స్నానయోగ్యముగానూ పానయోగ్యముగానూ ఉంటుంది. నీవున్నూ ఈ గంగానదిలో స్నానము చేయవలసింది. పరిశుద్ధుడవు అవుతావు. నీకు శుభము అవుతుంది పుణ్యము వస్తుంది" అంటూ అంతర్ధానము అయిపోయినాడు.

ఓ రామా, ఆయశస్వి భగీరథ మహారాజు గంగాస్నానము చేసి పరిశుద్ధుడు అయి సాగరులు అందరికీ యథాశాస్త్రముగా యథాక్రమముగా ధర్మోదకాలు వదిలినాడు. అయోధ్యా పట్టణానికి పోయినాడు. రాజ్యపాలనము ఆరంభించినాడు. ఆయన పరిపాలనములో సకలార్థాలూ సమృద్ధముగా వర్ధిల్లినవి. ప్రజలు ఏ దిగులూ ఏ పీడా లేకుండా సుఖపడ్డారు. సంతోషపడ్డారు.

ఓ రామా, నీవు అడిగిన గంగా వృత్తాంతము అంతా చెప్పినాను. ఇదిగో సంధ్యాకాలము అతిక్రమించ పోతూ ఉంది" అంటూ విశ్వామిత్ర మహర్షి లేచినాడు.

## ౨౫

రామ లక్ష్మణులు ఎంతో విస్మితులు అయిపోయి "ఓ బ్రహ్మర్షీ, తాము చెప్పిన గంగావతరణమూ గంగాసాగరప్రవేశమూ అత్యద్భుతముగా ఉంది. పరమపావనము అయిన కథ చెప్పినారు" అని విశ్వామిత్ర మహర్షిని స్తోత్రము చేసినారు.

వారు అందరూ ఆ రాత్రి అక్కడనే గడిపినారు.

రామ లక్ష్మణులు పడుకొన్నారే కాని గంగావతరణాన్ని గురించి చాలా సేపు ఆలోచించి ఆలోచించి నిద్రపోయినారు.

తెల్లగా తెల్లవారిపోయింది. విశ్వామిత్రమహర్షి సూర్యోదయము అయ్యే టప్పటికి ప్రాతరాహ్నికాలు ముగించుకొని ప్రయాణోన్ముఖుడు అయినాడు. రామలక్ష్మణులున్నూ వారి ఆహ్నికాలను పూర్తిచేసుకొని విశ్వామిత్రమహర్షికి నమస్కారము చేసినారు.

అంతట రాముడు "ఓ తాపసోత్తమా, కడచిన రాత్రి చాలా పవిత్రము అయింది. వినవలసినకథ విన్నాము. ఆ కథనుగురించి ఆలోచిస్తూ ఉండగానే రాత్రి ఇట్టే గడచిపోయింది. స్వామీ, తమకోసము నావ సిద్ధముగా ఉంది. కూర్చుండటానికి ఆస్తరణాలు చక్కగా అమర్చి ఉన్నవి. ఈ పుణ్యనదిని ఇప్పుడే దాటిపోదాము." అన్నాడు.

అంతట విశ్వామిత్రమహర్షీ రామలక్ష్మణులూ తక్కిన మహర్షులూ ఆ నావ ఎక్కి గంగానదినిదాటి ఉత్తరపు గట్టుకుపోయినారు. అక్కడి రామణీయకము చూస్తూ కొంచెముసేపు ఆగి ఆతరువాత వారు అందరూ వేగముగా నడువసాగినారు.

వారికి విశాలాపట్టణము కనిపించింది. అది చాలా అందము అయింది. రాముడు విశ్వామిత్రమహర్షిని చూచి "స్వామి, ఈ పట్టణము స్వర్గధామముగా కనిపిస్తూ ఉంది. ఇది ఏరాజవంశీయులదో తెలుసుకోవలెను అని కుతూహలముగా ఉంది. తాము చెప్పవలెను" అన్నాడు.

"ఓ రామా, ఈ విశాలాపట్టణ పూర్వవృత్తాంతము ముందుగా చెప్పుతాను. వినవలసింది. కృతయుగములో దితి పుత్రులు మహాబలవంతులుగానూ అదితి పుత్రులు మహాధార్మికులుగానూ ఉంటూ ఉండేవారు.

అనారోగ్యమూ వార్ధక్యమూ మృతీ లేకుండా ఉండడానికి ఉపాయము ఏమిటి అని వారు అందరూ ఏకము అయి ఆలోచించసాగినారు. పాలకడలిని

చిలికితే అమృతము పుట్టుతుంది అనీ ఆ అమృతాన్ని త్రాగితే జరామరణాలూ అనారోగ్యమూ లేకుండా పోతవి అనీ వారు నిశ్చయించినారు.

దైత్యులూ ఆదిత్యులూ మంథరపర్వతాన్ని కవ్వముగానూ వాసుకి అనే మహాసర్పాన్ని కవ్వము త్రాడుగానూ చేసి క్షీరసముద్రాన్ని చిలకడము మొదలు పెట్టినారు. ఆ విధముగా వారు చాలాకాలము మథించినారు. అప్పుడు వాసుకి ముఖాలు అన్నీ విషము కక్కడము మొదలుపెట్టినవి. ఆ మహాసర్పము మంథరపర్వతములో రాళ్లను అన్నిటినీ కరవడము మొదలు పెట్టింది. అంతట ఆ మహాసముద్రములో హాలాహలము అనే విషము మంటలు మండుతూ పైకి లేచింది. ఆ మంటలకు దేవ దానవ మానవ సహితము అయిన ఈ జగత్తు అంతా దగ్ధము అయ్యేట్టుగా కనిపించింది. సమస్త ప్రాణకోటినీ కాపాడే రుద్రుణ్ణి దేవతలు శరణము వేడినారు. మహావిష్ణువున్నూ శంఖచక్రధారి అయి అక్కడికి వచ్చినాడు. ఆయన శూలభృత్తునుచూచి నవ్వుతూ "ఓ రుద్రుడా, నీవు ఈ దేవతలకు అందరికీ అగ్రజుడవు. కాబట్టి ఈ క్షీరసముద్ర మథనములో మొట్టమొదట పుట్టిన దానిని నీవు అగ్రనైవేద్యముగా స్వీకరించవలెను". అని చెప్పినాడు.

శివుడు దేవతల భయాన్ని గమనించినాడు. మహావిష్ణువు చెప్పింది ఆలోచించినాడు. అంతట ఆ మహాభయంకరముఅయిన హాలాహలాన్ని ఇట్టే త్రాగి వేసినాడు.

దేవదానవులు క్షీరసముద్రాన్ని తిరిగి మథించడము మొదలుపెట్టినారు. కవ్వముగాఉన్న మంథరగిరి పాతాళలోకమువరకూ దిగబడిపోవడము మొదలు పెట్టింది. అప్పుడు దేవతలు విష్ణుమూర్తినిచూచి "ఓ మహాబాహూ! నీవే మాకు దిక్కు. ఈ మంథరగిరిని నీవు తప్ప మరి ఎవరూ లేవనెత్తలేరు. కాబట్టి నీవు దీనిని లేవనెత్తి మమ్ములను కాపాడవలెను" అంటూ ప్రార్థించినారు.

విష్ణుమూర్తి తాబేలురూపము ధరించినాడు. ఆ పాలసముద్రములోకి పోయి తన వీపున ఆ మంథరగిరి నిలబడి ఉండేట్టుగా పడుకొన్నాడు.

ఆ మహావిష్ణువు పురుషోత్తముడు. సమస్తలోకాలకూ పరమాత్మ. మంథరగిరి దిగబడిపోకుండా కాపాడినాడు. అంతేకాదు. ఆ పర్వత శిఖరాన్ని పట్టుకొని దేవతలకు తోడుపడ్డాడు.

అప్పుడు ఆ పాలకడలిలో నుంచి ఒక చేతిలో దండమూ రెండవ చేతిలో కమండులువు పట్టుకొని ధన్వంతరి పుట్టుకొని వచ్చినాడు.

ఆ తరువాత ఆ సముద్రములోనుంచి ఒక రసము బయలుదేరింది. ఆ రస ములోనుంచి మంచి వర్చస్వినులుఅయిన అరవైకోట్లమంది కన్నెపడుచులు పుట్టుకొని వచ్చినారు. రసములో నుంచి పుట్టుకొని వచ్చినందువల్ల వాండ్లను అప్సరసలు అన్నారు. వాండ్లతోపాటు లెక్కపెట్టనలవికాని అంతమంది వాండ్ల పనికత్తెలున్నూ పుట్టుకొని వచ్చినారు. ఆ అప్సరసలను పెండ్లిచేసుకో డానికి దైత్యులూ ఇష్టపడలేదు. ఆదిత్యులూ ఇష్టపడలేదు. అందువల్ల వాండ్లు భోగముపడుచులు అయినారు.

అంతట ఆ పాలసముద్రములో నుంచి వరుణదేవుడి కూతురు వారుణీ అనే సురాధిదేవత బయటికి వచ్చింది. ఆ సురను పుచ్చుకోడానికి దైత్యులు ఇష్టపడ లేదు. ఆదిత్యులు ఆ సురను స్వీకరించినారు. అందువల్ల అప్పటినుంచీ ఆదిత్యులు సురలు అయినారు. సురను పుచ్చుకోనందువల్ల అప్పటినుంచీ దైత్యులు అసురులు అయినారు.

ఆ సురాగ్రహణమువల్ల దేవతల దేహాలు పులకలెత్తినవి. మహదానందము అనుభవించినారు.

ఆ తరువాత ఆ పాలసముద్రములోనుంచి గుర్రాలలో మేటిఅయిన ఉచ్చైఃశ్రవమూ మణులలో నాణ్యము అయిన కౌస్తుభమూ పుట్టుకొని వచ్చినవి.

చివరకు ఆ పాలసముద్రములో అమృతము ఉద్భవించింది.

ఆ అమృతముకోసము దేవదానవులు పోట్లాడుకోటము మొదలుపెట్టి నారు. దితిపుత్రులను అనేకులను అదితిపుత్రులు చంపివేసినారు. కులక్షయము అయ్యేటంత పోరాటము సాగింది. అప్పుడు దైత్యులు రాక్షసులతో ఏకముఅయి దేవతలను ఎదుర్కొన్నారు. ఆ యుద్ధానికి ముల్లోకాలూ తల్లడిల్లి పోయినవి. సర్వమూ నాశనము అయిపోతూ ఉంది. అప్పుడు మహావిష్ణువు మోహినీవేష ముతో వచ్చి అందరినీ మాయచేసి అమృతాన్ని అపహరించినాడు. అంతట అడ్డము వచ్చినవారిని అందరినీ పిండి పిండి చేసివేసినాడు.

ఆ ఘోరసంగ్రామములో దైత్యులను అందరినీ దేవతలు చంపివేసినారు.

దితిపుత్రులు అందరూ హతముఅయిపోయిన తరువాత దేవేంద్రుడు అమృ తాన్నీ త్రిలోకరాజ్యాన్నీ సంపాదించి సమస్తలోకాలనూ పరిపాలించ సాగినాడు.

## ౪౬

ఓ రామా, కొడుకులు అందరూ చనిపోయినందుకు దితి మహాఘోర ముగా ఏడ్చింది. భర్త అయిన కాశ్యపుణ్ణి చూచి "నాథా, మీ పుత్రులు

ఆదిత్యులు అమితబలవంతులు. వారు నా పుత్రులను అందరినీ చంపివేసినారు. ఇప్పుడు నేను పుత్రులు లేని దానిని అయినాను. ఇంద్రుణ్ణి జయించేటంత శక్తిమంతుడు అయిన పుత్రుణ్ణి తాము నాకు అనుగ్రహించవలెను. నేను ఎటు వంటి నియమాలతో నైనా తపస్సు చేస్తాను" అంటూ వేడుకొన్నది.

కాశ్యపుడు పరమదుఃఖములో ఉన్న దితితో "అట్లాగేను. మంచిది. నీకు మేలు అవుతుంది. అయితే నీవు పుత్రుణ్ణి కనేటంతవరకున్నూ ప్రతిదిపట్లా శుచిగా ఉండవలెను. నీవు చివరవరకూ శుచిగా ఉండకలిగేట్లయితే దేవేంద్రుణ్ణి సంహారముచేసి ముల్లోకాలూ ఏలేపుత్రుడు నీకు పుట్టుతాడు" అని చెప్పి ఆమెను ఊరడించినాడు. ఆమె దేహాన్ని అంతా నిమురుతూ ఆమెకు స్వస్తిచెప్పి అంతట ఆయన తపస్సు చేసుకోడానికి వెళ్ళిపోయినాడు.

పరమ సంతోషముతో దితి కుశప్లవము అనే ప్రదేశానికి ప్రయాణము అయింది. దేవేంద్రుణ్ణి జయించే కొడుకును కనడానికి సుదారుణము అయిన తపస్సు చేయడము మొదలు పెట్టింది.

ఓ రామా, దితి తపస్సు చేయడానికి పోవడము నెయ్యికన్నుల దేవేంద్రుడు కనిపెట్టినాడు. ఆయన మహామేధాసంపన్నుడు. నీతిజ్ఞుడు. ఆమెకు ఉప చారాలు చేయడానికి ఆమె వెనుకనే పోయినాడు. అగ్నినీ కుశలనూ సమిథ లనూ కందమూలఫలాలనూ ఇంకా ఆమెకు కావలసిన వాటిని అన్నిటినీ ఆమెకు అందించసాగినాడు. ఆమె డస్సిపోయినప్పుడు ఆమె ఒళ్లు పట్టే వాడు. అదీ ఇదీ అనకుండా ఆమె శ్రమాపనయనానికి అవసరము అయిన ఏపనిని అయినా చేయసాగినాడు. ఇంద్రుడు ఆ విధముగా ఉపచారాలు చేస్తూ ఉంటే ఆమె ఎంతో సంతోషపడ్డది. ఆయనను ఎంతో మెచ్చుకొన్నది.

ఆమె ప్రసవించే సమయము ఆసన్నము అయింది. ఆమె సంతోషాతి శయముతో "ఓ సురేంద్రా, ఇక కొద్దిరోజులలో నీకు తమ్ముడు పుట్టుతాడు. నిన్ను జయించేవాడు నాకు పుట్టవలెను అని నీ తండ్రిని నేను యాచించి నాను. ఆయన 'అట్లాగేను' అని వరము ఇచ్చినాడు. అందువల్ల త్రిలోక విజయుడు నాకు పుట్టబోతున్నాడు. అయితే నీ మీదికి యుద్ధానికి బయలు దేరకుండా నేను నా కుమారుణ్ణి సమాధానపరచి నీతో స్నేహముగా ఉండేట్లు చేస్తాను. నీవు ఏ దిగులూ లేకుండా నాపుత్రుడి సాహాయ్యముతో ముల్లోకాలూ ఏలుతూ ఉండవచ్చును" అని చెప్పింది. మిట్టమధ్యాహ్నము అప్పుడు ఆమె కునికింది. నిద్రాపారవశ్యములో ఆమె తలాపిన కాళ్లూ కాళ్లకట్టున తలా పెట్టుకొని తల విరబోసుకొని నిద్రపోయింది.

దేవేంద్రుడు ఆమెను చూచినాడు. సందు దొరికింది అని సంతోష పడ్డాడు. యోగశక్తితో ఆమె గర్భములో చొరబడ్డాడు గర్భములో ఉన్న శిశువును తన వజ్రాయుధముతో నరికివేయ సాగినాడు. ఆ గర్భస్థశిశువు రోదనము చేస్తూ ఉంటే దేవేంద్రుడు మారుదః (ఏడవకు) మారుదః (ఏడవకు) అంటున్నాడు. అప్పుడు దితికి మెలకువవచ్చి "చంపవద్దు చంపవద్దు" అని అరిచింది. కాని దేవేంద్రుడు ఆ గర్భాన్ని అప్పటికే ఏడు ముక్కలుగా నరికివేసినాడు.

మాతృవచనగౌరవముతో దేవేంద్రుడు ఆమె గర్భములో నుంచి బయటికి వచ్చి వజ్రాయుధము చేతిలోనే ఉంచుకొని నమస్కారము చేసి "అమ్మా నీవు వ్రతనిష్ఠాభంగము అవుతుంది అని అనుకోకుండా తల విరబోసుకొని కాళ్ల కట్టున తల పెట్టుకొని నిద్ర పోయినావు. నీవు అశుచివి అయిపోయినావు నాకు సందు దొరికింది. దొరికినప్పుడు శత్రువును సంహరించడము ఎవరికి అయినా నిరుపమ ధర్మము. యుద్ధములో నన్ను చంపివేయ కలవాడు నీ కడుపులో ఉన్నాడు. అందువల్ల నీ గర్భాన్ని నేను ఏడుతునకలు చేసినాను. అమ్మా, నీవు నన్ను మన్నించవలెను" అన్నాడు.

## ౪౭

ఓ రామా, తన గర్భము ఏడు తునకలు అయిపోయినందుకు దితి ఎంతో దుఃఖించింది. ఎదిరించడానికి అలవికాక దేవేంద్రుణ్ణి చూచి సానునయముతో "నాయనా, బలసూదనా, నా అపరాధము వల్లనే నా గర్భము ముక్కలు అయిపోయింది నీ తప్పు ఏమీలేదు. నా గర్భము ఎట్లాగూ పాడు అయిపోయింది, కనుక నీవు ఇప్పుడు నాకు ఒక ఉపకారము చేయవలెను. ఏడు ముక్కలు అయిపోయిన నా గర్భము ఏడు లోకాలలో వాయు సమూహాలకు అధిపతులు అయ్యేట్టు నీవు చూడవలెను. ఒకడు బ్రహ్మలోకములోనూ ఒకడు ఇంద్రలోకములోనూ ఒకడు అంతరిక్షములోనూ తక్కిన నలుగురూ నాలుగు దిక్కులనూ సంచారము చేయ నివ్వవలెను. వాండ్లను ఏడుగురినీ అందరూ మరుద్గణాలు అనవలెను. ఈ విధముగా చేయడానికి నీవు ఒప్పుకోవలెను" అని చెప్పింది.

దేవేంద్రుడు ఆమెకు నమస్కారము చేసి "అమ్మా. నీవు చెప్పినట్టు చేస్తాను. సందేహము వద్దు. నీ సంతానము దేవతలకు మల్లే సంచరించేట్టు చేస్తాను" అన్నాడు.

ఆ తపోవనములో ఆ తల్లీకొడుకూ ఈ విధముగా ఒప్పందము చేసుకొని స్వర్గలోకానికి వెళ్ళిపోయినారు.

ఓ రామా, ఆ తపోవనమే ఇది. దితి తపస్సు చేసిందిన్నీ దేవేంద్రుడు ఆమెకు ఉపచారాలు చేసిందిన్నీ ఈ ప్రదేశములోనే. ఇక్కడనే ఇక్ష్వాకుకున్నూ అలంబుసాదేవికిన్నీ విశాలుడు అనేవాడు పుట్టినాడు. ఆ విశాలుడు అతి ధార్మికుడు. అతడే ఈ విశాలా పట్టణాన్ని కట్టించినాడు.

ఆ విశాలుడికి మహాబలవంతుడు అయిన హేమచంద్రుడు పుట్టినాడు. ఆ హేమచంద్రుడికి సుచంద్రుడున్నూ ఆ సుచంద్రుడికి ధూమ్రాశ్వుడున్నూ ఆ ధూమ్రాశ్వుడికి సృంజయుడున్నూ సృంజయుడికి సహదేవుడున్నూ పుట్టినారు.

సహదేవుడు శ్రీమంతుడు. మహాప్రతాపవంతుడు. ఆయనకు సుధార్మికుడు అయిన కుశాశ్వుడు పుట్టినాడు. ఆ కుశాశ్వుడికి మహాతేజోవంతుడూ అమితపరాక్రమవంతుడూ అయిన సోమదత్తుడు పుట్టినాడు. ఆ సోమదత్తుడికి కాకుత్స్థుడు పుట్టినాడు. ఆ కాకుత్స్థుడి పుత్రుడు సుమతి.

ఆ సుమతి ఇప్పుడు ఈ విశాలా నగరములో రాజ్యపాలనము చేస్తూ ఉన్నాడు. ఇతడు దేవతలతో సరిసమానుడు అయినవాడు. దుర్జయుడు. ఈ వైశాలికవంశీయులు అందరూ దీర్ఘాయుష్మంతులు. అందరూ మహాధార్మికులుగానూ వీర్యవంతులుగానూ రాజ్యపాలనము చేస్తూ వచ్చినారు.

“రామా, మనము ఈ రాత్రి ఈ విశాలా పట్టణములో సుఖముగా గడుపుదాము. రేపు ఉదయము ప్రయాణము అయిపోయి జనక మహారాజును చూదాము” అన్నాడు విశ్వామిత్రమహర్షి.

విశ్వామిత్ర మహర్షి తన పట్టణప్రాంతానికి వచ్చినట్టు సుమతికి తెలిసింది. అంతట ఆయన బంధువులనూ ఉపాధ్యాయులనూ వెంటపెట్టుకొని విశ్వామిత్ర మహర్షికి స్వాగతము చెప్పడానికి ఎదురుగుండా వచ్చి నమస్కారము చేసి పూజించి కుశలము అడిగి తెలుసుకొని “ఓ మహామునీ, తమకు స్వాగతము. తమకు నా మీద ఎంతో అనుగ్రహము ఉండటము నుంచి తాము ఇటు వచ్చినారు. తమ దర్శన భాగ్యము నాకు అయాచితముగా లభ్యము అయింది. నేను ఇప్పుడు ధన్యుడను అయినాను. నాకన్నా ధన్యుడు మరి ఒకడు ఉండడు” అంటూ ఉప్పొంగి పోయినాడు.

## ౪౮

అంతట ఆ సుమతి విశ్వామిత్రమహర్షితో “ఓ బ్రహ్మర్షీ, ఈ చిన్నవాండ్లు ఎవరు. ఖడ్గ ధనుర్ధరులు అయి ఏనుగులవలె గంభీరముగానూ, సింహాలవలె

అప్రతిహతముగానూ పెద్దపులులవలె భయంకరముగానూ అబోతులవలె సవిలాసముగానూ పాదచారులు అయి మీ వెంట ఎందుకువస్తున్నారో చెప్పవలెను" అన్నాడు.

అంతట విశ్వామిత్రమహర్షి సిద్ధాశ్రమములో యజ్ఞము ఆరంభించటమూ రామలక్ష్మణులను పిలుచుకొని పోవటమూ వారు రాక్షసులను సంహారము చేయటమూ మొదలు అయిన విషయాలు అన్నిటినీ సుమతికి తెలియ చెప్పినాడు.

అప్పుడు సుమతి పరమసంతోషముతో రామలక్ష్మణులను యథార్హముగా సత్కరించి ఆ అతిథులను అందరినీ తన భవనానికి తీసుకొని పోయినాడు.

ఆ నాడు వారు అందరూ సుమతి సపర్యలను సంతోషముగా అనుభవించినారు. మరునాడు ఉదయము వారు అందరూ మిథిలానగరానికి ప్రయాణము అయిపోయినారు.

మిథిలా నగరము కళ్ళ పడగానే మునిజనులు అందరూ ఉప్పొంగిపోయి జనక మహారాజునూ మిథిలానగరాన్నీ ప్రశంసించ సాగినారు.

ఆ సమీపములో రాముడు ఒక నిర్జనవనాన్ని చూచినాడు. అది పాడుబడిపోయిన మున్యాశ్రమముగా తోచింది. విశ్వామిత్రమహర్షిని చూచి "మహాత్మా, ఇది ఒకప్పుడు శ్రీమంతము అయిన పుణ్యాశ్రమము అయినట్టుగా తోస్తూ ఉంది. అట్లాఅయినట్లయితే పూర్వము ఇది ఎవరి ఆశ్రమమో మహర్షులు ఈ ప్రదేశము ఎందుకు వదిలి పెట్టి పోయినారో చెప్పవలెను" అని అడిగినాడు.

"రామా, చక్కగా ఊహించినావు, సంతోషము. ఇదివరకు ఈ ఆశ్రమము ఏ మహాత్ముడిదో, ఆ మహాత్ముడు ఎందుకు కోపము వచ్చి ఈ ఆశ్రమము పాడుబెట్టి పోయినాడో చెప్పతాను. వినవలసింది"

"ఇది పూర్వము గౌతమమహర్షి ఆశ్రమము. అప్పుడు ఈ ఆశ్రమము దివ్యముగా ఉంటూ ఉండేది. దేవతలు సహితము ఈ ఆశ్రమపదాన్ని ఎంతో ప్రశంసిస్తూ ఉండేవారు. ఇక్కడనే గౌతమమహర్షి ఆయన భార్య అహల్యతో బహుకాలము తపస్సు చేసినాడు.

గౌతమమహర్షి లేనిసమయము కనిపెట్టి దేవేంద్రుడు గౌతముని వేషము వేసుకొని ఈ ఆశ్రమపదములోకి వచ్చినాడు. ఆ సహస్రాక్షుడు అహల్యను చూచి "ఓ ఒప్పులకుప్పా, కామార్థినులకు ఋతుకాలముతో నిమిత్తములేదు. ఓ సుందరీ, నేను ఇప్పుడు నీతో కలియవలెను అని వచ్చినాను" అన్నాడు.

ఆ మునివేషధరుడు గౌతమమహర్షి కాడు అనీ దేవేంద్రుడు అనీ అహల్య గుర్తించింది. అయితే అప్పుడు ఆమె బుద్ధి బుగ్గిఅయిపోయింది. తనను కలియవలెను అని దేవరాజు అంతటివాడు వచ్చి అడిగినందుకు మురిసిపోయింది. కుతూహలము వేసింది. దారితప్పింది.

అంతట అహల్య ఇంద్రుణ్ణి చూస్తూ "ప్రభో నేను కృతార్థురాలు అయినాను. ఇప్పుడే నీవు ఎవరికంటనూ పడకుండా ఇక్కడనుంచి వెళ్లిపో. ఈ విషయము ఎవరికీ తెలియకుండా ఉంచు. నీమర్యాదా నామర్యాద కాపాడు. త్వరగా నీవు వెళ్లిపోవలెను" అన్నది.

దేవేంద్రుడు నవ్వుతూ "ఓ సుశ్రోణీ నేనూ సంతుష్టుణ్ణి అయినాను. నా దారిన నేను పోతున్నాను" అంటూ బయలుదేరినాడు.

నదీ తీర్థములో స్నానము చేసి ఒక చేతిలో సమిధలూ ఇంకో చేతిలో దర్భలూ పట్టుకొని అగ్నిహోత్రుడి మాదిరిగా ప్రజ్వరిల్లుతూ గౌతమ మహర్షి ఆశ్రమపదములోకి వస్తూఉన్నాడు. ఎట్టఎదుట దేవేంద్రుడు కనుపించినాడు.

ఆ తపోబలసంపన్నుణ్ణి దేవదానవులు ఎవరూ ఎదిరించలేని ఆ శక్తిమంతుణ్ణి దేవేంద్రుడు చూచినాడు. భయచకితుడు అయినాడు. ముఖము వెలా తెలా పోయింది.

ఆ దేవేంద్రుణ్ణి గౌతమమహర్షి తేరిపార చూచినాడు. దుర్వృత్తము అంతా ఆ మహర్షికి గోచరించింది. పరమక్రుద్ధుడు అయిపోయి "ఓ దుర్మతీ నా వేషములో వచ్చి నీవు చేయరాని పని చేసినావు. నీ అండాలు తెగిపోవలెను" అని శాపము పెట్టినాడు.

గౌతముడి నోటివెంట వెలువడిన వాక్యాలు పూర్తి కాకపూర్వమే దేవేంద్రుడి వృషణాలు తెగిపడిపోయినవి.

అంతట గౌతమ మహర్షి అహల్యను చూచి "ఈ ఆశ్రమపదము పాడుబడిపోవలెను. నీవు కూడూ నీళ్లూ లేకుండా బూడిదలో పొర్లాడుతూ ఎవరికంటను పడకుండా గాలి పీల్చి బ్రతుకుతూ తపస్సుచేస్తూ ఇక్కడనే పడి ఉండు" అని శపించినాడు.

అహల్య రోదించింది. వేడుకొన్నది. గౌతముడు కొంత శాంతించి "ఓ అహల్యా ఒకానొక కాలానికి దశరథరాముడు ఇక్కడికి వస్తాడు. అప్పటికి ఈ ప్రదేశము పాడుబడిపోయి భయంకరముగా ఉంటుంది. అతడు వచ్చి నిన్ను చూస్తాడు. అతని దర్శనమువల్ల నీవు పరిశుద్ధురాలవు అవుతావు. అప్పుడు నీవు

ఆయనకు అతిథిసత్కారాలు చేయవలెను. అంతట నీవు భయమోహవివర్జితవు అవుతావు. నీకు యథారూపము వస్తుంది. ఆతరువాత నీవు నాతో సుఖముగా ఉండవచ్చును" అన్నాడు.

అంతట గౌతమ మహర్షి ఈ ఆశ్రమపదాన్ని వదిలిపెట్టి తపస్సు చేసుకోడానికి సిద్ధులూ చారణులూ సంచరించే హిమవత్పర్వతశిఖరానికి వెళ్లిపోయినాడు"

౪౯

దేవేంద్రుడు అండాలు తెగిపోయినందువల్ల దిగులుపడిపోయినాడు. దేవతలను అందరినీ పిలిపించి "ఓ దేవతలారా, గౌతమ మహర్షి మనలను అందరినీ పదవీచ్యుతులను చేయడానికి తపస్సు తలపెట్టినాడు. నేను ఆయన తపస్సు విఘ్నము చేయడానికి ఆయన ఆశ్రమపదానికి పోయినాను. ఆయనకు కోపము తెప్పించవలెనుకన్నా నాకు మార్గాంతరము కనిపించలేదు. అందుకోసము ఆయన భార్య అహల్యతో నేను పోయినాను. నామీద ఆయనకు పట్టరాని కోపము వచ్చింది. నా వృషణాలు ఊడిపోవలెను అని శాపము పెట్టినాడు. అహల్యను కూడా శపించి ఆయన తపోవ్రతము భంగము అయిపోయినందువల్ల ఈ ఆశ్రమపదమువదిలిపెట్టిపోయినాడు. దేవకార్యము నేను ఈవిధముగా చక్కబెట్టినాను. కాబట్టి మీరు అందరూ నాకు మళ్లీ అండాలు వచ్చే ఉపాయము ఆలోచించవలెను. సాయము చేయవలెను" అని ప్రార్థించినాడు.

అంతట దేవతలు అందరూ అగ్నిదేవుడివెంట బయలుదేరి పితృదేవతల దగ్గరకు పోయినారు. జరిగింది అంతా చెప్పినారు. ఆ పితృదేవతలు మేషాండాలు తీసి దేవేంద్రుడికి అంటించినారు. అప్పటి నుంచీ దేవేంద్రుడు మేషాండుడు అయినాడు.

రామా, అప్పటినుంచీ ఈ ప్రదేశములో అహల్య అతి కఠిన నియమాలతో తపస్సుచేస్తూ నీరాక ఎదురుచూస్తూ ఉంది. ఇప్పుడు ఆమె దేవతా స్వరూపిణి. నీవు ఆమెను చూడవలెను. నీ దర్శనమువల్ల ఆమె తరిస్తుంది" అన్నాడు విశ్వామిత్ర మహర్షి. అంతట వారు ముగ్గురూ మహారణ్యముగా ఉన్న ఆ మున్యాశ్రమములోకి పోయినారు.

అంతవరకూ దేవదానవమానవులకు ఎవరికీ చూడనలవికాకుండా తపోదీప్తులతో తేజరిల్లుతూఉన్న ఆ మహాభాగను ఆఅహల్యాదేవిని అప్పుడు రాముడు చూచినాడు.

బ్రహ్మదేవుడు అతిప్రయత్నములో సృష్టించిన ఆమె అతిమానుష రూపము గౌతమవాక్యాన్ని శిరసావహించి కఠోరనియమాలతో తపస్సు చేయ నారంభించినందువల్ల ఛాయామాత్రము అయిపోయింది. వృక్షలతాపుష్ప పటలాలు ఆవరించినందువల్ల ఆమెలావణ్యము పొగమంచులో మబ్బులమాటున పోయిన నిండుచందురిడి వెన్నెలవలె అయిపోయింది. ఆమె దేహకాంతులు ఉదకమధ్యములో ప్రతిఫలించిన ప్రదీప్తసూర్యకిరణాల వలె దుర్నిరీక్షము అయిపోయినవి. ఆమె విగ్రహము ధూమచ్ఛన్నము అయిన అగ్నిహోత్రజ్వాల వలె అయిపోయింది.

అట్లా ఉన్న ఆ అహల్యాదేవి రాముణ్ణి చూచింది. రామ సందర్శనముతో ఆమె పాపవిముక్తా శాపవిముక్తా అయింది.

అంతట ఆమె యథార్థరూపముతో ముల్లోకాలవారికీ కనిపించింది. ఆమెను అందరూ చూచినారు. ఆమె తపస్సు మెచ్చుకొన్నారు. గౌతమమహర్షి చెప్పిపోయినట్లుగా ఆమె రామలక్ష్మణులకు సాష్టాంగనమస్కారము చేసింది. అర్ఘ్యపాద్యాదులు ఇచ్చింది. అతిథిసత్కారము చేసింది.

అది తెలిసి గౌతమ మహర్షి అప్పుడు అక్కడికి వచ్చినాడు. ఆ తపోబల విశుద్ధాంగినిచూచినాడు. అప్పుడు దేవదుందుభులు మ్రోగినవి. పూలవాన కురిసింది. గంధర్వులు పాడినారు. అప్సరసలు ఆడినారు.

ఆ మునిదంపతులు అత్యంతానందముతో రామలక్ష్మణులనూ విశ్వామిత్ర మహర్షినీ మిగతామహర్షులనూ చక్కగా సమ్మానించినారు.

## ౫౦

విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులతోనూ తక్కిన మహర్షులతోనూ అక్కడనుంచి ఈశాన్యదిక్కుగా మిథిలాపట్టణానికి ప్రయాణము అయిపోయినాడు. వారు అందరూ జనకమహారాజు యజ్ఞవాటిక చేరినారు. రాముడు అప్పుడు విశ్వామిత్ర మహర్షిని చూచి "స్వామీ ఈ యజ్ఞవాటము చక్కగానూ సర్వసమృద్ధముగానూ ఉంది. వేదాధ్యయనపరాయణులు అయిన బ్రాహ్మణులు అనేక దేశాలవారు ఎటుచూచినాకనపడుతున్నారు. ఋషివాటికలువందల కొద్దీ బండ్లతో కిటకిటలాడుతూ ఉన్నవి. ఇప్పుడు మనము ఎక్కడవిడిది చేయవలెనో మీరు నిర్ణయించవలెను" అని చెప్పినాడు.

వారు అందరూ విడిది చేయడానికి జనసమ్మర్దము లేకుండా వివిక్తముగా ఉన్న ఒక చెరువుగట్టు విశ్వామిత్రమహర్షి చూపించినాడు.

విశ్వామిత్రమహర్షి రాక జనకమహారాజుకు తెలిసింది. తత్‌క్షణమే పురోహితుడు శతానందుణ్ణి వెంటబెట్టుకొనివచ్చి వినయ విధేయతలు ఉట్టిపడుతూ విశ్వామిత్రమహర్షి దర్శనము చేసినాడు. అంతలో జనకమహారాజు ఋత్విజులూ మొదలుఅయినవారు అక్కడికివచ్చి ధర్మవిహితముగానూ సమంత్రకముగానూ అర్ఘ్యమూ పాద్యమూ మధుపర్కమూ విశ్వామిత్ర మహర్షికి సమర్పించినారు. ఆ సత్కారాలకు ఆయన ఎంతో సంతోషముతో "రాజా నీవు కుశలముగా ఉంటూఉన్నావా, నీ యజ్ఞము నిర్విఘ్నముగా సాగుతూఉందా" అని అడిగి తెలుసుకొన్నాడు. శతానందుణ్ణీ తక్కిన ఋత్విజులనూ కుశలప్రశ్న చేసినాడు. ఆయన ఆదరాతిశయానికి వారు అందరూ ఎంతో సంతోషించినారు. విశ్వామిత్రమహర్షి మొదలుఅయినవారు కూర్చుండటానికి జనకమహారాజు ఉచితాసనాలు చూపించినాడు. వారు అందరూ యథార్హముగా కూర్చున్నతరువాత శతానందుడూ ఋత్విజులూ మంత్రులూ కూర్చున్నారు. అప్పుడు జనకమహారాజును కూర్చుండుమని విశ్వామిత్ర మహర్షి చెప్పినాడు.

జనకమహారాజు విశ్వామిత్రమహర్షిని చూచి "ఓ మహానుభావా, తమ దర్శనభాగ్యమువల్ల నాయజ్ఞము సఫలము అయినట్టుగా ఉంది. నేను యిదివరకు చేసిన యజ్ఞాలు అన్నిటికీ దేవతలు ఇప్పుడు ఫలము ఇచ్చినట్టుగా ఉంది. తమకు నామీద ఎంతో అనుగ్రహము ఉండడము వల్ల ఇంతమంది మహర్షులతో తాము ఇక్కడికి వచ్చినారు. నేనుఇప్పుడు ధన్యుణ్ణి అయినాను. స్వామీ, ఈయజ్ఞము సమాప్తము కావడానికి ఇంకా పన్నెండురోజులు పట్టుతుంది అని పెద్దలు చెప్పుతున్నారు. తాము అంతవరకూ అవశ్యమూ ఇక్కడనే ఉండవలెను అని మనవిచేసుకొంటున్నాను" అంటూ "ఓ మహామునీ, మీ వెంటవచ్చిన ఈచిన్నవాండ్లు ఎవరు. తామరరేకులవంటి నేత్రాలతోనూ దివ్యరూపాలతోనూ తేజరిల్లుతూ ఖడ్గతూణీధనుర్ధరులు అయి మహావిష్ణువుతో సరిసమానము అయిన పరాక్రమవంతులుగా కనిపిస్తున్నారు. అశ్వినీదేవతలు ఏమోనుఅనిపిస్తున్నారు. నవయౌవనములో ఉన్న ఇద్దరు దేవతలు వారి అంతట వారు ఈభూలోకములోకి వచ్చినారా అన్నట్టు కనపడుతున్నారు. ఒడ్డు పొడుగు లోనూ ముఖకవళికలలోనూ నడకలలోనూ మాటలలోనూ చూపులలోనూ ఒక్కమాదిరిగా కనిపిస్తున్నారు. చివరకు వీరి జుట్లు జులపాలూకూడా ఒక్కమాదిరిగా ఉన్నవి. ఆకాశములో సూర్యచంద్రులు మాదిరిగా వీరు ఉభయులున్నూ ఇక్కడ కాంతులు వెదచల్లుతున్నారు. వీరు ఎందుకు పాదచారులు అయి మీ వెంట వచ్చినారు. వీరు ఎవరిపుత్రులు. వీరిని గురించి వివరముగా చెప్పవలెను" అన్నాడు.

"వీరు ఇద్దరూ దశరథమహారాజు పుత్రులు. రామలక్ష్మణులు" అంటూ విశ్వామిత్రమహర్షి సిద్ధాశ్రమ వృత్తాంతమూ మహారణ్యప్రయాణమూ విశాల నగరములో సుమతి రాజసందర్శనమూ అహల్యా శాపవిమోచనమూ మొదలు అయిన విషయాలు అన్నీ చెప్పి "ఓ రాజా, నీ ఇంట్లో ఉన్న శివధనుస్సును చూడ వలెను అనే కుతూహలముతో ఈ రామ లక్ష్మణులు ఇక్కడికి నా వెంట వచ్చి నారు" అని చెప్పి ఊరకున్నాడు.

## ౫౧

తపోదీధితులతో తేజరిల్లుతూ ఉన్న శతానందుడు విశ్వామిత్ర మహర్షి చెప్పింది అంతా విన్నాడు. ఆయన గౌతమమహర్షి జ్యేష్ఠపుత్రుడు. జనకమహా రాజు పురోహితుడు. విస్మితుడు అయిపోయినాడు. ఆయన దేహము పులక రించింది. ఆ మహాత్ముడు సుఖాసీనులు అయి ఉన్న రామలక్ష్మణులను చూస్తూ విశ్వామిత్ర మహర్షితో "ఓ బ్రహ్మర్షి బహుకాలమునుంచీ తపస్సు చేస్తూఉన్న మా అమ్మను ఈ రామచంద్రుడికి చూపించినావా. దైవదుర్విలాసమువల్ల పూర్వము ఆ తేజస్వినికి జరిగిన అపకారము అంతా ఈయనకు చెప్పినావా, ఆ యశస్విని ఈ పూజనీయుణ్ణి గౌరవించి అతిథిపూజ చేసిందా. మా తండ్రి మా అమ్మదగ్గరకు వచ్చినాడా. ఆ మహాత్ముడు ఆ మహాతేజోవంతుడు మా తండ్రి గౌతమ మహర్షి ఈ రామచంద్రుణ్ణి చక్కగా సత్కరించినాడా. ఈ పవిత్రుడు ఈ ప్రశాంతచిత్తుడు మా తండ్రికి అభివాదము చెప్పినాడా. స్వామీ, తమకు శుభముఅవుతుంది. ఈ విషయము అంతా తాము చెప్పవలెను" అన్నాడు.

శతానందుడితో విశ్వామిత్రమహర్షి "నాయనా, చెప్పవలసింది అంతా చెప్పినాను. చేయవలసింది అంతా చేసినాను. రేణుకాదేవి జమదగ్నిని చేరినట్లుగా నీ తల్లి అహల్యాదేవి నీ తండ్రి గౌతముణ్ణి చేరింది. ఇప్పుడు నీ తల్లిదండ్రులు సుఖముగా ఉన్నారు" అన్నాడు.

శతానందుడు రాముణ్ణి చూచి "ఓ రామా, నీకు స్వాగతము, దైవయోగము వల్ల ఈ విశ్వామిత్రమహర్షి నిన్ను దగ్గిరకు తీసినాడు. ఈయన అపరాజితుడు. ఎవరూ ఊహించలేని మహాత్కార్యాలు సాధించిన మహామహుడు. తపః ప్రభావముతో బ్రహ్మర్షి అయినాడు. ఈమహాతేజోవంతుడు నీకు ఏదో గొప్ప మేలు చేయతలచి నిన్ను వెంటపెట్టుకొని ఇక్కడికి వచ్చినాడు. నీకంటే ధన్యుడు ఇప్పుడు ఈ జగత్తులో మరి ఒకడు లేడు.

ఈ విశ్వామిత్ర మహర్షి చరిత్రను అంతా యథాతథముగా చెప్పుతాను వినవలసింది.

ఈ విశ్వామిత్రమహర్షి చాలా చదువుకొన్నాడు. మహాపరాక్రమవంతుడు. పరమధార్మికముగానూ ప్రజాహితముగానూ పూర్వము బహుకాలము రాజ్యపాలనము చేసినాడు. ఆతరువాత చతురంగబలయుతము అయిన ఒక అక్షౌహిణీ సైన్యముతో దేశాటనము చేసినాడు. అనేక దేశాలూ అనేక పట్టణాలూ అనేక పుణ్యతీర్థాలూ తిరిగి చూచినాడు. మహాపర్వతప్రదేశాలలోనూ సాంద్రారణ్యాలలోనూ సంచారము చేసినాడు. అంతట మున్యాశ్రమాలు వరుసగా చూచుకొంటూ వసిష్ఠమహర్షి ఆశ్రమానికి పోయినాడు.

ఈ భూభాగములో ఎక్కడ ఎక్కడనో కాని కనిపించని నానాజాతుల ఫల పుష్ప వృక్ష లతా గుల్మాదులు అన్నీ అక్కడ చక్కగా పెరుగుతూ ఉన్నవి. వివిధ వన్యమృగాలూ అన్యోన్యవైరము లేకుండా అక్కడ నిర్భయముగా సంచరిస్తూ ఉన్నవి. రకరకాల పక్షులూ కుహూనాదాలు చేస్తూ ఉన్నవి. ఏవైపు చూచినా జింకలు మొదలుఅయిన మృగాలు నదురూ బెదురూ లేకుండా మనుష్యుల పక్కపక్కను తిరుగుతూన్నవి. సిద్ధులూ చారణులూ దేవతలూ దానవులూ గంధర్వులూ కిన్నరులూ ఆ ఆశ్రమములో ఉంటూ ఉన్నారు ఒకవైపున బ్రహ్మర్షులూ మరిఒకవైపున దేవర్షులూ ఇంకొకవైపున అగ్నిహోత్రాల మాదిరిగా జ్వలించే తపస్సిద్ధులూ కనిపించినారు. పండ్లు మాత్రమే తిని బ్రతికే వారూ ఆకులుమాత్రమే తిని బ్రతికేవారూ ఒక్క నీరుమాత్రమే త్రాగి బ్రతికే వారూఒక్క గాలే పీల్చి బ్రతికేవారూ .కనిపించినారు. వారు అందరూ జితరోషులు. విజితేంద్రియులు. వారే కాకుండా జపహోమాలు చేసేవాలఖిల్యులూ వైఖానసులూ ఉన్నారు.

ఆ వసిష్ఠమున్యాశ్రమము అపరబ్రహ్మలోకమువలె విశ్వామిత్రుడికి అగుపించింది.

## ౫౨

విశ్వామిత్రుడు వసిష్ఠమహర్షిని సందర్శించి వినయవిధేయతలతో నమస్కారము చేసినాడు. వసిష్ఠుడు "రాజా, నీకూ నీ పరివారానికీ స్వాగతము" అంటూ కూర్చుండటానికి ఆసనము విశ్వామిత్రుడికి ఇప్పించినాడు. యథాశాస్త్రముగా కందమూలాదులనూ ఫలాదులనూ ఇచ్చి సత్కరించినాడు.

విశ్వామిత్రుడు ఆ సత్కారాలకు సంతోషించి "మహర్షీ తాము కుశలముగా ఉంటూ ఉన్నారా. తమ తపోగ్నిహోత్రాలు నిర్విఘ్నముగా సాగుతూ

ఉన్నారా. తమ శిష్యులు అందరూ క్షేమముగా ఉంటూ ఉన్నారా. తమ ఆశ్రమ చెట్లు తీగలు గుల్మాలు అన్నీ ఆరోగ్యముగా పచ్చగా ఉంటూ ఉన్నాయా" అని అడిగినాడు.

సర్వత్రా కుశలమేనని వసిష్ఠమహర్షి సమాధానము చెప్పినాడు.

వసిష్ఠమహర్షి బ్రహ్మర్షిశ్రేష్ఠుడు. మహామంత్రవేత్త. జపతపాదు లలో ఆయనను మించినవాడు మరొకడు లేడు. సుఖముగా కూర్చుండియున్న విశ్వామిత్రునితో ఆయన ఇట్లా — "రాజా, నీవు హాయిగా ఉంటూ ఉన్నావా. ధర్మమార్గాన ప్రజారంజకముగా రాజ్యపాలనము చేస్తూ ఉన్నావా. నీ భృత్యు లను అందరినీ చక్కగా పోషిస్తున్నావా. నీ సామంతులు అందరూ నీ ఆజ్ఞను అనుసరించిపోతున్నారా. నీవు నీ శత్రువులను అందరినీ జయించినావా. నీ సంపదా నీ బొక్కసమూ సమృద్ధముగా ఉన్నవా, నీ పుత్రులూ పౌత్రులూ నీ మిత్రులూ క్షేమముగా ఉంటూ ఉన్నారా" అని వసిష్ఠమహర్షి అడిగినాడు. అంతా క్షేమమేనని విశ్వామిత్రుడు జవాబు చెప్పినాడు.

ఆ పరమధార్మికులు ఉభయులూ సంతోషకరములయిన ఎన్నో విషయాలను గురించి చర్చించి పరస్పరమూ సంతుష్టాంతరంగులు అయినారు.

ఇష్టాగోష్ఠి అయిపోయిన తరువాత వసిష్ఠమహర్షి ప్రసన్నవదనముతో "రాజా, నీకూ నీ సైన్యానికీ యథావిధిగా అతిథ్యము ఇవ్వసంకల్పించు కొన్నాను. నీవు రాజువు. అందులో అంత ఇంత అని చెప్ప నలవికాని దొడ్డ వాడవు. కాబట్టి నీవు అతిథిశ్రేష్ఠుడవు. నేను నిన్ను సత్కరించి తీరవలెను" అన్నాడు.

విశ్వామిత్రుడు "మహర్షీ. తమ ప్రియవాక్యాల వల్లనే నాకు అతిథి సత్కారము అయిపోయింది. స్వామీ, తమ ఆశ్రమములో పండిన పండ్లూ మొదలు అయినవి నాకు ఇచ్చినారు. పాద్యమూ అర్ఘ్యమూ ఆచమనజలమూ ఇచ్చినారు. నాకు అంతే చాలును. తమ దర్శనమువల్లనే నాకు సమస్త సత్కా రాలూ సమకూడినవి. నేను సెలవు తీసుకొంటాను. నన్ను తాము స్నేహముతో చూస్తూ ఉంటే చాలును. నమస్కారము" అంటూ పోబోయినాడు.

వసిష్ఠమహర్షి ఒప్పుకొనలేదు. భోజనము చేసిపోవలసిందేనని బలవంతము చేసినాడు. విశ్వామిత్రుడు ఆయనమాట త్రోసివేయలేక "ఓ మహామునీ, తమ చిత్తమువచ్చినట్టు చేయడమే నా పని." అన్నాడు.

వసిష్ఠమహర్షి సంతోషముతో "శబలా, రా, వెంటనే రావలెను. నీతో పనివచ్చింది" అన్నాడు. అప్పుడు కామధేనువువచ్చి ఆయన ఎదట నిలు

చున్నది. "ఓ కామధేనూ, నేను ఈ విశ్వామిత్రరాజర్షికీ ఈయన సైన్యానికీ భోజనము పెట్టి సత్కరించ సంకల్పించుకొన్నాను. అన్నీ నీవు చేసి పెట్టవలెను. షడ్రసోపేతము అయిన భోజనము ఎవరికి ఎవరికి ఏవిధముగా కావలెనో వారి వారికి ఆ విధముగా చేసి పెట్టవలెను. వివిధరసాయనాలతోనూ భక్ష్యాలతోనూ పానీయాలతోనూ లేహ్యాలతోనూ చోష్యాలతోనూ శాలి మొదలు అయిన వివిధాన్నాలూ శీఘ్రముగా సిద్ధముచేయవలెను" అన్నాడు వసిష్ఠమహర్షి.

౫౩

ఓ రామా, వసిష్ఠమహర్షి చెప్పే చెప్పటముతోనే శబల సమస్తమూ సిద్ధము చేసింది. చెరుకుపానకమూ తేనె ఇప్పపూలఆసవమూ ఇంకా మంచి రుచ్యము అయిన పానకాలూ పేలాలూ రకరకాల భక్ష్యాలూ తయారుచేసింది. కొండలు అంత ఉడుకు ఉడుకు అన్నము రాసులూ పాయసమూ మొదలు అయిన మృష్టాన్నాలూ వండినపప్పులూ షడ్రసాలతో రుచ్యముగా చేసిన షాడబాలూ భక్ష్యాలూ బెల్లముతో చేసిన పిండివంటలూ సిద్ధము అయినవి. వాటిని అన్నిటినీ వారివారికి కావలసినట్లు పాత్రలలో వడ్డనచేసింది. ఆ పెరుగు వేయటము చూస్తే అక్కడ ఎక్కడను అయినా పెరుగు పారే ఏరు ఉందా అనిపించింది. విశ్వామిత్రుడూ ఆయన అంతఃపుర స్త్రీలూ పురోహితులూ బ్రాహ్మణులూ అమాత్యులూ సైనికులూ ఇంకా మిగతా అనుచరులూ ఆ విందు ఆరగించినారు. ఆ విందువారికి తుష్టిని ఇచ్చింది. పుష్టిని ఇచ్చింది.

అప్పుడు పరమసంతోషముతో విశ్వామిత్రుడు వసిష్ఠమహర్షిని చూచి "ఓ బ్రహ్మర్షీ, నేను తమను సత్కరించడానికి బదులు నన్ను తాము మహా చక్కగా సత్కరించినారు. ఒక్కమాట చెప్పతాను. వినవలెను. తాము మాటల పొందు తెలిసినవారు. నా మాట తోసివేయవద్దు. ఏదో సాకు చెప్పవద్దు. ఈ కామధేనువుకు బదులు నేను ఒకలక్షగోవులను తమకు ఇస్తాను. ఈ కామధేనువును నాకు ఇవ్వవలెను. ఇది మహారత్నము. మహారత్నాలు అన్నీ రాజుసొమ్ము. కాబట్టి కామధేనువును తాము నాకు ఇవ్వవలెను. ఇది లౌకికధర్మము" అన్నాడు.

వసిష్ఠమహర్షి "ఓ రాజా, నీవు లక్ష ఆవులను కాదు; నూరుకోట్ల ఆవులను ఇచ్చినా వెండిరాసులు కుమ్మరించినా ఈ శబలను నేను ఇవ్వను. ఇది నాదగ్గిర ఉండేదే తప్ప నేను మరి ఒకరికి ఇచ్చేదికాదు. పౌరుషవంతుణ్ణి ఆశ్రయించుకొని ఉండే కీర్తి మాదిరిగా ఈ కామధేనువు ఎప్పుడూ నన్నే అంటిపెట్టుకొని

ఉంటుంది. దేవతలకు ఇచ్చే హవ్యాలూ పితృదేవతలకు ఇచ్చే కవ్యాలూ ప్రాణాగ్నిహోత్రమూ సాయంప్రాతస్సు హోత్రాలూ అనూవాక్యప్రాప్తముల నాటి హోమాలూ నాకు ఈ కామధేనువువల్లనే సాధ్యమై ఉన్నవి. స్వాహాకారమూ వషట్కారాలూ వివిధవిద్యలూ అవి ఇవి ఏమిటి సర్వమూ నాకు ఈ కామధేనువు వల్లనే సమకూడుతూ ఉన్నవి. ఉన్నమాట చెప్పుతున్నాను. ఈ కామధేనువే నా సర్వస్వము. నాకు తుష్టిని ఇచ్చేది ఇదే. ఈ కామధేనువును నేను ఒకరి కివ్వడానికి వీలులేదు" అన్నాడు.

విశ్వామిత్రుడు మరింత పట్టుదలగా అత్యర్థముగానూ "ఓ మహర్షీ, బంగారపు గొలుసులతోనూ బంగారు నడికట్టు తాళ్ళతోనూ బంగారపు అంకుశాలతోనూ పద్నాలుగువేల ఏనుగులను నేను మీకు ఇస్తాను. బంగారపు గంటలూ మువ్వలూ కట్టిన నాలుగు గుర్రాల బంగారు రథాలను ఎనిమిదివందలు ఇస్తాను. మహావేగముగా పరుగెత్తే గుర్రాలను మంచి వంగడములో పుట్టినవాటిని ఒక పదకొండువేలు ఇస్తాను. రకరకాల రంగుల ఆవులను ఒకకోటి ఇస్తాను. ఈ కామధేనువును మీరు నాకు ఇవ్వవలెను. ఇవి ఇచ్చినవే కాదు. మీరు కోరుకొన్నంత బంగారము ఇస్తాను. తాము నాకు దీనిని ఇప్పించవలెను" అన్నాడు.

వసిష్ఠమహర్షి "ఓ రాజా, నీవు ఏమి ఇచ్చినా శబలను నేను ఇవ్వను ఇదే ఈ కామధేనువే నాకు ఉన్న మహారత్నము: ఇదే నాధనము. ఇదే నా సర్వస్వము. ఇదే ఈ కామధేనువే నాకు దర్శపూర్ణిమలు. ఇదే నాకు దక్షిణలు ఇచ్చే యజ్ఞాలు. నేను చేసే సత్కార్యాలు అన్నిటికి ఇదే మూలాధారము. ఒట్టి మాటలు ఎందుకు: నా సమస్తకోర్కెలూ సఫలము చేసేది ఇదే. దీనిని నేను ఇవ్వను" అన్నాడు.

౫౪

ఓ రామా, కామధేనువును ఇవ్వను అని వసిష్ఠమహర్షి నిష్కర్షగా చెప్పగానే విశ్వామిత్రుడు రాజభటులను పిలిచి ఆ కామధేనువును లాగుకొని పొమ్మని ఆజ్ఞాపించినాడు.

రాజభటులు బలవంతముగా కామధేనువును ఈడ్చుకొనిపోతూ ఉంటే దానికి దుఃఖము వచ్చింది. భయము వేసింది. ఏడుస్తూ "వసిష్ఠమహర్షి నన్ను విడనాడినాడా, ఆ మహాత్ముడికి నేను ఏమి అపకారము చేసినాను, ఏమి అపరాధము చేసినాను. నేనుఆయన భక్తురాలనే, నేను ఆయనకు ఇష్టురాలనే, ఈ రాజభటులు నన్ను ఇట్లా లాగుకొనిపోతూ ఉంటే ఆయన ఎందుకు చూస్తూ ఊర

ఉన్నాడు" అని ఆలోచిస్తూ నిట్టూర్పులు విడిచింది. తనను పట్టి కట్టివేసి లాగుకొని పోతూ ఉన్న రాజభటులను అందరినీ చటుక్కున విదిలించివేసి అడ్డము వచ్చినవారిని అందరినీ పడతన్నుతూ వాయువేగముతో వసిష్ఠమహర్షి దగ్గరకు పరుగెత్తుకొనిపోయి దుందుభిస్వనముతో "బ్రాహ్మణోత్తమా, నన్ను వదిలివేసినావా, నేను ఏమి అపరాధము చేసినాను. ఈ రాజభటులు నన్ను ఇట్లా ఎందుకు లాగుకొనిపోతూ ఉన్నారు" అని అడిగింది.

వసిష్ఠమహర్షి తన ఎదుట ఏడుస్తూ నిలుచుని ఉన్న కామధేనువును చూచి "ఓ శబలా, నీవు నాకు చెల్లెలువంటిదానవు. నేను నిన్ను వదిలిపెట్టను. నీవు నాకు ఏ అపకారమూ చేయలేదు. ఏ అపరాధమూ చేయలేదు. శోకముతో నీ హృదయము బ్రద్దలుఅయిపోతూ ఉంది అని నాకు తెలుసును. జరుగుతున్నది అంతా చూస్తూ ఉన్నాను. ఈ విశ్వామిత్రుడు క్షత్రియుడు. మహాబలవంతుడు. పృథ్వీపతి. ఏనుగులతోనూ గుర్రాలతోనూ రథాలతోనూ సంపూర్ణముగా ఒక్క అక్షౌహిణీ సైన్యము వెంట ఉంది. నేను బ్రాహ్మణుణ్ణి. నాకు సేనాబలము లేదు. తపోబలముతో నిగ్రహించవలెను అనుకొంటే ఈతడు రాజుఅయిపోయినాడు. పైగా ఈయనకు ఇప్పుడే ఆతిథ్యము ఇచ్చినాను. ఏమిచేయటము" అన్నాడు.

ఆ తేజోవంతుణ్ణి కామధేనువు చూస్తూ "ఓ బ్రహ్మర్షీ, బ్రహ్మబలము ముందు క్షత్రియబలము ఏపాటిది. బ్రహ్మబలముకన్నా దివ్యము అయింది మరి ఏదీ లేదు అని పెద్దలు చెప్పగా విన్నాను. మహాత్మా ఇంతింత అని చెప్పనలవి కానిది తమ తపోబలము. ఈ విశ్వామిత్రుడు ఎంతటి వీర్యవంతుడు అయినా తమకన్న బలవంతుడుకాడు. తమ ప్రభావాన్ని ఎదిరించగలవారు ఎవరున్నారు. తమ మంత్రప్రభావమువల్లనే కదా నేను పుట్టింది. తాము స్వయముగా కలగచేసుకోవలసిన అవసరములేదు. నాకు అనుజ్ఞ ఇవ్వవలెను. ఇప్పుడే ఈ దుర్మార్గుడి దర్పాన్ని అణచివేస్తాను" అన్నది. అంతట వసిష్ఠమహర్షి "శబలా, నీ శత్రువులను సంహారము చేసే సేనలను సృష్టించుకో" అని ఆజ్ఞాపించినాడు.

కామధేనువు 'అంభా' అని రంకెవేసింది. అప్పటికి అప్పుడు వందలకొద్దీ పహ్లవులు అనే సైనికులు పుట్టుకొనివచ్చినారు. వాండ్లు అమాంతము విశ్వామిత్రుడి సేనలమీద పడ్డారు. విశ్వామిత్రుడి కళ్లముందే ఆ పహ్లవులు ఆయన సేనలను నాశనముచేయసాగినారు. విశ్వామిత్రుడు పరమ క్రుద్ధుడు అయినాడు. రథము ఎక్కిపోయి జగత్తును అంతా తల్లక్రిందులుచేసే అస్త్రాలను ఆ పహ్లవులమీద ప్రయోగించినాడు.

కామధేనువు చూచింది. దానికి పట్టరాని కోపము వచ్చింది. అప్పుడు యవనుల తోకూడిన శక సేనలను వందలకొద్దీ సృష్టించింది. ఆ యవనమిశ్రిత శకసైనికులు అమిత పరాక్రమవంతులు. వారు సంపంగి రేకులవంటి కాంతిమంతులు. బంగారువన్నె వస్త్రాలు ధరించి ధగధగలాడుతూ పెద్దపాముపాటి కత్తులతోనూ పట్టిసాలతోనూ చెలరేగి విశ్వామిత్రుడి సైన్యాన్ని అంతా దగ్ధముచేయ సాగినారు.

ఆ మంటలు చూచి విశ్వామిత్రుడు పరమకుపితుడు అయినాడు. అమోఘము అయిన అస్త్రాలు వేసి ఆ యవనులనూ శకులనూ పహ్లవులనూ కలవరపెట్టినాడు.

౨౨

విశ్వామిత్రుడి అస్త్రాలకు యవనాదులు చెల్లాచెదరు కావటము వసిష్ఠ మహర్షి చూచినాడు. యోగమహిమతో ఇంకా సేనలను సృష్టించవలసింది అని కామధేనువుకు చెప్పినాడు.

కామధేనువు "హుంభా" అని మరిఒకసారి రంకె వేసింది. అప్పుడు ఆ కామధేనువు నోటిలోనుంచి కాంతిమంతులు అయిన కాంభోజులు పుట్టుకొని వచ్చినారు. దానిపొదుగులోనుంచి శస్త్రాస్త్రపాణులు అయిన పహ్లవులూ దాని యోనిప్రదేశములోనుంచి యవనులూ దాని శకృత్ప్రదేశములోనుంచి శకులూ రోమకూపాలలోనుంచి మ్లేచ్ఛులూ కిరాతులూ పుట్టుకొనివచ్చినారు. వారు అందరూ క్షణలేశములో విశ్వామిత్రుడి రథగజతురగపదాతి సేనలను అన్నిటినీ నాశము చేసి వేసినారు.

అప్పుడు విశ్వామిత్రుడి నూరుగురుపుత్రులూ కుపితులు అయినారు. వారు వివిధాయుధాలతో వసిష్ఠ మహర్షిమీదికిపోయినారు. తనపయిన పడవస్తూ ఉన్న వారిని అందరినీ వసిష్ఠ మహర్షిచూచి హుంకారము చేసినాడు. అక్షణమే విశ్వామిత్రుడి నూరుగురుపుత్రులున్నూ వారివారి చతురంగబలాలతో భస్మము అయి పోయినారు.

విశ్వామిత్రుడు అది అంతాచూచినాడు. ఖిన్నుడు అయిపోయినాడు. ఆ మహాయశస్వికి సిగ్గువేసింది, అలలు ఆగిపోయినసముద్రమువలె యుద్ధ ప్రవృత్తి లేకుండా నిలుచునిపోయినాడు. కోరలుతీసిన పాముమాదిరిగా ఏమి చేయడానికి అశక్తుడు అయిపోయినాడు. రెక్కలు విరిచిన పక్షివలె దీనుడు అయిపోయినాడు. గ్రహణముపట్టిన సూర్యుడివలె తేజోహీనుడు అయిపోయినాడు.

ఆయన నూరుమంది పుత్రులూ హతము అయిపోయినారు. చతురంగసేనలూ హతము అయిపోయినవి. ఆయన దర్పము హతము అయిపోయింది. ఉత్సాహము హతము అయిపోయింది. పట్టరానిదుఃఖము వచ్చింది.

చావకుండా మిగిలిఉన్న ఒక్క కొడుకుకూ విశ్వామిత్రుడు పట్టముకట్టినాడు. క్షత్రధర్మముతో రాజ్యపాలనము చేయవలసింది అని ఆ కుమారుడికి బోధించి మహాదేవుణ్ణిగూర్చి తపస్సు చేయడానికి కిన్నరులూ ఉరగులూ నివసించే హిమాలయా పర్వతానికిపోయినాడు. అక్కడ మహోగ్రముగా తపస్సు చేయ నారంభించినాడు. కాలము గతించింది. వృషభధ్వజుడు ఆయనకు ప్రత్యక్షము అయి "ఓ రాజా, నీవు ఎందుకు తపస్సు చేస్తున్నావో చెప్పు" అన్నాడు. విశ్వామిత్రుడు నమస్కారము చేసి "మహాదేవా నా తపస్సు మెచ్చుకొన్నట్లయితే సాంగోపాంగముగా ఉపదేశగమ్యాలు అయిన రహస్యమంత్రాలు అన్నిటితోనూ నాకు ధనుర్వేదాన్ని అనుగ్రహించవలెను. దేవదానవయక్షరాక్షస గంధర్వులకూ మహర్షులకూ సాధనాలుగా ఉంటూ ఉన్న అస్త్రాలూ అన్నీ నాకు స్వాధీనము కావలెను. ఓ దేవా, నా ఈ మనోరథము తాము ఈడేర్చవలెను" అన్నాడు. "తథాస్తు" అంటూ శివుడు అంతర్ధానము అయిపోయినాడు.

మొదటినుంచీ విశ్వామిత్రుడు తాను మహాబలవంతుడను అనే గర్వముకలవాడు. ఆయా అస్త్రాలను అన్నిటినీ సంపాదించటముతో ఆయన మరింత గర్వి అయినాడు. అప్పుడు ఆయన వసిష్ఠమహర్షి ఆశ్రమానికి హుటాహుటిన పోయినాడు. పర్వదినాలలో సముద్రము మాదిరిగా విజృంభించినాడు. తేజోవంతము అయిన అస్త్రాలను అన్నిటినీ ఆ వసిష్ఠాశ్రమముమీద కురిపించసాగినాడు. అప్పుడు ఆ తపోవనము అంటుకొన్నది. పొగలూ మంటలూ ఆకాశము వరకూ లేచినవి. ఆపొగలకూ మంటలకూ పక్షిగణాలు అక్కడ నిలవలేకపోయినవి. అమితఘోరముగా కూస్తూ పైకి ఎగిరినవి. ఆయా మృగాలు అన్నీ చెల్లాచెదరు అయినవి. వసిష్ఠమహర్షి శిష్యులూ ఇంకా ఇతర మహర్షులూ ఆమంటల వేడికి తట్టుకోలేక పోయినారు. అందరూ భయభ్రాంతులు అయి దశదిశలాపరుగెత్తసాగినారు. "మంచును సూర్యుడు వలె ఈ విశ్వామిత్రుణ్ణి నేను రూపుమాపుతాను. భయపడవద్దు. పారిపోవద్దు," అంటూ వసిష్ఠమహర్షి ఎంత హెచ్చరించినా ఆ అగ్నిజ్వాలలకూ అధూమశిఖలకూ అక్కడ ఎవరూ నిలవలేక పోయినారు. అందరూ పారిపోయినారు.

ఆ తపోవనమంతా దగ్ధము అయిపోయింది. ఆ ప్రదేశము అంతా చడీ చప్పుడూ లేకుండా శూన్యము అయిపోయింది. ఒక పెద్ద ఎడారిగా అయిపోయింది.

వసిష్ఠమహర్షి రోషకషాయితాక్షుడు అయి విశ్వామిత్రుణ్ణిచూచి "ఓ మూఢుడా, ఎంతో కాలమునుంచీ పెంచిన ఈ తపోవనాన్నీ ఈ మున్యాశ్రమాన్నీ నాశనము చేసి వేసినావు. దురాచారానికి ఒడికట్టినావు. ఇక నీవు ఉండకూడదు" అంటూ బ్రహ్మదండాన్ని చేతిలో పట్టుకొన్నాడు.

అప్పుడు ఆ బ్రహ్మదండము దండధరుడి కాలదండము వలె పొగలూ గిగలూ లేకుండా ధగధగమండుతూ కనిపించింది.

## ౫౬

అంతట విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రాన్ని తీసుకొని "నిలు, నిలు-ఓ మహర్షీ" అన్నాడు.

ధగధగ మండుతూ ఉన్న బ్రహ్మదండాన్ని చేతిలోపట్టుకొని ఉన్న వసిష్ఠమహర్షి "ఇదిగో నిలుచున్నాను, క్షత్రియుడా నీ బలము అంతా చూపించవలెను. నీ శస్త్రాస్త్రాలను అన్నిటినీ ఉపయోగించు. నీ క్షత్రియబలము ఎటువంటిదో నా బ్రహ్మబలము ఎటువంటిదో చూదాము" అంటూ ఉండగానే విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రాన్ని వదిలినాడు.

ఆ ఆగ్నేయాస్త్రాన్ని వసిష్ఠమహర్షి తన బ్రహ్మదండములో నిరోధించినాడు. అంతట అది నీళ్లలోపడ్డ నిప్పుమాదిరిగా చల్లారిపోయింది. విశ్వామిత్రుడికి మరింత కోపమువచ్చింది. వారుణ రౌద్ర ఐంద్ర పాశుపత ఐషీకాస్త్రాలను ఒక్కసారిగా వదిలినాడు. అంతటితో కనితీరక మానవమూ మోహనమూ గాంధర్వమూ స్వాపనమూ జృంభణమూ మాదనమూ సంతాపనమూ విలాపనమూ శోషణమూ దారణమూ వజ్రమూ బ్రహ్మపాశమూ కాలపాశమూ వారుణపాశమూ పైనాకమూ దైతమూ అనే అస్త్రాలనూ శుష్కమూ ఆర్ద్రమూ అనే రెండు పిడుగులనూ దండమూ పైశాచమూ క్రౌంచమూ ధర్మచక్రమూ కాలచక్రమూ విష్ణుచక్రమూ వాయవ్యమూ మంథనమూ హయగ్రీవమూ అనే అస్త్రాలనూ ఇంకా రెండు శక్తులనూ వసిష్ఠమహర్షిమీద ప్రయోగించినాడు. వాటినే కాకుండా కంకాళమూ ముసలమూ మహాస్త్రమూ వైద్యాధరమూ కాలమూ దారుణమూ త్రిశూలమూ ఘోరమూ కాపాలమూ కంకణమూ అనే అస్త్రాలనూ వదిలినాడు.

ఆయా అస్త్రాలను అన్నిటినీ ఆ మంత్రవేత్త వసిష్ఠమహర్షి ముల్లోకాలూ ఆశ్చర్యపడిపోయేటట్లుగా తన బ్రహ్మదండముతో రూపుమాపినాడు.

ఆయా అస్త్రాలు అన్నీ వ్యర్థము అయిపోయినతరువాత విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రాన్ని వసిష్ఠమహర్షిమీద వదిలినాడు.

అప్పుడు అగ్నిహోత్రుడూ మొదలుఅయిన దేవతలూ దేవర్షులూ గంధర్వులూ మహోరగులూ సంభ్రాంతులు అయినారు.

ముల్లోకాలూ తల్లడిల్లిపోయినవి.

ఆ బ్రహ్మాస్త్రము బ్రహ్మదండాన్ని తప్పించుకొని వసిష్ఠమహర్షిమీదికి పోయింది. ఆ మహామంత్రవేత్త ఏమిచేస్తాడోనని లోకాలు అన్నీ నిరీక్షించసాగినవి.

ఆయన తన బ్రహ్మవిద్యాబలముతో దాన్ని మింగివేసినాడు. ఆయన రూపము అంతట మహాభయంకరముగా గోచరించింది. బ్రహ్మాస్త్రాన్ని మింగినందువల్ల ఆ మహర్షి ప్రతి రోమకూపములోనుంచీ పొగలు లేచినవి. మంటలు మండినవి. నిప్పురవ్వలున్నూ రేగినవి. బ్రహ్మదండము ప్రళయాగ్నిమాదిరిగా ప్రజ్వరిల్లింది. ఆయన రూపానికి ముల్లోకాలవారు నిశ్చేష్టులు అయినారు.

మహామునులు అందరూవచ్చి వసిష్ఠమహర్షినిచూచి "ఓ బ్రాహ్మణోత్తమా, తమ బలము అమోఘము. బ్రహ్మాస్త్రతేజాన్ని తమలోనే ఉంచుకోవలెను. విశ్వామిత్రుడు పరాజితుడు అయినాడు. తాము ఇక ప్రసన్నులు కావలెను. లేకపోతే ఈ లోకాలుఅన్నీ నానా వ్యథలపాలూ అయిపోతవి. కాబట్టి తాము ప్రసన్నులు కావలెను" అని ప్రార్థించినారు.

ఆ తేజోవంతుడికోపము ఉపశమించింది.

పరాభవముఅయిన విశ్వామిత్రుడు ఒక్కనిట్టూర్పువిడిచి "ఛీ ఛీ ఎందుకు ఈ క్షత్రియబలము. బ్రహ్మబలమే బలము. ఒక్క బ్రహ్మదండముతో వసిష్ఠమహర్షి నా అస్త్రాలను అన్నిటినీ హతమార్చినాడు" అనుకొంటూ రెండు బలాల తారతమ్యాన్ని ప్రశాంతచిత్తముతో ఆలోచించసాగినాడు.

## ౫౭

ఓ రామా, ఓడి పోయినందుకు విశ్వామిత్రుడి మనస్సు పరితపించింది. ఆత్మనిగ్రహముతో ఆలోచిస్తూ నిట్టూర్పులు విడువసాగినాడు. వసిష్ఠ మహర్షితో విరోధము వచ్చిందే అని విచారపడ్డాడు. తానూ బ్రహ్మర్షికావలెను అనుకొన్నాడు.

బ్రహ్మత్వసిద్ధికి తపస్సు చేయ సంకల్పించుకొని భార్యతో కూడా దక్షిణ దిక్కుకుపోయి అక్కడ అతి కఠిన నియమాలతో తపస్సు చేయనారంభించినాడు.

ఆ కాలములో ఆయనకు హవిష్యంసుడు మధుష్యందుడు దృఢనేత్రుడూ మహారథుడూ అనే నలుగురు పుత్రులు పుట్టినారు. ఆ నల్గురూ సత్యధర్మపరాయణులు.

విశ్వామిత్రుడు బహుకాలము తపస్సు చేసినాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షము అయి "ఓతపోధనా, నీవు రాజర్షులను అందరినీ జయించినావు. నీ తపస్సుకు మేమున్నూ ఇక నిన్ను రాజర్షిగా పరిగణిస్తాము" అంటూ బ్రహ్మలోకానికి వెళ్ళి పోయినాడు.

అంత తపస్సుకూ ఇదేనా ఫలము అని విశ్వామిత్రుడు నిరుత్సాహపడి పోయినాడు. ఎంతో దుఃఖపడ్డాడు. తిరిగీ తీవ్రనియమాలతో తపస్సు చేయ సంకల్పించుకొన్నాడు. పరమోత్కృష్టముగా తపస్సు సాగించినాడు.

విశ్వామిత్రుడు తపస్సు చేస్తూ ఉన్న కాలములో ఇక్ష్వాకువంశములో త్రిశంకువు అనే కులదీపకుడు రాజ్యపాలనము చేస్తూ ఉన్నాడు. ఆయన సత్యవ్రతుడు. జితేంద్రియుడు. జగత్ప్రసిద్ధుడు. బొందితో స్వర్గానికి పోవలెను అని ఆయనకు బుద్ధిపుట్టింది. అందుకు ఏది అయినా యజ్ఞము చేయవలెను అనుకొని వసిష్ఠ మహర్షిని పిలిపించి తన అభిలాష తెలియ చెప్పినాడు. ఆ పురోహితుడు అది శక్యము కాదు అని చెప్పి మందలించినాడు.

వసిష్ఠ మహర్షి అశక్యము అని నిరాకరించినందు వల్ల ఆయనపుత్రులను సందర్శించి వారిచేత యజ్ఞము చేయించుకోవలెను అనుకొని త్రిశంకువు బయలు దేరినాడు. దక్షిణ దిక్కుగా పోయి తపోదీప్తులతో తేజరిల్లుతూఉన్న వాసిష్ఠులను నూరుగురినీ చూచినాడు. తలవంచుకొని నమస్కారము చేసి "నేను శరణాగతుణ్ణి, శరణము ఇవ్వటానికి తామే సమర్థులు. నేను ఒక మహాయజ్ఞము తలపెట్టినాను. వసిష్ఠులవారు అది అశక్యము అన్నారు. మీరు గురుపుత్రులు, ఆ యజ్ఞము మీరు చేయించవలెను. నన్ను అనుగ్రహించవలెను. నేను బొందితో స్వర్గానికి పోతలచినాను. మీరు అందుకు యజ్ఞము చేయించవలెను. ఇందుకోసము నేను మరి ఒకరి దగ్గిరకు పోతలచుకోలేదు. రాజులను తరింపచేసేది వేత్తలు అయిన పురోహితులే. మా ఇక్ష్వాకూ వంశీయులకు అందరికీ పురోహితులు అయిన వసిష్ఠుల వారు కాదు అన్నారు. ఇక వారి తరువాత మీరే తారకము" అన్నాడు త్రిశంకువు.

## ౫౯

ఓ రామా, త్రిశంకువు చెప్పింది అంతా వాసిష్ఠులు విన్నారు. వారికి కోపము వచ్చింది. "ఓ రాజా, ఇక్ష్వాకులకు వసిష్ఠమహర్షే పురోహితుడు.

మీకు అయనే పరమగురువు. ఆయన సత్యప్రతిజ్ఞుడు. ముల్లోకాలలోనూ యజ్ఞాలు చేయించడానికి ఆయన ఒక్కడే అధికారి, ఆయన ఒక్కడే సమర్థుడు. ఆయన కాదు అన్న తరువాత మరి ఒకరిని నీవు ఆశ్రయించడము ఏమిటి? ఆయనమాటను నీవు కాదుకదా మేమూ అతిక్రమించకూడదు, ఆయన అశక్యము అని చెప్పిన యజ్ఞము మేము ఎట్లా చేయించకలము అనుకొన్నావు. మేము ఆయనను అవమానిస్తామా. రాజా, నీకు మతి పోయింది. నీవు వెంటనే ఇంటికి వెళ్ళి పోవలసింది" అని వాసిష్ఠులు కోపపడినారు.

వాసిష్ఠుల మందలింపులకు త్రిశంకువు "గురువులు నన్ను తిరస్కరించినారు. గురుపుత్రులు మీరున్నూ తిరస్కరిస్తున్నారు. ఇక మీ పెద్దరికానికి ఇంతటితో స్వస్తి. నేను ఇక మరి ఒక పురోహితుణ్ణి చూచుకొంటాను" అని ధిక్కరించినాడు.

పరంపరాగతము అయిన పౌరోహిత్యాన్ని మార్చివేస్తాను అనడము వాసిష్ఠులకు ఘోరముగా తోచింది. అందులో వసిష్ఠమహర్షి అంతటివాణ్ణి వదులుకొంటాను అన్నందుకు వాసిష్ఠులు క్రుద్ధులు అయిపోయినారు. త్రిశంకువును చండాలుడవు అయిపొమ్మని శపించినారు.

తెల్లవారేసరికి త్రిశంకువుకు చండాలుడి రూపము వచ్చింది. దేహము అంతా ఓరుసెక్కి నల్లబడిపోయింది. దుస్తులు అన్నీ నీలిరంగు గుడ్డలుగా మారిపోయినవి. ఆభరణాలు అన్నీ ఇనుప సొమ్ములు అయిపోయినవి. తలవెంట్రుకలు కురచపారినవి. ఒంటినిండా వల్లకాటి బూడిద అలముకొన్నది. స్మశాన సుమనాలు మెడలో దండలు అయినవి.

ఆయనవెంట ఉన్న మంత్రులు మొదలు అయినవారు అప్పుడు ఆయన చండాల రూపము చూచి తప్పుకొని దూరదూరముగా పోయినారు.

త్రిశంకుమహారాజు విఫలమనోరథుడు అయిపోవడమే కాకుండా చండాలుడున్నూ అయిపోయినాడు. అయితే ఆయన ధైర్యవంతుడు. ఆధైర్యమే ఆయనకు అప్పుడు తోడుఅయింది. అహోరాత్రములూ అమితదుఃఖముతో బాధపడుతూ విశ్వామిత్రుడి దగ్గిరకు పోయినాడు. అఘోరరూపము చూచి విశ్వామిత్రుడు జాలిపడి "ఓ రాజా నీవు మహాబలవంతుడవు. శూరుడవు. రాజపుత్రుడవు. ఏదో శాపమువల్ల నీకు ఈ చండాలరూపము వచ్చినట్టుఉంది. ఆ శాపానికి కారణము ఏమిటి. కారకులు ఎవరు. ఇప్పుడు నీవు ఇక్కడికి ఎందుకు వచ్చినావు" అని అడిగినాడు.

త్రిశంకువు విశ్వామిత్రుడికి నమస్కారము చేసి "నా గురువూ నా గురు పుత్రులూ నన్ను తిరస్కరించినారు. నా కోరిక నెరవేర్చకపోవడమే కాకుండా వారు నాకు ఈ గతిపట్టించినారు. ఇదివరకు నేను ఎన్నడూ అబద్ధము ఆడి ఎరగను. ఇకముందు కూడా ఎటువంటి కష్టాలలో నయినా అబద్ధము ఆడనని తమ ఎదుట శపథము చేస్తున్నాను. నేను ధర్మమార్గాన రాజ్య పాలనము చేసినాను. గురువులను వినయవిధేయతలతోనూ సదాచారముతోనూ సంతోష పెట్టినాను. నేను నూరు యజ్ఞాలు చేసినాను. ఇంకా అనేక సత్కార్యాలు చేసినాను. సశరీరముగా స్వర్గానికి పోవలెను అనుకొని ఏది అయినా యజ్ఞము చేయించవలసింది అని గురువులను వేడుకొన్నాను. వారు కాదు అన్నారు. అప్పుడు గురుపుత్రులను ఆశ్రయించినాను. వారు కాదు అనడమే కాకుండా నాకు శాపము పెట్టినారు. నేను ఇట్లా అయిపోయినాను. నే చేసిన సత్కార్యాలు అన్నీ నిష్ఫలాలు కాబోలు. నా ప్రయత్నము అంతా నిరర్థకము అయిపోయింది. సర్వమూ దైవాధీనము ఏమో. దైవమే బలీయము ఏమో నాకు తెలియటములేదు. నేను దైవోపహతుడను. చాలా దుఃఖములో ఉన్నాను. తమ అనుగ్రహము కోసము వచ్చినాను. తాము నన్ను ఉద్ధరించవలెను తాము తప్ప నాకు మరి ఒక దిక్కు లేదు. పురుషప్రయత్నముతో దైవికాన్ని తిప్పివేయ డానికి సమర్థులు తాము ఒక్కరే. అందుకోసము ఇక్కడికి వచ్చినాను" అన్నాడు.

౫౯

చండాల రూపములో ఉన్న త్రిశంకువు చెప్పిందిఅంతా విశ్వామిత్రుడు విన్నాడు; విని కృపావేశముతో "నాయనా, త్రిశంకూ, నీకు స్వాగతము. నీవు పరమ ధార్మికుడవు అనీ సత్యసంధుడవు అనీ నేను ఎరుగుదును. నిన్ను నేను కాపాడుతాను. నీవు భయపడవద్దు. యజ్ఞకర్మనిర్వాహకులు అయిన పుణ్యకర్ము లనూ మహర్షులనూ రావిస్తాను. యజ్ఞము చేయిస్తాను. ఈ చండాలరూపముతో నీవు స్వర్గానికిపోయేట్లు చేస్తాను. శరణము ఇవ్వగల విశ్వామిత్రుడి దగ్గరకే నీవు చేరినావు. కాబట్టి స్వర్గము నీచేత చిక్కింది అనే అనుకోవచ్చును" అని చెప్పి ఆమహాతేజోవంతుడు మహాప్రాజ్ఞులూ పరమ ధార్మికులూఅయిన తన పుత్రు లను యజ్ఞసంభారాలు సమకూర్చడానికి నియోగించినాడు.

ఆయన శిష్యులను అందరినీ పిలిచి, 'నాయనలారా, మీరు వివిధ దేశాలకూ పోయి బహుశ్రుతులూ ఋత్విజులూ అయిన మహర్షులను శిష్య మిత్ర సమేత

ముగా నేను చెప్పినాను అనిచెప్పి ఇక్కడికి పిలుచుకొనిరావలెను. మీరు ఆహ్వానించినప్పుడు ఎవరు ఎవరు ఏమి అనేది మరిచిపోవద్దు. మళ్లీ వచ్చినతరువాత అది అంతా నాకు చెప్పవలెను" అని ఆజ్ఞాపించినాడు.

వారు అప్పటికి అప్పుడు నాల్గుదిక్కులకూ పోయినారు.

సమస్తదేశాలనుంచీ బ్రహ్మర్షులు అక్కడికి వచ్చినారు.

విశ్వామిత్రుడి శిష్యులు తమ గురువును చూచి "స్వామీ, తమ మాట చొప్పున సమస్తదేశాల బ్రాహ్మణోత్తములూ వచ్చిఉన్నారు. మహోదయుడున్నూ తక్కిన వాసిష్ఠులున్నూ రాలేదు. మేము పిలవగానే వారు నూరుగురూ కోపముతో మండిపడి 'యజ్ఞము చేసేవాడు చండాలుడు. చేయించేవాడు క్షత్రియుడు. ఆయజ్ఞహవిస్సును దేవతలు ఎట్లా భక్షిస్తారు. విశ్వామిత్రుడి మాట విని చండాలన్నము భుజించే బ్రాహ్మణోత్తములు స్వర్గానికి ఎట్లా పోగలుగుతారు' అన్నారు. మహోదయుడితో కూడా ఆ నూరుగురు వాసిష్ఠులూ కన్నులు ఎర్రచేసి నిష్ఠురోక్తులు అడినారు" అని చెప్పినారు.

విశ్వామిత్రుడికి కోపము వచ్చింది. "నేను మహోగ్రము అయిన తపస్సు చేసినవాణ్ణి. నాలో ఏదోషమూ లేదు. నన్ను దూషించిన అదురాత్ములు భస్మము అయిపోవలెను. ఆ వాసిష్ఠులు అందరూ ఇప్పుడే యమలోకముపాలు అయిపోవలెను. తిరిగి అనేక జన్మలు ఎత్తవలెను. ముష్టికులు అనే హీనజాతిలో పుట్టి శవభక్షకులు అయిపోవలెను. వాండ్లు నిర్దయులు అయి రోత పుట్టించే రూపాలతోనూ ఆచారాలతోనూ కుక్క మాంసము తింటూ తిరుగుతూ ఉండవలెను. దూషించకూడని నన్ను దూషించిన మహోదయుడు లోకముఅంతా దూషించే కిరాతుడుగా పుట్టవలెను. వాడు దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రాణాలు తీయడమే పనిగా పెట్టుకొని బహుకాలమూ బ్రతుకవలెను" అంటూ శపించినాడు.

## ౬౦

ఈవిధముగా అ మహాతేజోవంతుడు విశ్వామిత్రుడు వాసిష్ఠులను శపించి వారిని అందరినీ తన తపోబలముతో హతముఅర్చి వేసినాడు. అక్కడ అప్పుడు సమావేశము అయిన మహర్షులతో "ఓ మహర్షులారా, ఈయన ఇక్ష్వాకు వంశీయుడు. త్రిశంకు మహారాజు. పరమధార్మికుడు. దాత. బొందితో స్వర్గానికి పోవలెను అనుకొని గురువులనూ గురుపుత్రులనూ యజ్ఞము చేయించమన్నాడు. గురుపుత్రులు కోపించి ఈయనను శపించినారు. అందువల్ల క్షత్రియ రూపము

పోయి ఈ చండాలరూపము వచ్చింది. ఇంకా అదే కోరికతో నాశరణుజొచ్చి నాడు. నేను యజ్ఞము చేయించతలచినాను. మీరు అందరూ నాకు తోడుపడ వలెను" అని చెప్పినాడు.

అ ధర్మజ్ఞులు అందరూ ఏకముఅయి సంప్రదించుకొన్నారు.

"ఈ కౌశికుడు కోపధారి, అగ్నిహోత్రమువంటివాడు. ఎంతో మహిమ కలవాడు. ఆగ్రహము వస్తే మనలను అందరినీ కూడా శపించివేస్తాడు. కనుక ఈయన చెప్పినట్టు చేయడమే ఉత్తమము. సంశయించనక్కరలేదు. ఈయజ్ఞము చేయించవలసిందే. ఈయన ప్రభావమువల్ల త్రిశంకువు ఎట్లాగూస్వర్గానికిపోయి తీరుతాడు" అని నిశ్చయించినారు.

యజ్ఞము అరంభము అయింది. ఆ మహాయజ్ఞానికి విశ్వామిత్రుడు యాజకుడు. మంత్రకోవిదులు అయినవారు అందరూ ఋత్విజులు. ఆయా కర్మలను అన్నిటినీవారు మంత్రవిహితముగానూ శాస్త్రయుక్తముగానూ కల్పసూత్రాను సారముగానూ పూర్తిచేసినారు. వారివారి హవిర్భాగాలను తీసుకొనిపోవడానికి దేవతలను అందరినీ చాలాసేపు విశ్వామిత్రుడు ఆవాహనచేసినాడు. దేవతలు ఒక్కరున్నూ రాలేదు. అంతట కోపావేశముతో విశ్వామిత్రుడు స్రువము (హోమముచేసే తెడ్డు) చేతిలో పట్టుకొని "ఓ త్రిశంకూ, ఈయజ్ఞము నిష్ఫలము అయిపోతే పోనీ. ఇక నా తపః ప్రభావము చూపిస్తాను. బొందితో పోవడానికి ఎవరికీ వీలుకాని స్వర్గలోకానికి నిన్ను ఇప్పుడే పంపిస్తాను అంటూ నా స్వార్జిత తపస్సుకు ప్రభావమే ఉన్నట్లయితే ఈ త్రిశంకు మహారాజు ఇప్పుడే స్వర్గానికి వెళ్లిపోవలెను." అని ప్రతిజ్ఞ చేసినాడు.

అప్పుడు అక్కడివారు అందరూ చూస్తూఉండగానే త్రిశంకువు స్వర్గానికి వెళ్లిపోయినాడు.

త్రిశంకువు స్వర్గలోకము చేరినాడు. దేవేంద్రుడు దేవతలను అందరినీ ఆలోచించి "ఓ త్రిశంకూ, నీవు గురుశాపహతుడవు. నీవు ఈ దేవలోకములో ఉండటానికి వీలులేదు. మళ్ళీ భూమిమీద తలక్రిందులుగా పడిపో" అని ఆజ్ఞాపించినాడు.

అంతట త్రిశంకువు తలక్రిందులుగా పడిపోతూ "మహామునీ రక్షించు రక్షించు" అంటూ కేకలు పెట్టినాడు. ఆ కేకలు విశ్వామిత్రుడువిన్నాడు.

విశ్వామిత్రుడికి తీవ్రము అయిన కోపము వచ్చింది. "నిలు అక్కడనే నిలు" అంటూ తన తపోబలముతో ఆ త్రిశంకువును నేలమీద పడకుండా అంతరిక్షములో నిలిపివేసినాడు. మహర్షిమధ్యములో ఉన్న విశ్వామిత్రుడు అంతట

రెండవ బ్రహ్మదేవునికి మల్లె అంతరిక్షములో త్రిశంకువు ఉన్న దిక్కున మరి ఒక దేవలోకము సృష్టించడానికి పూనుకున్నాడు. అప్పటికిఅప్పుడే దక్షిణ దిక్కున వేరే సప్తర్షులనూ నక్షత్రాలనూ సృష్టిచేసినాడు. ఆయన కోపము అంతటిలొ ఆగలేదు. మరి ఒక ఇంద్రుణ్ణి సృష్టించడమూ లేక ఇంద్రుణ్ణే లేకుండా చేయడమూ అని ఆలోచిస్తూ తక్కిన దేవతలను సృష్టించడము మొదలు పెట్టినాడు.

అందువల్ల దేవతలు అందరూ భయసంభ్రాంతులు అయిపోయినారు. వారు అందరూ విశ్వామిత్రునిదగ్గరకు పరుగెత్తుకొని వచ్చినారు. ఆయన కోపము చల్లారుస్తూ "ఓ మహాభాగా, తమకు తెలియనిది ఏమీ లేదు. త్రిశంకుమహారాజు గురుశాపహతుడు. కాబట్టి దేవలోకము రాతగినవాడు కాడు" అని చెప్పినారు.

"ఓ దేవతలారా, నేను ఈ త్రిశంకువును దేహముతో స్వర్గానికి పంపిస్తాను అని ప్రతిజ్ఞచేసినాను. నా ప్రతిజ్ఞ దబ్బర కాకూడదు. మీరు ఉంటూ ఉన్న స్వర్గములో ఈ త్రిశంకువు ఉండటానికి మీరు వీలులేదు అంటున్నారు. కనుక ఇప్పుడు ఈయన ఉన్న ప్రదేశమే స్వర్గము కావలెను. నేను సృష్టించిన ఈ నక్షత్రాలూ మొదలుఅయినవి అన్నీ సుస్థిరముగా ఉండిపోవలెను. ఇందుకు మీరు ఒప్పుకోవలెను." అన్నాడు.

అందుకు దేవతలు అందరూ అంగీకరించి "మహామునీ, తాము సృష్టించిన నక్షత్రాలు అన్నీ జ్యోతిశ్చక్రానికి వెలుపల శాశ్వతముగా ప్రకాశిస్తూఉంటవి. త్రిశంకువు గురుశాపహతుడు కనుక వాటి నడుమను తలక్రిందులుగాఉంటాడు. అయినప్పటికీ దేవసమానుడుగా తేజరిల్లుతూఉంటాడు. ఈ ఇక్ష్వాకువు కృతార్థుడు అయి స్వర్గలోకములో ఉన్నవాడివలె కీర్తితో ప్రకాశిస్తూఉంటే ఈ జ్యోతులు అన్నీ ఆయన్ను అనుసరించుకొని ఉంటవి" అని చెప్పి విశ్వామిత్రుణ్ణి స్తోత్రము చేసినారు. అందుకు విశ్వామిత్రుడు ఒప్పుకొన్నాడు.

ఆ యజ్ఞము సమాప్తము అయిపోయింది. దేవతలూ మహర్షులూ ఎవరిదారిన వారు వెళ్లిపోయినారు.

## ౬౧

ఆ యజ్ఞానికి వచ్చినవారు అందరూ వెళ్ళిపోయిన తరువాత విశ్వామిత్రుడు ఆ తపోవనములో ఉన్నవారు అందరితోనూ తాను దక్షిణ దిశకువచ్చిన తరువాత తన తపస్సుకు పెద్ద విఘ్నము అయింది అనీ ఇంకొక దిక్కునకుపోయి తపస్సు చేసుకోడము మంచిది అనీ పడమటి దిక్కున విశాలము అయిన తపోవ

వాలు ఎన్నో ఉన్నవి అనీ పుష్కరతీర్థతీరాన సుఖముగా తపస్సు చేసుకో వచ్చును అనీ చెప్పి అనుచరులు అందరితోనూ ప్రయాణము అయి పశ్చిమ దిక్కుగా పోయినాడు. పుష్కరతీర్థము చేరినారు.

ఫలమూలాలను మాత్రమే ఆహారముగా చేసుకొని మహోగ్రముగానూ అనివార్యముగానూ విశ్వామిత్రుడు తపస్సు చేయ నారంభించినాడు.

ఆ కాలములో అయోధ్యానగరములో అంబరీషుడు అనేరాజు రాజ్యపాలనము చేస్తూ ఉన్నాడు. ఆయన ఒక యజ్ఞము ఆరంభించినాడు. ఆ యజ్ఞము జరుగుతూ ఉండగా దేవేంద్రుడు యజ్ఞపశువును దొంగిలిపోయినాడు. ఆ పశువు కనపడకుండా పోయినందువల్ల పురోహితుడు "ఓ రాజా, నీవు పరాకుగా ఉన్నందువల్ల నీ యజ్ఞ పశువును ఎవరో ఎత్తుకొని పోయినారు. ఈ దోషము నిన్ను నాశనము చేసివేస్తుంది. ఇందుకు ప్రాయశ్చిత్తము చాలా కష్టముఅయింది. కాబట్టి యజ్ఞకర్మను ఆరంభము చేసేలోపల యజ్ఞపశువును కానీ ఆ పశువు దొరకక పోయేట్లయితే ఒక నరపశువును కానీ పట్టుకొని రావలెను. ఈ పని వెంటనే చేయవలెను" అన్నాడు

అంబరీషుడు తెలివితేటలు కలవాడు, వేలకొద్దీ ఆవులను వెంటతీసుకొని యజ్ఞపశువును వెతకడానికి బయలుదేరినాడు. దేశదేశాలూ మహానగరాలూ జనపదాలూ పుణ్యాశ్రమాలూ ఎన్నో వెదకినాడు. కాని ఎక్కడను ఆయన యజ్ఞ పశువు దొరకలేదు. చివరకు భృగుతుంగము అనే పర్వత ప్రదేశములో భార్యాపుత్రులతో ఉంటూ ఉన్న రుచీక మహర్షిని చూచినాడు.

అంబరీషుడు తపోదీప్తులతో తేజరిల్లుతూ ఉన్న ఆ రుచీకమహర్షిని సత్కరించి సంతోషపెట్టినాడు. నమస్కారము చేసి కుశలము అడిగి తెలుసుకొని "మహర్షీ, నాయజ్ఞ పశువు కనపడకుండా పోయింది. దేశదేశాలూ తిరిగినాను. ఎక్కడనూ దొరకలేదు. మీ ముగ్గురి కొమాళ్లలో ఒకరిని నాకు యజ్ఞపశువుగా విక్రయించ ప్రార్థిస్తున్నాను. నేను కృతార్థుణ్ణి అవుతాను. ఇందుకు తమకు నేను ఒక లక్షగోవులను ఇస్తాను." అని అంబరీషుడు చెప్పినాడు.

"రాజా, నీవు ఏమి ఇచ్చినా నా పెద్ద కుమారుణ్ణి ఇవ్వను" అన్నాడు రుచీకుడు.

ఆయన ఇల్లాలు మహా తపస్విని. ఆమె అది విని "ఓరాజా, మహాభాగుడు నా పెనిమిటి పెద్దపిల్లవాణ్ణి అమ్మను అన్నాడు. కడగొట్టువాణ్ణి అమ్మడానికి నేను ఒప్పుకోను. ఏమంటే తరుచూ తండ్రికి పెద్దపిల్లవాడు అంటే ఇష్టము;

తల్లికి కనిష్ఠివాడినీ మహారాజా. అందువల్ల పసివాణ్ణి! నేను అట్టిపెట్టుకొంటాను" అన్నది.

తల్లితండ్రులు చెప్పుతూఉన్నది వింటూఉన్న నడిమివాడు శునశ్శేపుడు "రాజా, నా నాయన పెద్దవాణ్ణి అమ్మను అన్నాడు. మాఅమ్మ చిన్నవాణ్ణి అమ్మడానికి వీలులేదు అన్నది. మధ్యవాణ్ణి నన్ను వారు అమ్మివేసినట్టే ఎంచుకోవచ్చును. కాబట్టి లక్ష గోవులూ నా తండ్రికి ఇచ్చివేసి తాము నన్ను తీసుకొని వెళ్ళవచ్చును" అన్నాడు.

అందుకు అంబరీషుడు అమిత సంతోషముగా ఋచీకుడికి లక్షగోవులూ ఇచ్చి శునశ్శేపుణ్ణి తనరథము ఎక్కించుకొని తత్క్షణమే బయలుదేరినాడు.

## ౬౨

ఓ రామా, అంబరీష మహారాజు శునశ్శేపుణ్ణి రథముమీద తీసుకొనిపోతూ ఉండగా మిట్టమధ్యాహ్నము అయింది. పుష్కరతీర్థము చేరినారు. అక్కడ ఆ మహారాజు విశ్రమించినాడు.

ప్రాణముపోతుంది అనే దిగులుతో శునశ్శేపుడిముఖాన కళాకాంతులూ మాసిపోయినవి. ప్రయాణమువల్ల అలసిపోయినాడు. దాహము వేసింది. నీళ్ళదగ్గరకు పోయినాడు. అక్కడ ఋషులతో కూడా తపస్సు చేసుకొంటూఉన్న విశ్వామిత్రుణ్ణి చూచినాడు. పరుగెత్తుకొంటూపోయి ఆయన పాదాలమీద పడ్డాడు.

"ఓమహర్షి, నాతల్లిదండ్రులు నన్ను యజ్ఞపశువుగా అంబరీషమహారాజుకు అమ్మివేసినారు. ఇక నాకు తల్లివీ తండ్రివీ నీవే. జ్ఞాతివిఅయినా బంధువువవుఅయినా గురువు అయినా నీవు ఒక్కడవే నాకుఉన్నావు. నీవు దయానిధివి. అడిగినవాణ్ణి కాదు అనకుండా కాపాడుతూఉన్నావు. దయామతితో నీవు నన్ను బ్రతికించవలెను. అయితే లక్షగోవులు ఇచ్చి నన్ను కొనుక్కున్న అంబరీషమహారాజు యజ్ఞము చెడిపోకూడదు. నాకు ఆయుర్దాయము అనుగ్రహించవలెను. నేను కామభోగార్థము ఆయుర్దాయము అనుగ్రహించవలెను అని ప్రార్థించడములేదు. తపస్సుచేయడానికే నేనుఆయువుఅర్థిస్తున్నాను. నేను ఇప్పుడు దిక్కులేనివాణ్ణి. ఈ ఆపత్కాలములో తాము నన్ను తమ పుత్రుడు వలె రక్షించవలెను" అంటూ శునశ్శేపుడు వేడుకొన్నాడు.

విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి ఓదార్చి తన కుమాళ్ళను చూచి "ఓ పుత్రులారా, మీరు పుత్రులుగా నాకు అక్కరకు వచ్చేదీ లేనిదీ తెలుసుకోడానికి

ఇప్పుడు సమయము వచ్చింది. తండ్రి కోరికలను సఫలము చేయడమే కొడుకులకు పరమధర్మము. ఈ చిన్నవాడు ముని పుత్రుడు. ప్రాణముకోసము నా శరణు జొచ్చినాడు. వీడి ప్రాణము కాపాడి నన్ను మీరు సంతోష పెట్టవలెను. మీరు అందరూ పుణ్యకర్ములు. ధర్మపరాయణులు. మీలో ఒకరు అంబరీషుడికి యజ్ఞపశువుగాపోయి ఈ శునశ్శేపుణ్ణి బ్రతికించవలెను. అట్లా చేసేట్లయితే అంబరీషుడి యజ్ఞమూ నెరవేరుతుంది, ఈ శునశ్శేపుడున్నూ బ్రతుకుతాడు; మీరు అందరూ నా మాట పాటించినవారున్నూ అవుతారు" అన్నాడు.

విశ్వామిత్రుడి పుత్రులు మధుష్యందాదులు సాభిమానముగానూ పరిహాసముగానూ, "ప్రభూ, తమ స్వంతబిడ్డలను వదిలిపెట్టి పరాయిపిల్లవాణ్ణి కాపాడబోవటము మధురాహారము విడిలిపెట్టి శ్వమాంసాహారముకోసము తాపత్రయపడడముగా ఉంది. ఇది మాకు అకార్యముగా తోస్తూఉంది" అన్నారు.

కొడుకులు అన్నమాటలకు విశ్వామిత్రుడికి కోపము వచ్చింది. కన్నులు ఎర్రచేసి "తండ్రికి ఎదురు ఆడకూడదు అనే భయము లేకపోవడమే కాకుండా ధర్మరహితముగానూ దారుణముగానూ మాట్లాడినారు. నాఒంట్లు గరు పుట్టించినారు. మీరున్నూ వాసిష్ఠులవలె ముష్టికులుఅయిపోయి కుక్కమాంసముతింటూ ఈ భూమిమీద బహుకాలము బ్రతికిఉండవలెను" అని శాపము పెట్టినాడు.

దిగులుపడిపోయిఉన్న శునశ్శేపుడికి ఏ బాధాలేకుండా పోవడానికి అంతట విశ్వామిత్రుడు విభూతిమంత్రించి రక్షపెట్టి "ఓ పిల్లవాడా నీకురెండు మంత్రాలు ఉపదేశము చేస్తాను. నిన్ను యూపస్తంభానికి కట్టివేయగానే నీవు ఆ రెండు మంత్రాలూ జపము చేయవలెను. అంతట ఇంద్రోపేంద్రులు నిన్ను రక్షిస్తారు. నీకు జీవితసిద్ధి కలుగుతుంది" అంటూ రెండు మంత్రాలూ ఉపదేశించినాడు.

శునశ్శేపుడి మనస్సు కుదుటపడ్డది. అతడు అంబరీషమహారాజు దగ్గరకు పరుగెత్తుకొనిపోయి "రాజా, ఆలస్యము చేయవద్దు. ఇక్కడనుంచి ఇప్పుడే వెళ్ళిపోదాము. తాము యజ్ఞకర్మను శీఘ్రముగా ముగించవచ్చును" అని చెప్పినాడు. ఆమాటలకు అంబరీషుడు సంతోషపడ్డాడు. ఉత్సాహముతో బయలుదేరినాడు. ఏ మాత్రమూ జాగుచేయకుండా యజ్ఞశాల ప్రవేశించి పురోహితుడి అనుమతితో యజ్ఞకర్మను ఆరంభించినాడు.

శునశ్శేపుడి ఒంటినిండా గంధము పూసినారు. రక్తమాల్యాంబరాలతో అలంకరించినారు. యజ్ఞపశువుగా అతనిని యూపస్తంభానికి కట్టివేసినారు.

అచల నిష్ఠతో శునశ్శేపుడు విశ్వామిత్రుడు ఉపదేశించిన రెండు మంత్రాలూ జపము చేయడము మొదలు పెట్టినాడు.

ఇంద్రో పేందులు సంతృప్తులు అయినారు. శునశ్శేపునికి దీర్ఘాయువును ఇచ్చినారు. అంబరీషునికి యజ్ఞఫలము బహుగుణముగా అనుగ్రహించినారు.

## 63

ఆ పుష్కర తీర్థాన విశ్వామిత్రుడు బహుకాలము తపస్సు చేసినాడు. తపోవ్రతము అయిపోతూ ఉండగా బ్రహ్మదేవుడు దేవతలను అందరినీ వెంట పెట్టుకొనివచ్చి విశ్వామిత్రుణ్ణిచూచి "నీకు శుభము అవుతుంది. ఇంతవరకూ నీవు చేసిన శుభకర్మలకు నిన్ను ఒక ఋషిగా పరిగణిస్తున్నాను" అంటూ పరివారముతో అంతర్ధానము అయినాడు.

విశ్వామిత్రుడు అసంతృప్తుడు అయినాడు. మళ్లీ తపస్సు చేయడము మొదలు పెట్టినాడు. బహుకాలము అయిపోయింది. ఒకనాడు ఆ పుష్కర తీర్థములో మేనక అనే అప్సరస జలకమాడటానికి వచ్చింది. మేఘాలలో మెరుపు మాదిరిగా ఆమె విశ్వామిత్రుడి కన్నులలో మెరిసింది. ముగ్ధుడు అయినాడు. ఆమె అప్రతిమాన సౌందర్యానికి మన్మథపరవశుడు అయిపోయినాడు. ఆమెను చూసి "ఓ అప్సరసా, స్వాగతము. నీవు నా ఆశ్రమములో ఉండవలెను. నీకు శుభము అవుతుంది. నిన్ను నేను మోహించినాను. నీవు నన్ను ఏలుకోవలసింది" అన్నాడు.

ఓ రామా, ఆ మేనక అక్కడ విశ్వామిత్రుడితో కాపురము చేసింది. ఇట్టే పది సంవత్సరాలు అయిపోయినవి అప్పుడు విశ్వామిత్రుడికి సిగ్గు వేసింది. శోకపరాయణుడు అయిపోయినాడు. ఆలోచించసాగినాడు. అది అంతా దేవతలు తన తపస్సు చెడగొట్టడానికి పన్నిన పన్నాగము అని తెలుసుకొన్నాడు. మోహానికి లొంగిపోయినందువల్ల పది సంవత్సరాలూ ఒక్క అహోరాత్రముగా గడచిపోయినవే అని విచారపడ్డాడు. కామాతురతవల్ల అంతటి విఘ్నము అయిపోయిందే అని పశ్చాత్తాపపడ్డాడు. దుఃఖముతో కుమిలిపోతూ నిట్టూర్పులు విడుస్తూ మేనకవంక చూచినాడు.

మేనక భయపడిపోయింది. గజగజ వణికింది. చేతులు కట్టుకొని నిలుచున్నది.

విశ్వామిత్రుడు ఆమెకు తియ్యని మాటలు చెప్పి అక్కడ ఉండకుండా ఉత్తర దిక్కుగా బయలుదేరి పోయినాడు.

ఆ విధముగా మేనకను వదిలించుకొన్న విశ్వామిత్రుడు హిమవత్పర్వత పార్శ్వములో కౌశికీ నదీతీరానికి పోయినాడు. ఇంద్రియాలను జయించవలెను అనే దృఢ సంకల్పముతో దారుణము అయిన తపస్సు మొదలు పెట్టినాడు.

చాలా కాలము అయిపోయింది. ఆయన మహోగ్రతపస్సుకు దేవతలు అందరూ భయపడిపోయినారు. వారు అందరూ బ్రహ్మదేవుడితో విశ్వామిత్రుడి దగ్గరకు పోయినారు. బ్రహ్మదేవుడు "ఓ విశ్వామిత్రుడా, నీమహోగ్రతపస్సుకు మెచ్చుకొన్నాను. నీఋషిముఖ్యత్వమూ నీమహాత్మ్యమూ గమనించినాను. ఇకను ఇంతట నుంచీ నిన్ను మహర్షిగా భావిస్తాను" అన్నాడు.

బ్రహ్మదేవుడి మాటలకు విశ్వామిత్రుడు సంతోషించనూలేదు, కించపడనూలేదు. నమస్కారము చేసి "స్వామీ, నేను మహర్షిని అయినాను అని తాము అంటున్నారు. అయితే నేను జితేంద్రియుణ్ణి అయినట్టు తాము అంగీకరిస్తారా" అని బ్రహ్మదేవుణ్ణి ప్రశ్న చేసినాడు.

"నీవు జితేంద్రియుడవు కాలేదు. ఇంకా నీవు సాధన చేయవలెను" అంటూ బ్రహ్మదేవుడు దేవతలు అందరితోనూ అంతర్ధానము అయిపోయినాడు.

విశ్వామిత్రుడు అంతట మళ్ళీ తపస్సు చేయటము ఆరంభించినాడు. ఈ మాటు ఆయన రెండు చేతులూ పైకి ఎత్తి ఏ ఊతమూ లేకుండా నిలుచుని వాయుభక్షణము చేస్తూ వేసంగి ఎండలో నాల్గుదిక్కులా అగ్నిహోత్రాలు ఉంచుకొనీ వానాకాలములో అనాచ్ఛాదిత ప్రదేశములో ఉండీ చలికాలములో జలమధ్యములో ఉండీ మహా తీవ్రముగా తపస్సు చేయసాగినాడు. బహుకాలము గతించింది.

## ౬౪

విశ్వామిత్రుడి దారుణ తపస్సుకు దేవతలూ దేవేంద్రుడూ కలవరపడి పోయినారు. వారు సభతీరి రంభను రావించినారు.

దేవేంద్రుడు "ఓరంభా, మహత్తరము అయిన దేవకార్యము ఒకటి నీవు సాధించవలెను. నీవు ఇప్పుడే ఇక్కడినుంచి పోయి విశ్వామిత్రుణ్ణి వ్యామోహపెట్టవలెను. అతడు నిన్ను తనులుకొనేట్టు చేయవలెను" అన్నాడు.

రంభ అది తనవల్లను అయ్యే పని కాదు అని సిగ్గుపడిపోయింది. దేవేంద్రుడికి నమస్కారము చేసి "ఓ సురేశ్వరా, ఆయన మహాముని. పరమ భయంకరుడు. నేను ఏమి చేయబోయినా ఆయనకు కోపము వస్తుంది. ఘోర

ముగా శపిస్తాడు. సందేహములేదు. దేవా, నాకు భయము వేస్తూ ఉంది. నన్ను అనుగ్రహించవలెను" అంటూ గజగజ వణికి పోయింది.

"ఓ రంభా, నీవు భయపడవద్దు. నీకు శుభము అవుతుంది. నేను చెప్పినట్లు నీవు చేయవలెను. మనోహరము అయిన వసంతకాలములో నేనూ మన్మథుడూ నీవెంట వస్తాము. నేను కోకిల రూపముతో నీ సరసను ఉంటాను. నీతో మన్మథుడు నీనీడ మాదిరిగా ఉంటాడు. నీవు చక్కగా సింగారించుకొని నీశృంగార చేష్టలతో విశ్వామిత్రుడి తపస్సు చెడగొట్టవచ్చును. నీవు ఈ పని ఇట్టే చేయకలుగుతావు" అని రంభను సమాధాన పరచినాడు.

రంభ విశ్వామిత్రుణ్ణి మరులుకొల్పడానికి జగన్మోహనముగా అలంకరించుకొని చిరునవ్వులతో బయలుదేరింది. అది వసంతకాలము. చెట్లు అన్నీ పూలు పూసినవి. కోకిల మనోహరముగా కూయసాగింది. రంభ రాగము ఆలాపించింది. ఆ అప్రతిమాననాదానికి విశ్వామిత్రుడి మనస్సు ఉర్రూతలూగింది. కన్నులు తెరచి చూచినాడు. ఎదుట రంభ కనుపించింది. వెంటనే సందేహము వచ్చింది. అది అంతా దేవేంద్రుడు చేస్తున్న తంత్రము అని స్ఫురించింది. క్రోధపరవశుడు అయిపోయి "ఓ దౌర్భాగ్యురాలా, కామక్రోధాదులు జయించవలెను అనుకొంటున్న నన్ను మరులు కొల్పడానికి వచ్చినావా; నీవు శిలవుఅయిపో, బహుకాలము అట్లా శిలవు అయి పడిఉండు" అని శాపము పెట్టినాడు.

పట్టరాని కోపము వచ్చి శాపము పెట్టినందుకు విశ్వామిత్రుడు ఉత్తరక్షణములో పశ్చాత్తాపపడి పోయినాడు. అంతట ఆ రంభను చూస్తూ "ఓ రంభా మహా తేజోవంతుడూ తపోబలసమన్వితుడూ అయిన బ్రాహ్మణుడు ఒకడు నా శాపమునుంచి నిన్ను ఉద్ధరించ కలుగుతాడు." అన్నాడు.

విశ్వామిత్రుడి శాపవాక్కులు చెవులపడగానే దేవేంద్రుడూ మన్మథుడూ అక్కడనుంచి పారిపోయినారు.

రంభ అప్పటికి అప్పుడే రాయి అయిపోయింది.

కోపాన్ని జయించలేకపోయినందుకు విశ్వామిత్రుడు విచారపడిపోయినాడు. ఆకోపమువల్ల తన తపోబలము కొంత తగ్గిపోతూ ఉంది అని గమనించినాడు. అరిషడ్వర్గాన్ని జయించలేకపోయినందుకు ఖిన్నుడు అయినాడు. మనశ్శాంతిలేకుండా పోయినందుకు వ్యథపడ్డాడు.

ఎవరు ఏమిచేసినా కోపపడకూడదు అనీ ఎవరు ఏమి మాట్లాడినా మెదలకుండా ఊరకొనవలెను అనీ మనసా నిశ్చయించుకొన్నాడు. అంతే కాదు.

జితేంద్రియుడు అయ్యేటంతవరకున్నూ దేహాన్ని ఎండకట్టవలెనుఅనీ తపస్సుకు ప్రభావమే ఉంటే దేహము క్షయము అయిపోదు అనీ బ్రహ్మర్షి అయ్యేటంత వరకున్నూ అన్నముతినకుండా నీళ్ళు తాగకుండా చివరకు ఊపిరి అయినా విడవకుండా తపస్సు చేయవలెను అని సంకల్పించుకొన్నాడు.

ఓ రామా, ఈ విధముగా విశ్వామిత్రుడు అప్రతిమానముగా శపథము చేసినాడు.

## ౬౫

ఓ రాఘవా, విశ్వామిత్రుడు హిమవత్పర్వత ప్రాంతము వదిలిపెట్టి తూర్పు దిక్కుగా పోయినాడు అక్కడ నిరుపమానము అయిన మౌనవ్రతము అవలంబించినాడు. అప్రతిమానమూ పరమదుష్కరమూ మహోగ్రమూ అయిన తపస్సు చేయటము మొదలు పెట్టినాడు. కోపాన్ని దరిజేరనీయకుండా ఎన్ని విఘ్నాలువచ్చినా ఏ మాత్రమూ చలించకుండా మానుమాదిరిగా పాదుకొని పోయినాడు.

ఆవిధముగా నియమబద్ధుడు అయి ఏ అంతరాయానికీ లొంగిపోకుండా బహుకాలము తపస్సు చేసినాడు. ఆయన తపోవ్రతము సమాప్తము అయింది. అప్పుడు ఆయన భోజనము చేయబోతున్నాడు. ఇంతలో దేవేంద్రుడు బ్రాహ్మణవేషముతో వచ్చి అన్నము పెట్టమని యాచించినాడు. కిమ్మనకుండా నిస్సంకోచముగా ఆ బ్రాహ్మణుడికి సిద్ధాన్నము పెట్టినాడు. ఆ బ్రాహ్మణుడు ఆ అన్నము ఏ కొంచెమూ మిగల్చకుండా అంతా తినివేసినాడు. విశ్వామిత్రుడు ఈషణ్మాత్రమూ చలించలేదు.

విశ్వామిత్రుడు మళ్ళీ ఊపిరి బిగబట్టి మహోగ్రముగా తపస్సు చేయటము మొదలు పెట్టినాడు. చాలాకాలము గతించింది. ఆయన తపస్సు చాలించలేదు. అప్పుడు ఆయన తలలోనుంచి పొగలూ మంటలూ బయలుదేరినవి. అవి ముల్లోకాలలో వ్యాపించినవి. అంతా దగ్ధము అయిపోయేట్టుగా తోచింది. ఆయన తపోగ్నికి దేవదానవయక్షరాక్షస గరుడగంధర్వులు అందరూ నిశ్చేష్టులు అయిపోయినారు.

దేవతలు అందరూ బ్రహ్మదేవుడితో "ఓ దేవా, మేము విశ్వామిత్రుణ్ణి అనేకవిధాల ప్రలోభ పెట్టినాము. కోపము తెప్పించడానికి ఎన్నో ప్రయత్నాలు చేసినాము. ఇంకా ఏమేమో చేసినాము. ఏమి చేసినప్పటికిన్నీ ఆయన తపస్సు తరిగిపోలేదు. పయిగా అది వృద్ధిఅయింది. ఇప్పుడు ఆయనలో ఏదోషమూ

కనిపించటములేదు. అందువల్ల ఆయన మనసారా కోరుతున్న కోరికను తాము చెల్లించితీరవలెను. అట్లా చేయకపోయేట్లయితే విశ్వామిత్రుడి తపోగ్నికి ముల్లోకాలూ భస్మములయిపోతవి. ఇప్పటికే దిక్కులుఅన్నీ కలవరపడిపోయినవి. సముద్రాలు అన్నీ అల్లకల్లోలములయినవి. పర్వతాలు అన్నీ కదులుతూఉన్నవి. పృథివిఅంతా వణికిపోతూఉంది. గాలి ఎడా పెడా కొట్టుతూవుంది. సూర్య రశ్మి మందగించింది. జనులు కర్మశూన్యులు అయిపోయినారు. ఏమిచేయవలెనో ఎవరికీ తోచటములేదు. అందరికీ మౌఢ్యము వచ్చినట్టుగా ఉంది.

ఓ దేవా, విశ్వామిత్రుడు అమితతేజోవంతుడు. ఇప్పుడు అగ్నిహోత్రుడి వలె ఉన్నాడు. ఈలోకాలను అన్నిటనీ నాశనము చేయవలెను అని ఆయనకు ఇంకా బుద్ధిపుట్టలేదు. తాము ఉపేక్షించి ఊరకుండేట్లయితే ఆయన ప్రళయ కాలాగ్నివలె ముల్లోకాలనూ దహించివేస్తాడు. దేవరాజ్యము ఏలవలెను అని కూడా అనుకొంటాడు. అందువల్ల తాము ఇప్పుడు ఆయన కోర్కెను చెల్లించ టమే తరణోపాయము." అన్నారు.

అంతట బ్రహ్మదేవుడు దేవతలు అందరితోనూ విశ్వామిత్రుడు దగ్గరకు పోయినాడు. "ఓ బ్రహ్మర్షీ" అని మనోహరముగా సంబోధించి "నీకు స్వాగ తము. నీ తపస్సుకు మేము అందరమూ సంతోషించినాము. నీవు ఇప్పుడు బ్రాహ్మణుడవు అయినావు. ఓ బ్రహ్మర్షీ, నీకు నేనూ మరుద్గణాలూ దీర్ఘా యుష్యము ఇస్తున్నాము. ఇక నీవు స్వస్థచిత్తుడవు కావలెను. సుఖముగా ఉండ వలెను" అన్నాడు బ్రహ్మదేవుడు.

విశ్వామిత్రుడు సంతోషముతో బ్రహ్మదేవుడికీ మిగతా దేవతలకూ నమ స్కారము చేసి "ఓ దేవా, నాకు బ్రాహ్మణత్వమూ దీర్ఘాయుర్దాయమూ అను గ్రహించినందుకు కృతజ్ఞుడను, అయితే ఓంకారమూ వషట్కారమూ వేదాలూ నా స్వాధీనము కావడమే కాకుండా నేను వాటిని ఇతరులకు ఉపదేశము చేసే అధికారమూ తాము నాకు దయచేయవలెను.

ఓ దేవా, ఇంతకన్నా ముఖ్యము అయిన కోరిక మరిఒకటి ఉంది. వసిష్ఠ మహర్షి క్షత్రవేదవిదులలోనూ బ్రహ్మవేదవిదులలోనూ మహామహుడు. ఆయన నన్ను బ్రహ్మర్షి అనవలెను. ఇది నా ముఖ్యముఅయిన కోరిక. తాము ఈ కోరి కను నెరవేర్చి వెళ్లవలెను" అన్నాడు.

అంతట దేవతలు అందరూపోయి వసిష్ఠ మహర్షిని తీసుకొనివచ్చినారు. ఆయన విశ్వామిత్రుడితో సఖ్యపడి "బ్రహ్మదేవుడూ దేవతలూ చెప్పినట్టు నీవు బ్రహ్మర్షివేను" అన్నాడు. బ్రహ్మదేవుడు అప్పుడు మళ్ళీ "ఓవిశ్వామిత్రా నీవు

బ్రహ్మర్షివి. బ్రహ్మర్షికి ఉండే అధికారాలు అన్నీ నీకు ఉంటవి" అని చెప్పినాడు.

బ్రహ్మదేవుడూ దేవతలూ వెళ్లిపోయినారు.

విశ్వామిత్రుడు వసిష్ఠ మహర్షిని పూజించి సత్కరించి వీడ్కోలు చెప్పి పంపించినాడు. అంతట ఆయన తాపసిగా ఈ భూలోకముఅంతా తిరిగి చూచినాడు.

ఈవిధముగా బ్రాహ్మణ్యము సంపాదించిన విశ్వామిత్రుడు మహర్షులు అందరిలోనూ అగ్రగణ్యుడు. ఈలోకములోతపస్సు ఈయనరూపాన వెలసింది. ఈయన పరమధార్మికుడు. మహాపరాక్రమవంతుడు" అంటూ బ్రాహ్మణోత్తముడు శతానందుడు చెప్పి ఊరకున్నాడు.

జనకమహారాజు అంతట విశ్వామిత్ర మహర్షికి సాష్టాంగ నమస్కారము చేసి "ఓ బ్రహ్మర్షీ, తాము నా యజ్ఞానికి వచ్చినందువల్ల నేను ధన్యుణ్ణిఅయినాను. మాన్యుణ్ణి అయినాను. పవిత్రుణ్ణి అయినాను. ఓస్వామీ, తాముబ్రహ్మర్షులలో ఉత్తమోత్తములు. ఓ మహాభాగా, తమసందర్శనభాగ్యమువల్ల ఇప్పుడు నాకు అనేక సద్విషయాలు తెలిసినవి. మహత్తరము అయిన తమ తపస్సును గురించిన వివరాలు అన్నీ నేనూ ఈరామలక్ష్మణులూ ఈ సదస్యులూ ఇప్పుడు వినకలిగినాము. మహానుభావా, తమ తపస్సు అప్రమేయము. తమ బలము అప్రమేయము. తమ పరాక్రమము అప్రమేయము. తమ సద్గుణాలు అప్రమేయాలు. ఓ అప్రమేయా, మహదాశ్చర్యము కలిగించే తమ కథ ఎంతవిన్నా తనివితీర లేదు.

ఓ మహాముని. ఇప్పుడు సూర్యుడు అస్తమించబోతున్నాడు. సాయంకాలాహ్నికాలను నెరవేర్చడానికి నాకు సెలవు ఇప్పించవలెను. ఓబ్రహ్మర్షీ, రేపు ఉదయము తాము తిరిగి నాకు దర్శనము ఇప్పించవలెను. ఓ మహాత్మా తమకు ఎప్పుడూ స్వాగతమేను" అంటూ జనకమహారాజు ఉపాధ్యాయులతోనూ బంధువులతోనూ విశ్వామిత్ర మహర్షికి ప్రదక్షిణముచేసి సెలవు తీసుకొని వెళ్లిపోయినాడు.

అప్పుడు విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో తన విడిదికి పోయినాడు.

## ౬౬

తెల్లగా తెల్లవారింది. జనకమహారాజు ప్రాతఃకాలకరణీయాలను ముగించుకొని విశ్వామిత్రుణ్ణీ రామలక్ష్మణులనూ పిలిపించినాడు. శాస్త్రీయ

ముగా విశ్వామిత్రమహర్షిని అర్చించినాడు. ఉచితరీతిన రామలక్ష్మణులను సమ్మానించినాడు.

“ఓ మహామునీ, తమకు స్వాగతము. తమ అనుజ్ఞ ఏమిటి. చెప్పవలెను” అన్నాడు జనకమహారాజు.

“ఓ రాజా, ఈ రామలక్ష్మణులు దశరథమహారాజుపుత్రులు అని చెప్పినాను. ఈ వీరులు ఇద్దరూ నీ ఇంట్లోఉన్న శివధనుస్సు చూడతలచి నా వెంట వచ్చినారు. ఆ ధనుస్సు వీరికి చూపించవలెను. నీకు శుభము అవుతుంది. కృతకాములు అయి వీరు యథేష్టముగా వీరి పట్టణానికి వెళ్ళిపోతారు” అన్నాడు విశ్వామిత్రమహర్షి.

జనకమహారాజు “స్వామీ, ఆ ధనుస్సు మా ఇంట్లోకి ఎట్లా వచ్చిందీ మొదలుఅయిన విషయాలు ముందు గామనవిచేస్తాను. వినవలెను. నా పూర్వీకుడు నిమిచక్రవర్తి తరువాత ఆరోతరములో దేవరాతుడు అనే ఆయన రాజ్యము చేస్తూ ఉండేవాడు. ఆయనకు దేవతలు శివధనుస్సును నిక్షేపముగా-ఇచ్చినారు.

పూర్వము శివుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసముచేసే సమయములో దేవతల మీద కోపమువచ్చి ఈ వింటిని ఎక్కుపెట్టి “ఓ దేవతలారా, ఈ యజ్ఞములో నేను అడిగినప్పటికిన్నీ మీరు హవిర్భాగాలలో నాకు పాలుపెట్టలేదు. అందువల్ల ఇప్పుడు ఈ వింటితో మీ తలలు తెగవేస్తాను” అన్నాడు. అంతట దేవతలు అందరూ ఆయనను స్తోత్రముచేసినారు. ఆయన అంతట ప్రసన్నుడుఅయినాడు. ఆ ధనుస్సును దేవతలకు ఇచ్చివేసినాడు. ఆ దేవతలు ఆ శివధనుస్సును దేవరాతుడికి న్యాసముగా ఇచ్చినారు. అప్పటినుంచీ ఆ విల్లు మా ఇంట్లో ఉంది.

నేను ఒకప్పుడు యజ్ఞముచేయ తలపెట్టి భూమిని దున్నుతూ ఉండగా నాగటిచాలులోనుంచి ఒక స్త్రీ శిశువు లేచింది. ఆ శిశువు నాగటిచాలులో దొరికినందువల్ల నేను దానికి సీత అని పేరుపెట్టి నా స్వంతకూతురుగా పెంచుకొంటున్నాను. అది పెరిగి పెద్దదిఅయింది. అయోనిజ. కాబట్టి దానిని వీర్యవంతుడికి ఇచ్చి పెండ్లిచేయవలెను అనుకొన్నాను. అనేకమంది రాజకుమారులు సీతను వరించినారు. ఆమె వీర్యశుల్క అని నేను వారికి చెప్పినాను. ఆ వీర్యశుల్కము ఏమిటో చెప్పమని వారు అందరూ నన్ను అడిగినారు. నేను శివధనుస్సును వారికి చూపించి దానిని ఎక్కుపెటడము అన్నాను. వారు ఆ ధనుస్సును లేవనెత్తలేకపోయినారు. దానిని అటూ ఇటూ కదలించడము అయినా

వారిచేత కాలేదు. అందువల్ల వారి పరాక్రమము అల్పమేను అని నేను అనుకొని సీతను వారికి ఇవ్వడానికి ఒప్పుకోలేదు.

నేను వారి పరాక్రమాన్ని సంశయించినాను అనీ వారిని తిరస్కరించినాను అనీ వారికి అందరికీ నా మీద కోపము వచ్చింది. అంతట వారు అందరూ ఏకముఅయి మిథిలానగరాన్ని ముట్టడించినారు. ఆ ముట్టడి ఒక సంవత్సరము సాగింది. నా సైన్యసామగ్రి అంతా నాశనముఅయిపోయింది. అప్పుడు నేను చాలా దిగులుపడిపోయినాను. తపస్సుచేసి దేవతలను సంతోష పెట్టినాను. దేవతలు సంతుష్టులుఅయి నాకు చతురంగబలాలనూ అనుగ్రహించినారు. అంతట ఆ పాపకర్ములను ఆ అల్పవీర్యులను చెదరగొట్టినాను. వారు అందరూ పలాయనముఅయినారు.

ఆ పరమభాస్వరము అయిన శివధనుస్సును ఇప్పుడు తెప్పించి ఈ రామలక్ష్మణులకు చూపిస్తాను. ఓ మహామునీ, రాముడు ఆ ధనుస్సును ఎక్కు పెట్టేట్లయితే నా కూతురు సీతను ఇచ్చి పెండ్లిచేస్తాను" అన్నాడు జనకమహారాజు.

## ౬౭

జనకమహారాజు చెప్పింది అంతా విని విశ్వామిత్ర మహర్షి "ఆధనుస్సును రాముడికి ఇప్పుడే చూపించవలెను" అన్నాడు.

ఆ ధనుస్సును ఆయజ్ఞ వాటికకు పట్టుకొని రావలసింది అని జనకమహారాజు మంత్రులను ఆజ్ఞాపించినాడు. వారు అంతట మిథిలానగరములోకి పోయి ఆ ధనుస్సును దాచి ఉంచిన ఎనిమిది చక్రాల ఇనుప భోషాణాన్ని బయటికి లాగించడానికి ప్రయత్నము చేసినారు. ఒడ్డూ పొడుగూ ఉన్న బలాఢ్యులను అనేక మందిని పిలిపించినారు. వారు అందరూ ఆ మందసాన్ని ఎట్లాగో బయటికి లాగి అతికష్టము మీద అక్కడ నుంచి జనకమహారాజు దగ్గరకు తీసుకొనిపోయి "రాజులు అందరూ పూజించే దివ్య ధనుస్సును తీసుకొని వచ్చినాము" అని చెప్పినారు.

అప్పుడు జనకమహారాజు" బ్రహ్మర్షీ, మావంశీయులున్నూ ఇంకా ఇతర రాజులున్నూ ఈ ధనుస్సును పూజిస్తూ వచ్చినారు. సురాసురులు కానీ యక్షరాక్షసగరుడ గంధర్వకిన్నర మహోరగులు కానీ దీనిని ఎక్కుపెట్టలేక పోయినారు. ఈ వింటిని వంచినవారు కానీ దీనికి అల్లెత్రాడు నెక్కించిన వారు కానీ దీనిలో బాణము కూర్చినవారు కానీ కూర్చిన బాణాన్ని వదలడానికి అల్లెత్రాటిని లాగినవారు కానీ దీనిభారాన్ని పరీక్షించినవారు కానీ ఇంతవరకూ

ఎవరూ లేరు. శివదేవుడి ధనుస్సు ఇప్పుడు తమ ఎదుట ఉంది. తామే దానిని రామలక్ష్మణులకు చూపించ వలెను" అన్నాడు.

విశ్వామిత్ర మహర్షి "నాయనా, రామా, ఆ విల్లు ఏమిటో చూడు" అన్నాడు.

ఆ బ్రహ్మర్షి, ఆజ్ఞను శిరసావహించి రాముడు ఆ ఇనుపమందసము మూత తెరచినాడు. గంధమాల్యాదులతో అలంకరించి ఉన్న ఆ శివధనుస్సును చూచినాడు.

"బ్రహ్మర్షీ, ఈ వింటిని నా చేతితో లేవనెత్తుతాను. దీనిభారాన్ని పరీక్షచేసి ఎక్కుపెట్టవలెను అనుకొంటున్నాను" అని విశ్వామిత్ర మహర్షితో రాముడు అన్నాడు.

"మంచిది,మంచిది" అని విశ్వామిత్ర మహర్షీ జనకమహారాజూ అన్నారు.

రాముడు ఆ వింటినడుము చేతితో పట్టుకొని అవలీలగా లేవనెత్తినాడు. ఆ యజ్ఞానికి వచ్చిన మహర్షులూ రాజరాజులు వేలకొద్దీమహాజనులూ నివ్వెరపోయినారు. రాముడు ఆ వింటికి ఇట్టే అల్లె త్రాడు ఎక్కించినాడు. అప్రయత్నముగా బాణము కూర్చినాడు. ఆబాణము వదలడానికి అల్లె తాటని ఆకర్ణాంతమూ లాగినాడు.

ఆ ధనుస్సు అంతట ఫెళ్లున విరిగిపోయింది.

పిడుగుపడ్డంత చప్పుడు అయింది. పర్వతాలు అన్నీ బ్రద్దలు అయిపోతున్నవా అనిపించింది. భూమి అంతా కంపిస్తూఉన్నట్టుగా తోచింది. అందరూ నేలమీద కూలినారు. ఆ మహాధ్వనికి విశ్వామిత్ర మహర్షీ జనకమహారాజూ రామలక్ష్మణులూ తప్ప తక్కినవారు అందరూ మూర్ఛపోయినారు. కొంతసేపటికి తెప్పరిల్లినారు.

అప్పుడు జనకమహారాజు విశ్వామిత్ర మహర్షినిచూచి "మహానుభావా, ఈజగత్తులో రాముడు ఒక్కడే వీర్యవంతుడు. ఈతడు ఈ విలును వంచగలడు అని నేను ఊహించలేదు. ఇంతటి శక్తిమంతుడు ఈలోకములో ఉన్నాడు అని నేను అనుకోలేదు. అంతా అత్యద్భుతముగా ఉంది. ఇక నా కూతురు సీతను రాముడికి ఇచ్చి పెండ్లి చేస్తాను. సీత నా వంశానికి కీర్తి తీసుకొని వస్తుంది.

ఓ మహర్షీ, పరాక్రమమే సీతకు ఓలి అని నేను ప్రతిజ్ఞ చేసినాను. ఇప్పుడు నా ప్రతిజ్ఞ నెరవేరింది. నాకు నా ప్రాణాలకన్నా ఎక్కువ అయింది సీత. రాముడికి ఇచ్చి పెండ్లిచేస్తాను."

"బ్రాహ్మణోత్తమా, దశరథ మహారాజు అనుమతి కోసము నా మంత్రు లను అయోధ్యాపట్టణానికి ఇప్పుడే పంపిస్తాను. రామలక్ష్మణులు తమ వెంట ఇక్కడికి రావడమూ శివధనుస్సును రాముడు విరిచివేయడమూ నేను సీతను రాముడికి ఇచ్చి వివాహము చేయ నిశ్చయించటమూ మొదలుఅయిన వృత్తాంతమూ అంతా నా మంత్రులు దశరథమహారాజుకు విన్నవించి ఆయనను సంతోషపెట్టి సపరివారముగా ఇక్కడకు తోడ్కొని వచ్చేటట్టు చేస్తాను. ఇందుకు తాము అనుమతించవలెను" అన్నాడు జనక మహారాజు.

"అట్లాగే చేయవలెను" అని విశ్వామిత్ర మహర్షి అన్నాడు.

అంతట జనకమహారాజుమంత్రులు అయోధ్యాపట్టణానికి ప్రయాణము అయినారు.

## ౬౮

జనకమహారాజు మంత్రులు గుర్రాలు అలసిపోయేటట్టుగా మూడు అహో రాత్రములు ప్రయాణముచేసి నాల్గవనాడు ఉదయము అయోధ్యానగరము చేరి నారు. రాజభవనము దగ్గరకుపోయి ద్వారపాలకులను చూచి తమ రాక దశరథ మహారాజుకు విన్నవించమన్నారు.

జనకమహారాజు మంత్రులు రాజానుమతితో రాజగృహములోకి పోయి నారు. వృద్ధుడు అయినప్పటికీన్నీ దేవతుల్యుడుగా తేజరిల్లుతూ ఉన్న దశరథ మహారాజును చూచినారు ఆయన ప్రసన్నవదనము చూడగానే వారికి నిజంగా లేకుండాపోయింది. పవిత్రహృదయాలతో నమస్కారముచేసి "మహారాజా, మేము మిథిలాధిపతి జనకమహారాజు దూతలము. మా మహారాజు స్నేహపూర్వ కముగా తమ కుశలమూ తమ ఉపాధ్యాయుల కుశలమూ అడిగి తెలుసుకో మన్నారు. ఇంకా తమ అగ్నిహోత్రాదులు నిరంతరాయముగా సాగుతూ ఉన్న విషయమూ తెలుసుకోమన్నారు" అని చెప్పినారు.

కుశలప్రశ్నలు అయిపోయిన తరువాత జనకమహారాజు మంత్రులు మళ్లీ "ఓ రాజా, తమకు మేము ఒక విషయము విన్నవించడానికి విశ్వామిత్ర మహర్షి అనుమతితోనూ శతానందోపాధ్యాయులవారి సమ్మతితోనూ మా మహారాజు మమ్ములను తమవద్దకు పంపించినాడు.

మా మహారాజు తన కూతురు సీతాదేవికి పరాక్రమమే ఓలి అని ప్రతిజ్ఞ చేయడమూ అనేక మంది రాజకుమారులు వచ్చి నిర్వీర్యులు అయి విఫలులు అయిపోవటమూ తమకు తెలిసిన విషయమే అయి ఉండవచ్చును. తమ పుత్రులు

రామలక్ష్మణులు విశ్వామిత్ర మహర్షి వెంట దైవికముగా మా రాజధాని నగరానికి మా మహారాజు చేస్తూ ఉన్న యజ్ఞము చూడవచ్చినారు. తమ పెద్ద కుమారుడు రాముడు మహావీరుడు. సీతాదేవికి వీర్యశుల్కము ఇచ్చినాడు.

ఓ రాజా, మహర్షులూ రాజర్షులూ రాజరాజులూ చూస్తూ ఉండగా మహాపరాక్రమవంతుడు రాముడు శివధనుస్సు మధ్యభాగము పట్టుకొని లేవనెత్తి ఎక్కుపెట్టినాడు. అది అంతట విరిగి పోయింది. సీతాదేవికి పరాక్రమమే ఓలి అయినందువల్ల రాముడికి సీతాదేవిని ఇచ్చి పెండ్లి చేయడానికి మా మహారాజు నిశ్చయించినాడు. అందుకు తాము అనుమతించి తమ ఉపాధ్యాయులతోనూ పురోహితులతోనూ బంధుమిత్రులతోనూ సపరివారముగా మా మిథిలానగరానికి రావలెను. రాజా, తమ దర్శనము చేసి మా మహారాజు తన కూతురు సీతాదేవి వివాహము చేయతలచినాడు. తమకు ఈ విషయము మనవి చేయడానికి మమ్ములను మా జనక మహారాజు పంపించినాడు” అని చెప్పి ఊరకున్నారు.

దశరథమహారాజు చాలా సంతోషించినాడు. ఆలోచించినాడు. మనసా నిశ్చయించుకొన్నాడు. అంతట వసిష్ఠమహర్షినీ వామదేవుణ్ణీ చూచి “ఓ బ్రాహ్మణోత్తములారా, ఈ దూతలు చెప్పింది మీకు ఇష్టము అయినట్లయితే మనము అందరమూ మిథిలానగరానికి తరలిపోదాము. ఆలస్యము వద్దు” అన్నాడు.

మహర్షులూ మంత్రులూ ఆలోచించి “బాగుంది” అని చెప్పినారు.

అంతట దశరథమహారాజు మరునాడే ప్రయాణము అన్నాడు.

జనకమహారాజు మంత్రులను అందరినీ దశరథమహారాజు చక్కగా సత్కరించినాడు. వారు ఆరాత్రి సంతోషముగా అక్కడ ఉండిపోయినారు.

౬౯

తెల్లవారగానే దశరథమహారాజు ఋత్విజులూ బంధువులూ మంత్రులూ మొదలుఅయినవారిని అందరినీ పిలిపించినాడు.

సుమంత్రుణ్ణి చూచి సంతోషముతో “మంత్రిసత్తమా, జనకమహారాజు దూతలు నన్ను తొందరపెట్టుతున్నారు. ప్రయాణసన్నాహము అంతా నీవు చేయవలెను. ముందుగా ధనాధ్యక్షులు నానావిధ రత్నాలనూ పుష్కలముగా ధనాన్నీ తీసుకొని సురక్షితముగా ప్రయాణము అయిపోవలెను.

ఆతరువాత మనము అందరమూ తరలిపోయే ఏర్పాట్లు చేయవలెను” అని చెప్పినాడు.

వసిష్ఠమహర్షీ వామదేవుడూ జాబాలీ దీర్ఘాయుష్మంతుడు అయిన మార్కండేయుడూ కాత్యాయనుడూ ఇంకా తక్కిన బ్రాహ్మణోత్తములూ ముందు బయలుదేరినారు. వారి వెనుక రథముమీద దశరథమహారాజా. ఆయా వాహనాలతో ఆయన పరివారమూ చతురంగసేనలూ నడిచినవి.

వారు అందరూ నాలుగు పగళ్లు ప్రయాణముచేసి విదేహ రాజ్యము చేరినారు.

దశరథమహారాజు వస్తూ ఉన్నాడు అని జనకమహారాజుకు వర్తమానము వచ్చింది. ఆయనను సత్కరించి తీసుకొనిపోవడానికి ఎదురుగుండా జనకమహారాజు వచ్చినాడు. దశరథ మహారాజును పరివారసహితముగా చూచి సంతోషించినాడు. వారిని వెంటపెట్టుకొని తన యజ్ఞవాటికకు పోయినాడు. వారిని అందరినీ యథోచితముగా సత్కరించినాడు.

దశరథమహారాజు కూర్చున్న తరువాత "ఓ రాజా, స్వాగతము. నాభాగ్యవశమువల్ల తాము ఇక్కడికి వచ్చినారు. తమ పుత్రుని పరాక్రమ విజయానికి తాము మనసారా సంతోషించవలెను. వసిష్ఠమహర్షి ఇంతమంది బ్రాహ్మణులను వెంటపెట్టుకొని తమతో రావడము నాపూర్వపుణ్యము."

"రాజా, మహాపరాక్రమవంతులు పుట్టిన రఘువంశమువారితో ఇప్పుడు వియ్యము అందబోతున్నాను. ఇప్పుడు నావంశము మరింత పూజనీయము కాబోతున్నది. ఇది అంతా నా పుణ్యపరిపాకము అనుకొంటున్నాను."

"రాజా, రేపటితో నాయజ్ఞము సమాప్తముఅయిపోతుంది. అంతట మహర్షుల సమ్మతితో సీతారాముల వివాహము చేయతలచినాను" అన్నాడు.

దశరథ మహారాజు చిరునవ్వుతో "రాజా తాము దాతలు. దానము దాతవశము అని పెద్దలు చెప్పగా విన్నాను. అందువల్ల తాము ఎప్పుడు ఏది ఇస్తాము అంటే అప్పుడు అది పుచ్చుకోడమే మా పని" అన్నాడు.

దశరథ మహారాజు ఇంత చక్కగా అన్నందుకు జనకమహారాజు ఉప్పొంగిపోయినాడు.

పెండ్లికి వచ్చిన మహర్షులు అందరూ ఆ రాత్రి అక్కడ సుఖముగా గడిపినారు.

దశరథమహారాజు పుత్రులతో ముచ్చటలు ఆడుతూ ఆ రాత్రి పొద్దుపుచ్చినాడు.

జనకమహారాజు వివాహ ప్రయత్నములో నిమగ్నుడు అయినాడు.

## ౨౦

దశరథ మహారాజు మిథిలానగరము చేరిన మరునాడు జనకమహారాజు మహర్షుల సాయముతో యజ్ఞకర్మను ముగించివేసినాడు. అంతట శతానందుణ్ణి చూచి "స్వామీ, నా తమ్ముడు కుశధ్వజుడు ఇప్పుడు ఇక్కడ లేడు. ఈయజ్ఞానికి సామగ్రులు పంపించి తోడుపడినాడు. ఈ జరుగబోయే పెండ్లి వేడుకలో వాడూ పాల్గొనవలెను. వాడూ నాతోపాటు సంతోషించవలెను. కాబట్టి తాము వాణ్ణి నా తమ్ముణ్ణి వెంటనే ఇక్కడికి పిలిపించవలెను." అని చెప్పినాడు.

ఉపేంద్రుడికోసము దేవతలు పోయినట్టుగా కుశధ్వజుడికోసము జనక మహారాజుదూతలు అమిత వేగముతో పరుగెత్తేగుర్రాలు ఎక్కిపోయినారు. సాంకాశ్యపట్టణము చేరినారు. కుశధ్వజ మహారాజుకు మిథిలానగరవృత్తాంతము అంతా తెలియజెప్పినారు. ఆయన సపరివారముగా మిథిలానగరానికి బయలుదేరినాడు.

ధర్మవత్సలుడూ మహాత్ముడూ జ్యేష్ఠుడూఅయిన జనకమహారాజుకున్నూ శతానందోపాధ్యాయులకున్నూ కుశధ్వజుడు నమస్కారము చేసినాడు. అన్నగారి సరసను కూర్చున్నాడు. అన్నతమ్ములు ఇద్దరూ ఆలోచన చేసినారు. అంతట మంత్రిశ్రేష్ఠుడు అయిన సుదామున్ణి చూచి జనకమహారాజు "మంత్రిపతి, నీవు వెంటనే వెళ్లి దశరథమహారాజును మంత్రులతోనూ పురోహితులతోనూ పుత్రమిత్ర బంధువులతోనూ పరివారముతోనూ ఆహ్వానించి ఇక్కడికి తీసుకొని రావలెను" అన్నాడు.

సుదాముడు విడిదికి వెళ్లినాడు. దశరథమహారాజును చూచినాడు. జనకమహారాజు ఆహ్వానము తెలియచేసినాడు.

దశరథమహారాజు పుత్రులతోనూ మహర్షులతోనూ బంధుమిత్ర పరివారముతోనూ బయలుదేరినాడు. జనకమహారాజు సభకు పోయినాడు. అంతట "ఓ రాజర్షీ, వసిష్ఠమహర్షి మా ఇక్ష్వాకువంశీయుల ఇలవేల్పు. మాపరమగురువు. సమస్త విషయాలకూ ఆయనే మా వక్త. ఆమహానుభావుడు ఇప్పుడు విశ్వామిత్ర మహర్షి అనుమతితో మా వంశక్రమాన్ని గురించి చెప్పుతాడు" అన్నాడు. దశరథమహారాజు.

అప్పుడు ఆ మహాసభలో వసిష్ఠ మహర్షి లేచి ఈవిధముగా చెప్పినాడు.

బ్రహ్మ అవ్యక్త ప్రభవుడు. శాశ్వతుడు. నిత్యుడు. అవ్యయుడు. ఆ బ్రహ్మదేవుడు మనసా సంకల్పించినాడు. అంతట ఈ భూలోకములో మరీచి

అనేవాడు జన్మించినాడు. ఆ మరీచికి కాశ్యపుడున్నూ కాశ్యపుడికి సూర్యుడున్నూ సూర్యుడికి మనువున్నూ పుట్టినారు.

ఆ మనువుకు వైవస్వత మనువు అనే ఆయన పుట్టినాడు. ఆయనే ప్రజాపాలన చేసి ప్రజాపతి అయినాడు. ఆ వైవస్వతమనువుకు ఇక్ష్వాకువు పుట్టినాడు. ఆ ఇక్ష్వాకువే మొట్టమొదట అయోధ్యారాజ్యపాలనము చేసినాడు.

ఆ ఇక్ష్వాకువుకు కుక్షియున్నూ కుక్షికి వికుక్షియున్నూ వికుక్షికి అమిత తేజోవంతుడూ అమిత పరాక్రమవంతుడూ అయిన బాణుడున్నూ బాణుడికి అనరణ్యుడున్నూ అనరణ్యుడికి పృథువున్నూ పృథువుకు త్రిశంకువున్నూ త్రిశంకువుకు ధుంధుమారుడున్నూ ధుంధుమారుడికి యువనాశ్వుడున్నూ యువనాశ్వుడికి మాంధాతయున్నూ మాంధాతకు సుసంధియున్నూ సుసంధికి ధ్రువసంధీ ప్రసేనజిత్ అనే ఇద్దరు పుత్రులున్నూ పుట్టినారు.

ధ్రువసంధికి మహాయశస్వి అయిన భరతుడు పుట్టినాడు. భరతుడికి అసితుడు పుట్టినాడు. ఆ అసితుడిమీదకు హైహయులూ తాలజంఘులూ శశిబిందువులూ దండయాత్రకు వచ్చినారు. అసితుడు ఓడిపోయినాడు. ఇద్దరు భార్యలతోనూ హిమవత్పర్వతానికి పలాయనము అయినాడు. అక్కడ భృగుప్రస్రవణము అనే మనోహరము అయిన ప్రదేశములో నివాసము పెట్టుకొన్నాడు. కాని కొద్దిరోజులకే ఆ అసితుడు కాలధర్మము చెందినాడు.

అసితుడు చనిపోయేనాటికి ఆయన ఇద్దరు ఇల్లాండ్లూ గర్భవతులు. పట్టపురాణి గర్భాన్ని అసితుడి చిన్న పెండ్లాము చెడగొట్టటానికి సంకల్పించుకొన్నది. సవతికి ఆమె ఒక భక్ష్యము ఇచ్చింది. పట్టపురాణి ఆ భక్ష్యము తిన్నది. తిన్న తరువాత ఆ భక్ష్యములో గరళము పెట్టింది అని తెలుసుకొన్నది. తన గర్భము ఏమి అయిపోతుందోనని దిగులుపడ్డది. ఆమెకు ఏమీతోచలేదు. ఎట్లాగుఅయినా తన గర్భము పోగూడదు అనుకొన్నది. ఆ ప్రాంతములో ఆ కాలములో నివసిస్తూ ఉన్న భృగువంశీయుడు చ్యవనమహర్షి దగ్గరకుపోయింది. ఆయన దర్శనముచేసి స్తోత్రము చేసి నమస్కరించి మెప్పించింది. ఆ చ్యవనమహర్షి "ఓపూజ్యురాలా, భయపడవద్దు. ఇప్పుడు నీగర్భములో అమిత బలవంతుడూ మహాతేజోవంతుడూ పరమపరాక్రమవంతుడూ శ్రీమంతుడూ అయిన శిశువు ఉన్నాడు. వాడు దీర్ఘాయుష్మంతుడు అవుతాడు. నీవు విషము తిన్నాను అని భయపడవద్దు. దేహములో విషము జీర్ణము అయిపోయిన పుత్రుడే పుట్టుతాడు. నీవు త్వరలో సుఖముగా ప్రసవిస్తావు" అని చెప్పినాడు.

ఆమె శ్రద్ధా భక్తులతో ఆ చ్యవనమహర్షికి మొక్కి వెళ్ళిపోయింది. భర్త వియోగశోకాన్ని అంతట మరచిపోయింది. సుఖముగా ప్రసవించింది. పుత్రుడు పుట్టినాడు. ఆమె గరళము తిన్నా పుట్టినందువల్ల ఆపిల్లవాడు సగరుడు అయినాడు. ఆ సగరుడు అయోధ్యారాజ్యానికి చక్రవర్తి అయినాడు.

ఆ సగర చక్రవర్తికి అసమంజుడున్నూ అసమంజుడికి అంశుమంతుడున్నూ అంశుమంతుడికి దిలీపుడున్నూ దిలీపుడికి భగీరథుడున్నూ భగీరథుడికి కకుత్స్థుడున్నూ కకుత్స్థుడికి రఘువున్నూ రఘువుకు ప్రవృద్ధుడున్నూ పుట్టినారు. ఆ ప్రవృద్ధుడే పురుషాదుడూ కల్మాషపాదుడూ అయినాడు. ఆయనకు సుదర్శనుడున్నూ సుదర్శనుడికి అగ్నివర్ణుడూ అగ్నివర్ణుడికి శీఘ్రగుడున్నూ శీఘ్రగుడికి మరువున్నూ మరువుకి ప్రశుశ్రుకుడున్నూ ప్రశుశ్రుకుడికి నహుషుడున్నూ నహుషుడికి నాభాగుడున్నూ నాభాగుడికి అజుడున్నూ పుట్టినారు.

అజమహారాజుకు ఈ దశరథమహారాజు పుట్టినాడు. ఈయనకు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు అనే నల్గురు పుత్రులు పుట్టినారు. శివధనుస్సు ఎత్తి వంచిన రాముడు ఈయన జ్యేష్ఠ పుత్రుడు.

ఓ రాజా, వీరిది పరమ పరిశుద్ధము అయిన వంశము. ఈ వంశీయులు అందరూ పరమ ధార్మికులు. వీరాగ్రేసరులు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నల్గురూ కులదీపకులు. ఓ జనకమహారాజా, నీకూతుళ్లు ఇద్దరూ ఈయన ఇద్దరు కొడుకులకూ ఈడూజోడుగా ఉన్నారు కనుక రామలక్ష్మణులకు నీకూతుళ్లను ఇద్దరినీ ఇచ్చి పెండ్లి చేయవలసింది. నీవు వీరితో సంబంధము చేయటము ఎంతో మంచిది."

ఈ విధముగా వసిష్ఠమహర్షి చెప్పి ఊరకున్నాడు.

## ౭౧

ఇక్ష్వాకు వంశకర్తలను గురించి వసిష్ఠమహర్షి చెప్పిన తరువాత జనకమహారాజు ఈ విధముగా చెప్పసాగినాడు.

ఓ బ్రహ్మర్షీ కులీనుడు కన్యాదానము చేయతలపెట్టినప్పుడు తనవంశాన్ని గురించి నిరవశేషముగా చెప్పుకోవలెనుకదా. కనుక మా జనక రాజుల వంశాన్ని గురించి నేను చెప్పుతాను. వినవలెను.

పూర్వము నిమి అనే చక్రవర్తి పరమధార్మికుడు అనీ మహాబలవంతుడు అనీ ప్రసిద్ధి కెక్కినాడు. అనేక సత్కర్మలు చేసినాడు. ఆయనకు మిథి అనే పుత్రుడు పుట్టినాడు. ఆ మిథే ఈ మిథిలానగరాన్ని నిర్మించినాడు. ఆయనే ప్రథమ జనకమహారాజు అయినాడు. ఆ మిథికి ఉదావసువు పుట్టినాడు. ఉదావసువుకు నందివర్ధనుడూ నందివర్ధనుడికి సుకేతువూ సుకేతువుకు దేవరాతుడూ

పుట్టినారు. దేవరాతుడు మహాబలవంతుడు అనీ ధర్మాత్ముడు అనీ రాజర్షి అనీ ప్రసిద్ధి కెక్కినాడు. ఆ దేవరాతుడికి బృహద్రథుడూ బృహద్రథుడికి మహావీరుడూ పుట్టినారు. మహావీరుడు నిజముగా మహావీరుడు. ఆమహావీరుడికి సుధృతీ సుధృతికి ధైర్యవంతుడూ బీరుపోని పరాక్రమవంతుడూ అయిన ధృష్టకేతువు పుట్టినాడు. ధృష్టకేతువు సుధార్మికుడుగానూ రాజర్షిగానూ ఘనత కెక్కినాడు. ధృష్టకేతువుకు హర్యశ్వుడూ హర్యశ్వుడికి మరువూ మరువుకు ప్రతింధకుడూ ప్రతింధకుడికి కీర్తిరథుడూ కీర్తిరథుడికి దేవమీఢుడూ దేవమీఢుడికి విబుధుడూ విబుధుడికి మహాధ్రకుడూ మహాధ్రకుడికి కీర్తిరాతుడూ పుట్టినారు. కీర్తిరాతుడు మహాబలవంతుడు. రాజర్షి. ఆయనకు మహారోముడూ మహారోముడికి స్వర్ణరోముడూ స్వర్ణరోముడికి హ్రస్వరోముడూ పుట్టినారు.

హ్రస్వరోముడు మహాత్ముడు. ధర్మాత్ముడు. ఆయన మాతండ్రి. నేను జ్యేష్ఠుణ్ణి. నాకు వయస్సురాగానే నా తమ్ముడు కుశధ్వజుణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసే భారము నామీద వేసి మాతండ్రి నాకు పట్టము కట్టి తపోవనానికి వెళ్లిపోయినాడు. వృద్ధాప్యమువల్ల అచిరకాలములోనే స్వర్గతుడు అయినాడు.

నాతమ్ముడు కుశధ్వజుడు దేవసమానుడు. వాణ్ణి నేను స్నేహాతిశయముతో పెంచి పెద్దవాణ్ణి చేసినాను. ధర్మమార్గాన రాజ్యపాలనము చేయసాగినాను. కాలము గతించింది. సాంకాశ్యపట్టణము ఏలే సుధన్వుడు అనే రాజు ఈ మిధిలానగరాన్ని ముట్టడించినాడు. నా ఇంట్లో ఉన్న శివధనుస్సునూ నాకూతురు సీతనూ తనకు ఇవ్వమని రాయబారము పంపించినాడు. అందుకు నేను నిరాకరించినాను. అప్పుడు మాకు యుద్ధము అయింది. ఆ యుద్ధములో నేను సుధన్వుణ్ణి హతమార్చినాను.

సాంకాశ్య పట్టణములో నా తమ్ముడికి రాజ్యాభిషేకముచేసి ఆరాజ్యము వాడికి ఒప్పగించినాను. ఆ సాంకాశ్యపట్టణము ఇక్షుమతీ నదీతీరాన ఉసిరిక చెట్ల మధ్య శోభాయమానముగా స్వర్గధామమువలె ఉంది. అది దూరానికి పుష్పకవిమానమువలె కనపడుతుంది.

నా తమ్ముడు కుశధ్వజుడు పరమ ధార్మికుడు. తేజోవంతుడు. ఆసాంకాశ్యపట్టణములో ఇప్పుడు నివసిస్తున్నాడు. ఇప్పుడు ఈవేడుకలో నాతోపాటు పాల్గొనడానికి వాణ్ణి ఇప్పుడు ఇక్కడికి రావించినాను. ఇదుగో ఈ చిన్నవాడే నా తమ్ముడు కుశధ్వజుడు.

ఓ బ్రహ్మర్షీ, నా ఇద్దరు కూతుళ్ళనూ తాము దశరథమహారాజు ఇద్దరు కొమాళ్లకూ ఇవ్వవలెను అని చెప్పినారు. సంతోషముగా మేము అన్నతమ్ములము

ఇద్దరమూ ఒప్పుకొంటున్నాము. సీత దేవకన్య. అది వీర్య శుల్క. దానిని రామునికి ఇచ్చి వివాహము చేయవలెను అనేది ఇదివరకే నిశ్చయము అయిపోయింది. నా రెండవకూతురు ఊర్మిళను లక్ష్మణునికి ఇచ్చి వివాహము చేయవలెను అని తాము సెలవు ఇచ్చినారు. అందుకు మేము అన్నతమ్ములము త్రికరణశుద్ధిగా ఒప్పుకొంటున్నాము.

ఓ దశరథమహారాజా; తాము ఇప్పుడు రామలక్ష్మణులకు సమావర్తనము చేయించవలెను. వారి వివాహాలకు నాందికార్యాదులను జరిపించవలెను. ఈ నాడు మఘానక్షత్రము. ఎల్లుండి ఉత్తర ఫల్గునీ నక్షత్రములో అన్నతమ్ములకు ఇద్దరికీ వివాహము చేయటము బాగుంటుంది అనుకొంటున్నాను. ఓ రాజా, సమస్త సత్ఫలాలూ ఇచ్చే గోదానము తాము ఇప్పుడు రామునిచేత చేయించ కోరుతున్నాను."

జనకమహారాజు మహాజనసభా మధ్యములో ఈ విధముగా చెప్పి ఊరకున్నాడు.

## ౭౨

విశ్వామిత్రమహర్షి వసిష్ఠమహర్షి ఆలోచించినారు. ఉభయులూ కూడ బలుకుకొన్న తరువాత విశ్వామిత్ర మహర్షి జనకమహారాజును చూచి ఈ విధముగా చెప్పినాడు.

"రాజా, ఇక్ష్వాకు విదేహ వంశాలు రెండూ ఎవరూ ఊహించ నలవి కాని అంతదొడ్డవి. మీ వంశాల గొప్పతనాన్ని ఎవరూ ఇంత అంత అని నిర్ణయించలేరు. మీ వంశాలతో సరిసమానము అయినవి మాకు ఈ జగత్తులో ఎక్కడనూ కనిపించలేదు. ఇప్పుడు మీ రెండు వంశాలవారికిన్నీ వివాహరూపము అయిన ధర్మసంబంధము ఏర్పడుతున్నది. ఇది ఎంతో సమంజసముగా ఉంది. వధూవరులు సరిసమానము అయిన రూపసులు, రాముడికి సీత, లక్ష్మణుడికి ఊర్మిళ చక్కగా తగిపోయినారు."

"నేనూ వసిష్ఠమహర్షులూ ఆలోచించిన విషయము చెప్పుతున్నాను, వినవలెను. మీరు అన్నతమ్ములు ఇద్దరూ మా మాటను పాటించవలెను. ఓ జనకమహారాజా, మీ తమ్ముడు కుశధ్వజుడు ధర్మజ్ఞుడు. ఆయన కూడా దశరథమహారాజుతో సంబంధము చేయటము ఉచితము. మీ తమ్ముడి అసమాన సుందరపుత్రికలను ఇద్దరినీ మేము భరతశత్రుఘ్నులకు వరిస్తున్నాము. భరతుడు మహాబుద్ధిమంతుడు. శత్రుఘ్నుడు అమితపరాక్రమవంతుడు. దశరథమహారాజు నల్గురు కొడుకులూ సరిసమానము అయిన రూపయౌవనులు. సద్గుణసంపన్నులు.

ఇక్ష్వాకు కులవంటివారు. దేవతుల్య పరాక్రములు. మీ ఉభయ వంశాలవారూ పుణ్యకర్ములు. ఇప్పుడు మీ రెండు వంశాలవారూ వియ్యము అంది చుట్టరికముతో కట్టుబడి పోవలెను. ఇది మా కోరిక.

విశ్వామిత్రమహర్షి చెప్పిన ఈవిషయము జనకమహారాజూ కుశధ్వజుడూ ఆలోచించినారు. జనకమహారాజు మహర్షులు ఇద్దరికీ నమస్కారము చేసి "మహర్షులారా, మేము ఎంతో పుణ్యము చేసుకొన్నాము. అందువల్లనే మేము అన్నతమ్ములము ఇద్దరమూ ఇక్ష్వాకులతో సంబంధము చెయవలెను అని తమ అంతట తాము ఆజ్ఞాపిస్తున్నారు. తమ ఆజ్ఞను మేము శిరసావహిస్తున్నాము. భరతశత్రుఘ్నులకు నా తమ్ముడి కూతుళ్లను ఇద్దరినీ ఇచ్చి వివాహము చేస్తాము. నాలుగు పెండ్లిళ్ళూ ఒక్కనాడే ఒక్క ముహూర్తములోనే జరగవలెను. ఉత్తరాఫల్గునీనక్షత్రానికి భగుడు అధిష్ఠానదేవత. ఆ నక్షత్రాన పగటివేళ వివాహము ప్రశస్తము అని పెద్దలు చెప్పినారు" అంటూ విశ్వామిత్రవసిష్ఠులకు అభిముఖముగా నిలుచుని నమస్కారము చేసి "మహర్షులారా, తాము ఉభయులూ కన్యాదానరూపాన పరమధర్మము మాకు ప్రాప్తము అయ్యేట్లు చేసినారు. ఇది వరకే దశరథమహారాజు తమకు ప్రియశిష్యుడు. ఇప్పుడు మేము అన్నతమ్ములము ఇద్దరమూ తమ శిష్యులము. ఇక మేము ముగ్గురమూ తమ అధీనులము. మా చేత చేయించవలసింది అంతా చేయించే భారము తమది" అన్నాడు.

జనకమహారాజు ఈ విధముగా చెప్పగా విశ్వామిత్రవసిష్ఠులూ దశరథమహారాజూ ఎంతో సంతోషించినారు. అంతట దశరథమహారాజు "ఓ మిథిలాధిపతి మీ అన్నతమ్ముల సద్గుణాలు లెక్కవేయ నలవికాదు. మీ ఉభయుల గొప్పతనాన్ని వర్ణించడము నా చేత కాదు. ఇంతమంది మహర్షులనూ ఇంతమంది రాజపుంగవులనూ ఇంతమంది మహాజనులనూ మీరు కొబట్టి సత్కరించకలిగినారు. మీరు సుఖముగా ఉండవలెను. ఇప్పుడు నేను విడిదికి పోతున్నాను. నాంది సమావర్తనకర్మలను యథావిధిగా పూర్తిచేయిస్తాను" అంటూ జనకమహారాజుకూ కుశధ్వజుడికీ వీడ్కోలు చెప్పి వసిష్ఠ విశ్వామిత్రులతో తన విడిదికి వెళ్లిపోయినాడు.

దశరథమహారాజు నాంది కార్యాదులను శాస్త్రవిహితముగా చేయించినాడు. మరునాడు ఉదయము దశరథమహారాజు నలుగురు కొమాళ్లచేతనూ సమావర్తనకర్మ చేయించినాడు. నాలుగు లక్షల తరిపి ఆవులను లేగదూడలతో కూడా తెప్పించి, వాటి కొమ్ములకు బంగారు తొడుగులు వేయించినాడు. పాలు పిండుకొనడానికి చక్కని కంచుచెంబులను సమకూర్చినాడు.

కొడుకులకోసము ఆ నాల్గు లక్షల ఆవులనూ అట్లా బ్రాహ్మణులకు దానము ఇచ్చినాడు.

అప్పుడు దశరథమహారాజు నల్గురుదిక్పాలకుల మధ్యనూ ప్రసన్న రూపముతో తేజరిల్లే బ్రహ్మదేవుడికి మల్లె నల్గురి కొడుకుల మధ్యనూ విరాజిల్లినాడు.

## 23

దశరథమహారాజు గోదానము చేస్తూఉన్నాడు. అప్పుడు అక్కడికి యుధాజిత్ వచ్చినాడు. ఆ శూరుడు కేకయరాజు పుత్రుడు. భరతుడి మేనమామ.

అతడు దశరథమహారాజును చూచినాడు. అన్యోన్య కుశల ప్రశ్నలు అయిన తరువాత "రాజా, మా నాయనగారికి తన మనుమణ్ణి చూడవలెను అని బుద్ధిపుట్టింది. అందుకోసము నన్ను అయోధ్యానగరానికి పంపించినారు. మీరు మీ నల్గురు కొమారులతోనూ రాముడి వివాహానికి ఇక్కడికి వచ్చినట్టుగా నాకు అక్కడ చెప్పినారు. పెండ్లికొడుకును చూచినట్టూ అవుతుంది; మీ దర్శనము చేసినట్టూ అవుతుంది, నేను వచ్చినపని నెరవేరుతుంది అని నేను ఏకాఏకీ బయలుదేరి ఇక్కడికి వచ్చినాను" అని చెప్పినాడు.

ఆ ప్రియాతిథిని దశరథమహారాజు మెచ్చుకొని ఎంతో చక్కగా సమ్మానించినాడు.

ఆ రాత్రి దశరథమహారాజు కొడుకులతోనూ బంధువులతోనూ పొద్దు పుచ్చినాడు. మరునాడు ప్రభాతకాలాన సమస్తకర్మలూ ముగించుకొని మహర్షుల వెంట జనకమహారాజు యజ్ఞశాలకు బయలుదేరినాడు.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు మంగళస్నానాలు చేసినారు. ఆభరణాలు పెట్టుకొన్నారు. చక్కగా అలంకరించుకొన్నారు. చేతులకు తోరాలు కట్టుకొన్నారు. విజయము అనే ముహూర్తములో వసిష్ఠమహర్షి మొదలు అయినవారివెనుక నడిచినారు. జనకమహారాజు యజ్ఞవాటికలో దశరథమహారాజు దగ్గరకుపోయి కూర్చున్నారు.

అప్పుడు వసిష్ఠమహర్షి జనకమహారాజు దగ్గరకుపోయి "ఓ రాజా, దశరథ మహారాజు పెండ్లికొమాళ్లతో వచ్చి కన్యాదాత కోసము ఎదురుచూస్తున్నాడు. ఇప్పుడు నీ ధర్మము నీవు నెరవేర్పవలెను" అన్నాడు.

జనకమహారాజు మందహాసముచేసి "దశరథమహారాజును నా ద్వారపాలకుడు ఎవడు అడ్డగించినాడు. ఆయన ఎవరిఆజ్ఞకోసము ఎదురుచూస్తున్నాడు. స్వగృహములో ఈ లాంఛనాలు ఏమిటి,

మహర్షీ, చూడండి. నాకుమార్తెలు నల్గురూ మంగళకార్యాలు అన్నీ ముగించి వేదిక దగ్గిర దీపకళికలు మాదిరిగా కూర్చున్నారు. నేనూ సిద్ధముఅయి వచ్చి మిమ్ములను ఎదురుచూస్తూ ఉన్నాను. దశరథ మహారాజు ఇంకా ఆలస్యము చేయడము ఎందుకు" అన్నాడు.

దశరథమహారాజు కుమారులతో అప్పుడు ఆ యజ్ఞశాలలోకి వచ్చినాడు. జనకుడు వసిష్ఠ మహర్షిని చూచి "ఓమహర్షీ తామే ఈ వివాహ కర్మను అంతా చేయించవలెను" అన్నాడు.

అంతట వసిష్ఠమహర్షి విశ్వామిత్ర మహర్షినీ శతానందోపాధ్యాయులనూ తన ఎదుట ఉంచుకొని ఆ పందిరిలో నట్టనడుమ యథాశాస్త్రముగా అగ్నివేదిని విర్పరచినాడు. గంధ పుష్పాదులతో ఉన్న సువర్ణపాలికలనూ మొక్కలు ఉన్న అడుగులేని పాత్రలనూ మొలకలు ఎత్తిన మూకుళ్లనూ ధూపపాత్రలనూ శంఖాలవంటిపాత్రలనూ హోమముచేసే స్రుక్స్రువాలనూ అర్ఘ్యజలపాత్రలనూ పేలాలుఉన్న పాత్రలనూ పచ్చటిఅక్షతలుఉన్న పాత్రలనూ ఆవేదిక చుట్టూ చక్కగా అమర్చినాడు.

ఆ వేదికలో అగ్నిహోత్రాన్ని ఉంచినాడు. హెచ్చు తగ్గులులేకుండా సరిసమానముగా ఉన్న దర్భలను యథాశాస్త్రముగా సమంత్రకముగా పరచినాడు. వధూవరుల అభ్యుదయము కోసము వైదికమంత్రాలతో హోమము చేయసాగినాడు.

అప్పుడు జనకమహారాజు సర్వాభరణభూషిత అయినసీతను వెంటపెట్టుకొని వచ్చి అగ్నిహోత్రము దగ్గర రాముడి ఎట్ట ఎదట నిలుచుండపెట్టినాడు.

"రామా, ఇదిగో సీత. నా కూతురు. ఇక నీకు సహధర్మచారిణి. సమ్మతించవలెను. నీకు శుభము అవుతుంది. నీ చేతితో ఈమె చెయ్యిపట్టుకో. పతివ్రత అవుతుంది. మహాభాగ్యవంతురాలుగా ఉంటుంది. ఎప్పుడూ నీ వెంట నీ నీడమాదిరిగా తిరుగుతుంది" అంటూ రాముడిచేతిలో సమంత్రకముగా నీళ్లు వదిలినాడు.

జనకమహారాజు మంత్రోదకాలతో సీతను ఒప్పచెప్పి సంతోషముతో ఉప్పొంగిపోయి "ఓ లక్ష్మణా, నీకు ఈ ఊర్మిళను ఇస్తున్నాము. అంగీకరించు. ముహూర్తము మించిపోతుంది. ఆలస్యము చేయవద్దు. ఈమె చేతిని నీ చేతితో

పట్టుకో. ఓ భరతుడా, ఈ మాండవి చేతిని నీ చేతితో పట్టుకో. ఓ శత్రుఘ్నా ఈ శ్రుతకీర్తి చేతిని నీ చేతితో పట్టుకో."

"ఓ సౌమ్యులారా, మీకు మా కూతుళ్లు ఇల్లాండ్లు అవుతున్నారు: ముహూర్తానికి ఆలస్యము లేదు" అంటూ ఉండగా వసిష్ఠ మహర్షి అనుమతితో ఆ నల్గురు అన్నతమ్ముల్లూ ఆ నల్గురు అక్కచెల్లెండ్ల చేతులూ పట్టుకొని అగ్నిహోత్రానికిన్నీ జనకమహారాజుకున్నూ మహర్షులకున్నూ ప్రదక్షిణము చేసినారు.

అప్పుడు అంతరిక్షమునుంచి మహాశోభాయమానముగా పూలవాన కురిసింది. దేవ దుందుభులు మోగినవి. అప్సరసలు ఆడినారు. గంధర్వులు పాడినారు. నృత్తగీత వాద్యాదులు చెలరేగుతూ ఉండగా ఆ నలుగురు వధూవరులూ అగ్నిహోత్రాలకు ముమ్మారు ప్రదక్షిణము చేసి వివాహకలాపము పూర్తి చేసినారు.

ఆ నల్గురు తేజస్వంతులూ వారి వారి భార్యలతో విడిదికి బయలు దేరినారు. దశరథమహారాజు వారి వైభవము చూస్తూ మహర్షులతోనూ బంధుమిత్ర పరివారముతోనూ వారి వెంట నడిచినాడు.

## ౭౪

ఆ రాత్రి ఇట్టే గడచిపోయింది. తెల్లవారింది. విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను వారిభార్యలనూ ఆశీర్వదించినాడు. దశరథ మహారాజుకు వీడ్కోలు చెప్పి హిమవత్పర్వత ప్రాంతానికి ప్రయాణము అయిపోయినాడు.

విశ్వామిత్ర మహర్షి వెళ్లిపోగానే దశరథమహారాజున్నూ సపరివారముగా అయోధ్యానగరానికి బయలు దేరినాడు.

అప్పుడు జనకమహారాజు తన నల్గురు కూతుళ్లకూ ఎన్నెన్నో పట్టుచీరలూ మంచి మంచి శాలువలూ అనేక లక్షల ఆవులూ అలంకరించిన గుర్రాలూ రథాలూ ఏనుగులూ వాటితోపాటు కొల్పలాన్ని ఇచ్చినాడు. రూపవంతులు అయిన దాసదాసీ జనాన్నీ వెండి బంగారు నాణ్యాలనూ ముత్యాలూ పగడాలూ మొదలు అయినవాటినీ లక్షలకొద్దీ అరణము ఇచ్చినాడు.

దశరథమహారాజును సాగనంపడానికి ఆయన కొంతదూరముపోయినాడు. అందరికీ వీడుకోలు చెప్పి జనకమహారాజు తిరిగి మిథిలా నగరానికి వచ్చినాడు.

దశరథమహారాజు కొడుకులతోనూ కోడండ్లతోనూ మహర్షులతోనూ చతురంగబలాలతోనూ సాగిపోతూ ఉన్నాడు. అప్పుడు ఆయనకు ఎట్ట ఎదట దుర్నిమిత్తాలు తోచినవి.

వసిష్ఠమహర్షిని చూచి "ఓ మహానుభావా, మహాభయంకరము అయిన పక్షులు ఆకాశములో తిరుగుతూ ఘోరముగా కూస్తూ ఉన్నవి. భూమిమీదఅయితే జంతువులు మనకు ప్రదక్షిణముగా వస్తూ ఉన్నవి. నా గుండెలు అదిరిపోతున్నవి. దిగులు వేస్తూ ఉంది. దీనికి కారణము ఏమిటి" అని ప్రశ్నించినాడు.

వసిష్ఠమహర్షి "రాజా, ఇందుకు ఫలము చెప్పుతున్నాను. విను. ఆకాశములో సంచారము చేస్తూ ఉన్న పక్షుల కూతలనుంచి ఇప్పుడు మనకు ఏదో భయంకరావస్థ సంప్రాప్తము అవుతుంది అయితే భూమిమీద మనకు ప్రదక్షిణముగా వస్తూ ఉన్న మృగాలనుంచి ఆ భయంకరస్థితి ఉపశమించిపోతుంది" అంటూ ఉన్నాడు.

ఈపృథ్వినిఅంతా కదిలించేట్లుగా గాలివీచింది. అప్పటికి అప్పుడు మహోన్నత వృక్షాలు నేలకూలినవి. సూర్యుడు కనబడకుండా ఇట్టే చీకట్లు కమ్ముకొన్నవి. దిక్కులు తెలియకుండాపోయినవి. ఆ గాలికి రేగిన దుమారములో చతురంగసేనలూ కూరుకొనిపోయినవి. సైనికులు అందరూ సొమ్మసిల్లిపోయినారు.

వసిష్ఠుడు మొదలుఅయిన మహర్షులున్నూ దశరథమహారాజూ ఆయన నలుగురు కొమాళ్లూ తప్ప తక్కినవారు అందరూ విచేతనులు అయిపోయినారు. ఇంకా చీకట్లు అలముకొన్నవి. ఈ జగత్తును అంతా నల్లటిమసి కప్పినట్లు అయిపోయింది.

ఆ చిమ్మచీకటిలో కళ్లు మిరుమిట్లు గొలిపే కాంతులు బయలుదేరినవి. ప్రళయకాలాగ్నిమాదిరిగా దుస్సహముఅయిన వేషము వేసింది. దుర్ధర్షము అయిన కైలాసపర్వతమువలె ఒక భయంకరాకారుడు వారి కళ్లకు పొడగట్టినాడు. దట్టము అయిన జడలు ఆయన తలనిండా పెరిగి ఉన్నవి. భుజముమీదనుంచి గండ్రగొడ్డలి వ్రేళ్లాడుతూ ఉంది. మెరుపులమాదిరిగా మెరుస్తూఉన్న బాణాలూ విల్లూ పట్టుకొని త్రిపురాసురసంహారానికి పోతూ ఉన్న ఫాలాక్షుడిమాదిరిగా వారి ఎట్టఎదుట నిలుచున్నాడు.

ఆయన రాజరాజులను అందరినీ మర్దించిన పరశురాముడు.

అగ్నిహోత్రము మాదిరిగా జ్వలిస్తూ ఉన్న ఆ భార్గవరాముణ్ణి జూచి జపహోమపరాయణులు అయిన వసిష్ఠాదిమహర్షులు అందరూ "ఈ పరశురాముడు తన తండ్రిని ఒక క్షత్రియుడు చంపినాడు అనే కోపముతో పూర్వము క్షత్రి



"ఓ భార్గవా—నిన్ను గురించి ఇదివరకే విన్నాను. నీవు పితృరుణము తీర్చి
కాని నేను వీర్యహీనుణ్ణీ అశక్తుణ్ణీ అనుకొని నన్ను అవమానిస్తున్నావు. నా
చూపిస్తాను" అంటూ రాముడు కోపోద్రేకముతో పరశురాముడి చేతిలోవున్న
త్రాటిని ఎక్కించినాడు. బాణము స



ఆ విషయములో మేము అందరమూ నిన్ను అనుసరించవలసిందే. [illegible]ము చూపించమంటున్నావు. ఇప్పుడే నా తేజమూ నాపరాక్రమమూ వింటినీ అంబునూ ఊడలాగుకొన్నాడు. ఆ వింటిని ఇట్టే వంచి అల్లె [illegible]ంచినాడు. —(140-వ పుట.)

యులను అందరినీ సంహారము చేసినాడు. క్షత్రియులమీద కోపతాపాలు ఈయనకు ఇదివరకే తీరిపోయినవి. ఇప్పుడు మళ్ళీ ఎందుకు బయలుదేరినాడో. క్షత్రసంహారానికి మాత్రము వచ్చి ఉండడు" అనుకొన్నారు.

అంతట ఆ మహర్షులు అందరూ అర్ఘ్యాదులు తీసుకొనిపోయి ఆ భయంకరాకారుణ్ణి చూచి "రామా, ఓ భార్గవరామా" అంటూ మనోహరముగా సంబోధించి అర్ఘ్యము ఇచ్చినారు.

ఆ ఘోరాకారుడు ఆ అర్ఘ్యాన్నీ పూజా ద్రవ్యాలనూ అందుకొని దశరథ రాముడి వంక చూడసాగినాడు.

౭౫

"ఓ దాశరథీ, ఓ రామా, నీ అద్భుత పరాక్రమాన్ని గురించి విన్నాను. నీవు శివధనుస్సును విరిచివేయడమూ విన్నాను. నీ కోసము ఇక్కడికి వచ్చినాను. నేను ఇప్పుడు మరి ఒక చక్కని విల్లు తెచ్చినాను. ఇది నా తండ్రి జమదగ్నిది. దీనిలో నీవు బాణము ఎక్కించవలెను. నీబలము ఇప్పుడు చూపించవలెను. నేను మెచ్చుకొంటాను. నీవు ఈ వింటిని ఎక్కుపెట్టకలిగేట్లయితే నీ ఒక్కడితోటే యుద్ధము చేస్తాను" అన్నాడు పరశురాముడు.

ఈ మాటలకు దశరథమహారాజు ముఖము వెలాతెలాపోయింది. దీనుడు అయిపోయి "ఓభార్గవరామా, నీకు క్షత్రియులమీద కోపము ఎప్పుడో తీరిపోయింది. ప్రశాంతచిత్తుడవు అయినావు. నీవు బ్రాహ్మణుడవు. మహాయశస్వివి. నా పుత్రులు పసివాండ్లు. నీవు వాండ్లను కాపాడవలెను ఓ పరశురామా, ఎప్పుడూ వేదాధ్యయనము చేసుకొంటూ చాంద్రాయణాది వ్రతాలుపట్టుతూ ఉండే భార్గవులవంశములో పుట్టినావు. శస్త్రాస్త్రాలను వదలిపెట్టుతున్నాను అని దేవేంద్రుడి ఎదుట ప్రతిజ్ఞ చేసినావు. ధర్మపరాయణుడవు అయిపోయి ఈవసుంధరను అంతా కాశ్యపుడికి దానము ఇచ్చివేసినావు. మహేంద్రపర్వతము మీద తపస్సు చేసుకొంటూఉన్న నీవు ఇప్పుడు మాసర్వనాశానికి వచ్చినట్టుగా ఉన్నావు. ఒక్క రాముడితోటే యుద్ధము చేస్తాను అంటున్నావు. వాడికి ఏ అపాయము వచ్చినా మేము ఎవరమూ బ్రతుకము" అన్నాడు దశరథ మహారాజు.

ఈ మాటలు వినిపించుకోకుండా దశరథమహారాజును అలక్ష్యము చేసి రాముడితో "ఓ దాశరథీ, నీవు విరిచిన విల్లూ ఇప్పుడు నేను తెచ్చిన ఈ విల్లూ

దేవలోకములోవి. రెండూ గొప్పవి. శ్రేష్ఠము అయినవి. ముఖ్యము అయినవి. గట్టివి. సారముగలవి. వీటిని రెంటినీ విశ్వకర్మ ప్రత్యేకముగా నిర్మించినాడు. ఈ రెంటిలో ఒకదానిని త్రిపురాసుర సంహారముకోసము దేవతలు శివుడుకి ఇచ్చినారు. రెండవదానిని విష్ణుమూర్తికి ఇచ్చినారు. నీవు విరిచి వేసింది శివధనుస్సు. ఇప్పుడు నేను తెచ్చిన ఈ పరమభాస్వరము అయిన ధనుస్సు విష్ణుమూర్తిది.

త్రిపురాసుర సంహారము అయిపోయినతరువాత శివకేశవుల బలాబలాలను దేవతలు తెలుసుకోవలెను అనుకొన్నారు. ఎవరు ఎక్కువ బలవంతులు అని బ్రహ్మదేవుణ్ణి ప్రశ్న చేసినారు. ఆయన సత్యసంధుడు. శివకేశవుల బలాబలాలను స్వయముగా చెప్పడానికి బ్రహ్మదేవుడికి ఇష్టములేక పోయింది. అందువల్ల శివుడికీ విష్ణుకూ విరోధము పెట్టినాడు. వారికి విరోధము పెచ్చు పెరిగిపోయింది. పరస్పర విజిగీషులు అయినారు. యుద్ధముచేయ నారంభించినారు.

ఆ యుద్ధము మహాభయంకరముగా సాగింది. విష్ణుమూర్తి అంతట హుంకారము చేసినాడు. ఆ హుంకారానికి శివుడి ధనుస్సు కట్టెబారిపోయింది. త్రిలోచనుడు స్తబ్ధుడు అయి నిలుచున్నాడు.

దేవతలూ మహర్షులూ మొదలు అయినవారు అందరూ శివకేశవులు ఉభయులూ ప్రశాంతులు అయ్యేటందుకు ప్రార్థించినారు. శివుడు ఆ వింటిని బాణముతో కూడా దేవతలచేత విదేహరాజు అయిన దేవరాతుడికి ఇప్పించినాడు. ఆ శివధనుస్సును నీవు విరిచివేసినావు.

నా దగ్గర ఉన్న ఈ విల్లు విష్ణుమూర్తిది. దీనిని విష్ణుమూర్తి ఋచీక మహర్షికి నిక్షేపముగా ఇచ్చినాడు. ఆ తేజస్వి దీనిని ఆయన కుమారుడు జమదగ్నికి ఇచ్చినాడు. ఆ జమదగ్ని నా తండ్రి. మహాత్ముడు. తపోబలసమన్వితుడు. ప్రతీకారము ఎరగనివాడు. అస్త్రసన్యాసముచేసిన మా తండ్రి జమదగ్నిని కార్తవీర్యార్జునుడు తామసబుద్ధితో చంపివేసినాడు. ఆ విధముగా అంత దారుణముగా ఎప్పుడూ ఎవరూ ఎవరినీ చంపివేయరు. మా తండ్రి చావు నాకు తెలిసింది. పట్టరాని కోపము వచ్చింది. అంతట నేను క్షత్రియవంశాలను అన్నిటినీ నిర్మూలనము చేయడానికి బయలుదేరినాను. అనేకమంది క్షత్రియులను సంహారము చేసినాను. ఈ భూలోకాన్ని అంతా నేను స్వాధీనము చేసుకొన్నాను.

అప్పుడు నేను ఒక యజ్ఞముచేసినాను. ఆ యజ్ఞములో ఈ భూభాగాన్ని అంతా మహాత్ముడూ పుణ్యకర్ముడూ అయిన కాశ్యపుడికి దక్షిణగా ఇచ్చి వేసినాను. అంతట నేను మహేంద్రపర్వతానికి వెళ్లిపోయినాను. అప్పటి నుంచి అక్కడ తపస్సు చేసుకొంటూ ఉన్నాను.

ఓ దాశరథీ, నీవు శివధనుస్సును విరగకొట్టినావు అని విన్నాను. నీ వీర్యము తెలుసుకోవలెను అని ఈ ధనుస్సుతో వచ్చినాను. ఇది వైష్ణవ ధనుస్సు. పరమపూజ్యము అయింది. శ్రేష్ఠము అయింది. ఇది నాకు పితృ పైతామహముగా సంక్రమించింది. నీవు క్షత్రియుడవు అయినట్లయితే ఈ వింటిని తీసుకొని ఎక్కుపెట్టవలెను. నీవు దీనిని ఎక్కుపెట్ట కలిగేట్లయితే నాతో నిన్ను ద్వంద్వయుద్ధము చేయవిస్తాను" అన్నాడు పరశురాముడు.

## ౭౬

పరశురాముడు చెప్పింది అంతా రాముడు విన్నాడు. పితృసాన్నిధ్య గౌరవమువల్ల నియమితముగా మాట్లాడతలచి "ఓ భార్గవా—నిన్ను గురించి ఇదివరకే విన్నాను. నీవు పితృ ఋణము తీర్చినావు. ఆ విషయములో మేము అందరమూ నిన్ను అనుసరించవలసిందే. కాని నేను వీర్యహీనుణ్ణీ అశక్తుణ్ణీ అను కొని నన్ను అవమానిస్తున్నావు. నాక్షాత్రము చూపించమంటున్నావు. ఇప్పుడే నా తేజమూ నా పరాక్రమమూ చూపిస్తాను" అంటూ రాముడు కోపోద్రేక ముతో పరశురాముడి చేతిలోఉన్న వింటినీ అంబునూ ఊడలాగుకొన్నాడు. ఆ వింటిని ఇట్టే వంచి అల్లెత్రాటిని ఎక్కించినాడు. బాణము సంధించినాడు. క్రుద్ధుడు అయినాడు.

"ఓ పరశురామా, నీవు బ్రాహ్మణుడవు అయిపోయినావు. అందులో పూజ్యపాదులు అయిన విశ్వామిత్రమహర్షికి బంధువుఅయిపోయినావు. అందు వల్ల ప్రాణాలు తీసివేసే ఈ బాణాన్ని నీ మీద వదలలేకుండా ఉన్నాను. ఓ భార్గవా! ఈ ధనుస్సు దేవలోకములోది అనీ శత్రుపురాలు అన్నిటినీ జయిం చింది అనీ ఎవరి బలదర్పాలను అయినా నాశనము చేసి వేస్తుంది అనీ నీవే చెప్పి నావు. కొబట్టి ఈబాణము వ్యర్థముగా నేలపాలయిపోకూడదు. ఇప్పుడు ఈబాణ ముతో నీ పాదగమన శక్తిని ఖండించవలెనో నీవు తపోబలముతో సంపాదించిన పుణ్యలోకప్రాపణశక్తిని హరించవలెనో నీవే చెప్పు" అన్నాడు రాముడు.

వైష్ణవధనుస్సును ఎక్కుపెట్టి దివ్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న రాముణ్ణి చూడటానికి అప్పుడు బ్రహ్మదేవుడూ మహర్షులూ దేవతలూ యక్షగరుడగంధర్వ కిన్నర కింపురుష సిద్ధసాధ్యచారణులూ గుంపులు గుంపులుగా అక్కడికి వచ్చినారు. అప్పుడు ఈ భూమి అంతా స్తంభించిపోయింది.

పరశురాముడు నిర్వీర్యుడు అయిపోయినాడు. రాముడి ఎదుట ఆయన తేజస్సుఅంతా అంతరించిపోయింది. జడుడు అయిపోయినాడు. రాముణ్ణి చూస్తూ మందముగా "ఓ రామా, నేను ఈ భూమిని అంతా కాశ్యపుడికి దానము ఇచ్చినాను. నేను ఈ దేశములో ఉండకూడదు అని ఆయన శాసించినాడు. అప్పటి నుంచీ రాత్రిపూట ఈ భూమిమీద ఉండటములేదు. ఇప్పుడు చీకటి పడబోతున్నది. ఇక నేను మనోవేగముతో మహేంద్రపర్వతానికి వెళ్లిపోవలెను. కాబట్టి నాపాదగతిని ఖండించవద్దు. నేను తపోబలముతో అప్రతిమాన పుణ్యలోకాలను జయించినాను. ఆశక్తిని నీ బాణముతో ఇప్పుడే కొట్టివేయవలసింది. ఆలస్యము చేయవద్దు.

ఓ దాశరథీ, నీవు ఈధనువు ఆరోపించినప్పుడే నీవు అక్షయుడవుఅనీ మహావిష్ణువు అనీ అనుకొన్నాను. ఓ పరంతపా నీకు మంగళము. నీవు అసదృశకర్ముడవు. అప్రతిద్వంద్వుడవు. నీవు సాక్షాత్తూ త్రైలోక్యనాథుడవు, ఇటువంటి వాడివల్ల నాకు పరాభవము అయింది. కాబట్టి నేను సిగ్గుపడ నవసరము లేదు. దేవతలు అందరూ నిన్ను చూడవచ్చినారు.

ఓ సువ్రతా, నీ చేతిలోఉన్న అసదృశబాణాన్ని వదిలిపెట్టు. నేను మహేంద్రగిరికి వెళ్లిపోతాను" అన్నాడు పరశురాముడు.

దశరథరాముడు ఆ బాణాన్ని వదిలినాడు.

పరశురాముడి స్వార్జితపుణ్యలోకప్రాపణశక్తి ఆరామబాణముతో హతము అయిపోయింది.

పరశురాముడు దశరథరాముణ్ణి ప్రశంసించి ప్రదక్షిణముచేసి మహేంద్ర పర్వతానికి వెళ్లపోయినాడు. అప్పుడు అన్ని దిక్కులా చీకట్లు విచ్చిపోయినవి.

దేవతలు ఆ ధనుర్ధరుణ్ణి దశరథరాముణ్ణి స్తోత్రము చేసినారు.

## ౭౭

రాముడు ప్రశాంతుడు అయినాడు. ఆ వింటినీ అంబునూ వరుణ దేవుడికి ఇచ్చివేసినాడు.

అక్కడ ఉన్న వసిష్ఠుడూ మొదలు అయిన మహర్షులు అందరికీ నమస్కారము చేసినాడు. భయ విహ్వలుడు అయి ఉన్న దశరథ మహారాజును చూచి "తండ్రీ పరశురాముణ్ణి పరుగెత్తించినాను. వాన చినుకుల కోసము ఎదురు చూచే చాతక పక్షులవలె తమ చతురంగబలాలూ అయోధ్యానగరము పోవడానికి తమ ఆజ్ఞల కోసము ఎదురుచూస్తున్నవి" అన్నాడు రాముడు.

అంతట దశరథమహారాజు రాముణ్ణి గట్టిగా కౌగిలించుకొని శిరము ఆఘ్రాణించినాడు. సంతోషాతిశయముతో ఆయన దేహము అంతా పులకరించింది. రాముడు పునర్జన్మ ఎత్తినట్టు భావించినాడు. అప్పుడు శీఘ్రముగా అయోధ్యానగరానికి వెళ్లి పోవలెను అని దశరథమహారాజు సేనలను ఆజ్ఞాపించినాడు.

దశరథమహారాజు కొడుకులతోనూ కోడండ్లతోనూ అయోధ్యానగరము వస్తూ ఉన్నాడు అని పౌరులకు వర్తమానము వచ్చింది. అయోధ్యానగర వాసులు గబాగబా పెద్ద పెద్దవి చిన్న చిన్నవి జండాలు ఎత్తినారు. రాజవీథులు అన్నిటా కలాపిచల్లి ఘుమఘుములాడే పూలతో అలంకరించినారు. పట్టణము అంతా సింగారించినారు. పౌరముఖ్యులూ బ్రాహ్మణ ముఖ్యులూ మహారాజుకు స్వాగతము చెప్పడానికి ముందుగా కొంతదూరము ఎదురుగుండా వచ్చినారు.

శ్రీమంతులు అయిన కొమాళ్ళతోనూ కోడండ్రతోనూ దశరథ మహారాజు అయోధ్యానగరము చేరినాడు. మంగళవాద్యాలు మారుమ్రోగిపోయినవి. పౌరులూ జానపదులూ బారులు తీరి వీథులలో నిలుచుని చూచి సంతోషించినారు.

దశరథమహారాజు హిమవత్పర్వతము వంటి తన రాజభవనములోకి పోయినాడు. అంతఃపురవాసులు అందరూ అమితానందముతో ఎదురు వచ్చి గంధపుష్పాదులు ఇచ్చి గౌరవించి లోపలికి తీసుకొని పోయినారు.

అంతట కౌసల్యాదేవీ సుమిత్రాదేవీ కైకేయీదేవీ ఇంకా ఇతర రాజాంగనలూ వచ్చి తమ కోడండ్లు సీతా ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తులను చూచి సంతోషపడి ఆదరించి లోపలికి తీసుకొని పోయినారు. ఆ అత్తలు ఆ కోడండ్లను స్నానము చేయించినారు. వారికి చందనచర్చ చేయించినారు. పట్టుచీరలు కట్టించినారు. సొమ్ములు అన్నీ పెట్టించినారు. అంతట వారిని ఆ రాజభవనములో ఉన్న దేవమందిరాలకు తీసుకొని పోయినారు. ఆయా దేవతలను ఆ నలుగురు కోడండ్రూ పూజచేసినారు. దైవ సమక్షములో అత్తగార్లకూ పెద్దలకూ నమస్కారముచేసి అత్తగార్లతో బయలుదేరి కుబేర భవనమును మల్లే ఉన్న ఆరాజభవనములో తమ తమ మందిరాలకు పోయినారు. బ్రాహ్మణోత్తములను

రాధించి వారికి ధనమూ గోధనమూ ధాన్యమూ ఇచ్చి సంతోష పెట్టినారు. ఆ బ్రాహ్మణులు అందరూ వారిని ఆశీర్వదించినారు. వారు అటు తరువాత వారి వారి భర్తలను ఏకాంతముగా కలుసుకొన్నారు.

కొన్నాళ్లు అయిన తరువాత దశరథమహారాజు భరతుణ్ణి చూచి "నాయనా, భరతా, నీ మేనమామ యుధాజిత్ నిన్ను తీసుకొని పోవడానికి వచ్చి ఉన్నాడు. మిథిలానగరము నుంచే నిన్ను పంపించమని అడిగినాడు. నీవు ఆయన వెంట వెళ్ళి రావలెను. నీ తాతా సంతోషపడుతాడు" అన్నాడు.

భరతుడు ప్రయాణము అయినాడు. తల్లులకూ తండ్రికీ రాముడికీ నమస్కారము చేసినాడు. లక్ష్మణుణ్ణి కౌగలించుకొన్నాడు. పోయివస్తాను అని వీడ్కోలు చెప్పి శత్రుఘ్నుణ్ణి వెంటపెట్టుకొని మేనమామతో గిరివ్రజ పురానికి ప్రయాణము అయిపోయినాడు.

భరతశత్రుఘ్నులు వెళ్లిపోయిన తరువాత వారు లేని లోటు లేకుండా రామలక్ష్మణులు ఇద్దరూ నలుగురు పుత్రులవలె తండ్రికి సేవచేయసాగినారు.

రాముడు పితాజ్ఞను శిరసావహించి అయోధ్యాపౌరుల మంచి చెడ్డలను విచారిస్తూ పౌరహిత కార్యాలలో నిరంతరమూ నిమగ్నుడు అయినాడు. అట్లా ఆయా వ్యవహారాలు చక్కపెట్టుతూ ఉన్నా తల్లులకు గురువులకూ ఇంకా ఇతర పెద్దలకూ ఏ ఏ సమయాలలో ఏఏ పనులు చేయవలెనో ఆయా పనులను అన్నిటినీ ఆయా సమయాలలో ఏ మాత్రమూ ఏమరుపాటు లేకుండా నిర్వహిస్తూ ఉండేవాడు.

రాముడి రాజ్యకార్యనిర్వహణ చాతుర్యానికి అయోధ్యా నగరవాసులే కాకుండా దేశాంతర వర్తకులూ జానపదులూ మెచ్చుకొంటూ ఉండేవారు.

ఎన్నో రాజకార్యాలు ఎంతో నిపుణముగా నిర్వహిస్తూ ఉన్నా రాముడి మనస్సు ఎప్పుడూ సీత మీదనే ఉండేది. ఆమెతో ఆయా ఋతూచిత సమస్త సుఖాలూ అనుభవిస్తూ ఉండేవాడు. రాముడికి సీతమీద అంత మక్కువకు కారణము ఆమె తన సౌజన్య సౌందర్య సౌశీల్య సద్గుణాదులతో సంతోష పెట్టుతూ ఉండడము వల్లనే కాదు; తన తండ్రి దశరథమహారాజు చూచి ఆలోచించి సమాధానపడి చేసిన భార్య అయినందు వల్లకూడానూ.

రాముడికి సీతమీద కన్నా సీతకు రాముడి మీద అనురాగము ద్విగుణముగా ఉండేది. అయితే ఆమె హృదయములో నిగూఢముగా ఉండే విషయాలను కూడా రాముడు ఇట్టే కనిపెట్టేవాడు.

ఆమె మైథిలి. మైథిలీదేశవాసులకు పరేంగిత జ్ఞానము అపారము. ఆమె జనక రాజపుత్రి. అందువల్ల ఆమె యుక్తాయుక్త వివేచనా శక్తి అనంతము.

ఆమె దేవ కన్నెలతో సరిసమానము అయిన రూపసి. మహాలక్ష్మీదేవి అంతటి ప్రగల్భ. అందువల్ల రాముడి మనోగతము రాముడికన్నా ఎక్కువగా ఆమెకు తెలుస్తూ ఉండేది.

ఆ ఉత్తమ రాజకన్యతో ఆ మహాసౌందర్యవతితో ఆ గాఢానురాగవతితో రాముడు మహాలక్ష్మీ సమేతుడు అయిన మహావిష్ణువువలె విరాజిల్లినాడు—

బాలకాండ సమాప్తము.

